1 2944-
150

# త్రో రో

విల్లియం కాంద్రి



అనువాదం:
Dr. G. V. కృష్ణరావు



ఓరియంట్ లాఙ్మన్స్
36A, మౌంట్ రోడ్, మదరాసు-2
బొంబాయి: కలకత్తా: న్యూఢిల్లీ
1962

శ్రీ

# విషయసూచిక


| | | | | | పుట |
|---|---|---|---|---|---|
| అధ్యాయము | 1 | ... | ... | ... | 1 |
| ,, | 2 | ... | ... | ... | 14 |
| ,, | 3 | ... | ... | ... | 26 |
| ,, | 4 | ... | ... | ... | 45 |
| ,, | 5 | ... | ... | ... | 61 |
| ,, | 6 | ... | ... | ... | 74 |
| ,, | 7 | ... | ... | ... | 87 |
| ,, | 8 | ... | ... | ... | 104 |
| ,, | 9 | ... | ... | ... | 122 |

## అధ్యాయము 1

"ఇప్పటి నా అనుభవం నా బాల్యానుభవంతో పోలదు. నా జీవితం ఆనందమయం."

—తోరో దినచర్య. 1831

మెసచూసెట్స్‌లో వెచ్చని చైత్రదివసం. న్యూ ఇంగ్లండులోని స్వల్పకాలిక మధురవసంతం నిదాఘోచ్చ దశాభిముఖమై పరుగులు తీస్తున్నది. అనంతంగా కనిపించిన చలికాలం కొలది రోజుల క్రిందటనే అదృశ్యమై పోయింది. మంచు మటుమాయ మయింది. నదులు వెల్లి వాడిచి తీసిపోయాయి. మొగ్గలు విచ్చుతున్నవి. పక్షులు పాడుతున్నవి. అశ్వశ్రేణీ చోదకులు తమ గుర్రాల కోసం ఈలలు వేస్తున్నారు. సూర్యుడు ఎల్ల వస్తువులపై ప్రకాశిస్తూ అట్లాంటిక్ మహా సముద్రాన్ని తరళితం చేస్తున్నాడు. కాడ్ అగ్రమందలి దీర్ఘసికతా తీరం వెచ్చదనం వెళ్ళబోస్తున్నది. గంభీరమైన బోస్టన్ నగరపుటిరుకు వీధులలో గూడా సూర్యరశ్మి సంచరిస్తున్నది. సముద్రతీరం వెనుకనున్న అడవులు, పొలాలు,

చిత్తడి నేలలు, పడమటి కొండలు సూర్యమందోష్ణ రుచిరా లయ్యాయి.

వాట్సన్ నగరానికి వాయవ్యంగా ఇరవై మైళ్ళ దూరంలో కంకార్డు అనే గ్రామం ఉన్నది. అది చిన్నదీ కాదు, పెద్దదీకాదు. ఆ గ్రామస్థులు సూర్యసందేశాన్ని తలకొక రీతిగా అర్థం చేసుకొని తగినట్లు ప్రవర్తిస్తున్నారు. దుక్కులకు, నాట్లకు త్వరపడండని సందేశిస్తున్నట్లు కొందరూహించారు. చెట్లుకొట్టి కలప చేరవేయ వలసిన తరుణం వచ్చిందని చెబుతున్నట్లు కొందరు భావించారు. ఇండ్లబూజు దులపాలని కొందరూ, తోటపని కుపక్రమించాలని మరి కొందరూ అనుకొన్నారు. కొలది మంది అంటే, తోరో కుటుంబం మాత్రమే, ఆనందకాంక్షతో వాహ్యాళికై పొలాలకు అడవులకు బయలుదేరి మంచాతపాన్ని సార్థకం చేయాలను కొన్నది. ఆ కుటుంబం ఒక్కటే అడవులకు బయలుదేరింది. అది క్రీ. శ॥ 1830. ప్రకృతి రామణీయకాన్ని వర్ణించే సాహసం కవులకు మాత్రమే ఉన్నది. మరొక 75 సంవత్సరాలు పోతేనే కాని బాహ్య దేశసంచారోద్యమం సమాజానికి వారాంత విహార యాత్రగా మారదు.

అది వసంత ఋతువులో మొదటి శనివారం. తోరో కుటుంబం ఆ ఋతువున తొలి విహారయాత్ర చేస్తున్నది. ఆ కుటుంబంలో 11 ఏండ్ల సోఫియా వెళ్ళుతూ, వెళ్లుతూ పూలు సేకరిస్తున్నది. హెన్రీకి 13 సంవత్సరాలు. ఆటవికుడైన ఇండియన్ వలె అతడు పరుగులు తీస్తున్నాడు. అతనికంటె రెండేళ్లు పెద్దవాడైన జాన్ అంత ఉత్సాహి కాడు. ఆటవికాను కరణం కంటె పక్షుల పరిశీలనమే అతన్ని ఎక్కువగా ఆకర్షిస్తున్నది. వారితో 18 సంవత్సరాల హెలెన్ ఉన్నది. పై ముగ్గురికంటె

ధీరమై అప్పుడే ఆమె జిజ్ఞాసతో వృక్షశాస్త్రానుశీలనం ప్రారంభిం చింది. ఇక వారి తల్లి తండ్రులున్నారు. వసంతపవన చుంబనంతో వారు కూడ పులకితులయ్యారు. గ్రామీణ వాతావరణమన్నా, నైసర్గిక వస్తువులన్నా తమ పిల్లలకు మక్కువ కలిగించాలని ఉబలాట పడుతున్నారు. వారాంత విహారయాత్రల యందలి కార్య కలాపాలో చాలవరకు తల్లియే ఆ కుటుంబానికి నాయకత్వం వహించేది. అందు ఎక్కువ కౌతుకం చూపుతుండేది. ఇలాంటి విహారయాత్ర చేస్తున్న సమయంలోనే ఆమె ఒకసారి ప్రసవించేదే నట. అంటే ఆమెకు ఆ యాత్రలలో అంత పట్టుదల ఉన్నది.

పొరవరి కాని తండ్రి తన యింటి కానుకొని ఉన్న తన చిన్న పార్మాగారానికి శనివారం అపరాహ్ణాన తాళం పెట్టేవాడు. ఇంగ్లండు జర్మనీ దేశాల పోటీకి తట్టుకొని పెన్సిళ్ళను ఎలా తయారుచెయ్యాలా, ఎలా పోకడ పెట్టాలా అన్న చిక్కులను అప్పటికి మరచి తన కుటుంబం వెంట అడవులకు బయలుదేరే వాడు. ఈ పని కొన్నేండ్లనుంచి జరుగుతున్నది. ఈ ప్రశాంత వ్యక్తి పెన్సిళ్ళను గూర్చి అరణ్య విహారాలను గూర్చి ఏమి ఆలో చించే వాడో మనకు తెలియదు. చెప్పేది వినేవాడు. కాని ఆట్టే మాట్లాడేవాడు కాడు. తీరిక సమయంలో పత్రికలు చదువుకునే వాడు. లేదా కంకార్డు గ్రామానికి రచ్చబండగా ఉన్న మిల్లు డాముపద్దప వెళ్లి అక్కడ చెప్పుకొనే ముచ్చట్లు వినేవాడు. దీనితో ఇరుగు పొరుగుల చరిత్రను ఇతరుల కంటె మెండుగా తెలుసుకో గలిగాడు. ఈ విషయంలో అతని ధారణదొడ్డది. దీని వల్లనే హెన్రీ ఆ చరిత్రను కృతజ్ఞతతో తన దిన చర్యలో వర్ణించ గలిగాడు.

పేరు సూచిస్తున్నట్లు జాన్ తోరో ఫ్రెంచి జాతీయుడు.

అతని ప్రాచీనులు ఫ్రెంచి భూభాగవాసులమని చెప్పుకొనేవారు. కాని జాన్ ముందటితరం వారు మాత్రం జెర్సీలోని చానల్ అయిలెండు రేవు పట్టణమయిన సెయింట్ హెలియర్ నుంచి వచ్చారు. అతని తండ్రి అచటి ఆసవవర్తకుని కుమారుడు. 1773 లో అమెరికాకు వచ్చి బాస్టన్‌లో వర్తకుడుగా నెల కొన్నాడు. వాణిజ్యం మూడు పువ్వులు ఆరు కాయలుగా ఉన్న ఆ రోజులలో అతడక్కడ బాగుపడ్డాడు. దీవులతోను సముద్రం తోను సన్నిహిత సంబంధం గల ఆ వ్యక్తి తన కడపటి రోజులలో ప్రశాంతంగా ఉన్న కంకార్డు గ్రామంలో స్థిరపడిపోయి తుదకక్కడే క్షయరోగానికి ఆహుతి అయ్యాడు. ఈ రోగమే తరువాత అతని కుటుంబాన్ని విడువక పీడిస్తూ వచ్చింది. 1801 లో కంకార్డు గ్రామంలోనే అతడు మరణించాడు. జాన్‌కు తండ్రినుంచి ఆస్తి పాస్తులు లభించాయి. కాని అతని వాణిజ్య నైపుణి మాత్రం లభించలేదు. క్రమక్రమంగా అతడు వ్యాపారంలో పెక్కు నష్టా లకు పాల్పడ్డాడు. 1812 లో సింతియా డన్‌బారును పెండ్లాడాడు. ఆమెకు అతనివల్ల నలుగురు పిల్లలు కలిగారు. కొన్ని సంవత్సరాల పాటు బాస్టన్ కంకార్డు పరిసరాలల్లో అతని కుటుంబం పెక్కు నష్టా లకు గురి అవుతూవచ్చింది. కంకార్డు సివార్లలో ఉన్న ఒకబంధువు పొలాలకు తాత్కాలిక పర్యవేక్షకుడుగా పనిచేస్తుండగా 1817 జులై 12 వ తేదీన అతని మూడవబిడ్డ అయిన డేవిడ్ హెన్రీ*, వాల్డెన్ అడవికికొలది మైళ్లదూరంలో ఉన్న ఇంట ఉద్భవించాడు. ఈఇల్లు పరిసర ప్రాంతానికి తరల్చబడిన నాటినుంచి ఇప్పటికీనిలచి ఉన్నది.

---

*అతని అసలు పేరు డేవిడ్ హెన్రీ. ఇంట్లో హెన్రీ అని పిలిచే వారు. కాని తాను మాత్రం ఏ కారణంవల్లనో హెనీ డి. తోరో అని వ్రాసుకొనేవాడు.

హెన్రీ తల్లి పెక్కురీతుల దొడ్డ యిల్లాలై ఉండాలి. పట్టిన పట్టు వదలక పోరాడే స్వభావం ఆమెకు ఉన్నది. తన పూర్వీకులలో ఒకరైన కర్నల్ ఎలిషా జోన్సునుంచి పొంది దీనిని ఆమె తన రక్తంలో జీర్ణించుకొని ఉండాలి. అతడు టోరీ భూస్వామి అయి బ్రిటిష్ ప్రభుత్వమందు భక్తికలిగి, యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వంతో తీవ్రంగా పోరాడుతూ వచ్చాడు. ఆమె కొంత వరకు ఇంటపెత్తనం చెలాయిస్తుండేది.

తనకు ఇష్టంలేని వాళ్ళకు తన నాలుక వదును చవి చూపించేది. ముచ్చటపడి ఇంటికి పిల్చినవారిపై మాతృప్రేమ వర్షించేది. తన మాతృ ప్రాధాన్యాన్ని ఋజు భాషణంతో, ఉదార వ్యవహృతితో సుస్థిరంగా నెలకొల్పుకొన్నది. ఇతరులను నిరుత్తరులను గావించే ఆమె వ్యక్తిత్వమూ, దండిగా మెదలే ఆమె నోరూ భర్తకు మానసిక బధిరత్వం కలిగించి ఉండవచ్చును. ఆ రెండు గుణాలవల్లనే ఒకనాడు హెన్రీ పారిపోయి తన వాల్డెన్ కుటీరం ఆశ్రయించి ఉండవచ్చును. విషయ విరతి, ధ్యానాసక్తి అతనికి తండ్రి నుంచి సంక్రమించాయి. అతని జీవితంలో ప్రధానంగా గోచరించే శారీరక మానసిక శక్తి తల్లినుంచి సంక్రమించింది. హెన్రీ 40 వ ఏట తన దినచర్యలో వ్రాసుకొన్న ఈ వాక్యాలు అతని జననీ హృదయస్పందన శక్తిని వెల్లడిస్తున్నవి; "మా అమ్మ తన చిన్నతనంలో వర్జీనియా రోడ్డు వద్ద ఉండగా వేసవిరాత్రులందు తాను విన్న ధ్వనులను ఈరేయి చెబుతూ వచ్చింది. ఆవుల అంబారవాలు బాతుల అరపులు దూరాన హిల్ డ్రెత్ ఇంటినుండి వినవచ్చే డోలు మ్రోతలు, వీని అన్నింటికంటె ముఖ్యంగా తన గుర్రాలకోసం జో మరియమ్ వేసే ఈల వర్ణించి

చెప్పింది. అతడు అతి మనోజ్ఞంగా ఈల వేసేవాడు. అర్ధరాత్రాన మేల్కొని లేచి వెళ్ళి ఇంట అందరూ నిద్రపోతూంటే తాను వాకిటి మెట్లపై కూర్చుండే దాననినీ, ప్రపంచంలో మరే ధ్వనీ తనకు వినిపించేదికాదనీ తన వెనుక ఇంట్లోనుంచి గడియారం టిక్కు-టిక్కులు మాత్రం వినవచ్చేవనీ ఆమె చెప్పింది."

తోరోల ఇల్లు ఇల్లు కాదు. అదొక సత్రం. అందున్నది కుటుంబం కాదు. సమాజం. ఎంతమందికి వండి వడ్డించవలసి వచ్చినా హెన్రీ తల్లి విసుగుకొనేది కాదు. నానావిధ బంధువులైన మేనత్తలను, పెద్దమ్మలను, పినతల్లుళ్ళను, స్నేహితులను ఎందరినో తన యింటికి ఆహ్వానించేది. అయితే ఈ అభ్యాగతులలో చాలమంది ఆడవాళ్ళే. యువహెన్రీ ఇంటివద్ద మహిళాలోకం మధ్య నివసించేవాడు.

* * * *

హెన్రీ తోరోకు తన ప్రారంభ విద్యా విశేషాలు అంతగా స్మృతిపథంలో లేవు. వేట, మృగపాద ముద్రానుసరణం, పడవ ప్రయాణం, శిబిరవాసం, ఈత, హిమతలో పరిషేలనం(స్కేటింగ్) వీటితో గడపిన ప్రొద్దులు జ్ఞప్తికి తెచ్చుకోవటం అతనికిష్టం. కంకార్డు పరిసరాలలో ఇసుక బయళ్లు లేదా పీటు బయళ్లున్నవి. అవటి అనూపాలలో చేపలు మెండుగాగలిగి వంకలు తిరుగుతూ ప్రవహించే సడ్బరీ ఎసాబట్ వాహినులు గ్రామంవద్ద కలసి మంద గంభీరమైన కంకార్డు నదిగా ఏర్పడ్డవి. ఈ బయళ్ళతో, అనూపాలతో ఆ పరిసరాలు చక్కని ఆటపట్టులుగా ఉన్నవి. ప్రశాంతాలైన మడుగులు, మాపుల్‌జాతి వృక్షాలు గలిగిన బిత్తడి నేలలు అతివిస్తృతాలయిన దేవదారు కాననాలు (pines) విస్తృత పర్ణ తరువులైన అడవులూ ఉన్నవి. వీటికి పడమర వచూసెట్ పర్వత

శిఖరం ఉన్నది. ఆ వివిక్త శిఖరం యానక్ష్జీవితం అతనిని తన సన్నిధికి ఆహ్వానించింది. అమెరికా అరణ్యాలలోను ప్రయరీ పచ్చిక బయళ్ళలోనూ రెడ్ ఇండియన్లు మాత్రమే వసించిన నాటి విశేషాలను, కంకార్డు వారికావాసమై ఆ నది మస్కెటాక్విడ్ అన్న పేరుతో పిలువబడిన నాటి గాథలను అతడు తన చిన్నతనంలో విని కుతూహల పడేవాడు. ఇరుగు పొరుగువారలకంటె తన్ను విశిష్టుని కావింపనున్న స్వయం సంపూర్ణతా క్రియలో అతడప్పటికే సిద్ధిపొంద సాగాడు. బుద్ధినైశిత్యం కంటె హస్త నైపుణ్యంతో గర్వించబోతున్నాడు.

పశ్చిమాభిముఖులై కంకార్డుమీదుగా నూతన మార్గాన్వేషకులై సాగిపోయే అగ్రగాముల దర్శనం అతనికి తరచు లభిస్తుండేది. అయితే అగ్రగామి లక్షణాలు మాత్రం అంతకు ముందే ఏనాడో న్యూ ఇంగ్లాండులో అంతరించాయి. 19 వ శతాబ్ది ప్రారంభంలో అచట నెలవు లేర్పరుచుకొని వ్యవస్థపొంది కృత్రిమత్వానికి గురి అవుతున్న సమాజంలో అగ్రగామి లక్షణాలు లేవు. అంటే శారీరక మానసిక అవిశ్రాంతి, భారవిరహిత ప్రయాణబుద్ధి, బాహ్యదేశనివాసోత్సుకత, నూతన మార్గాన్వేషణానక్తి విన్నైకోపస్థితి కాంక్ష కనిపించేవి కావు. కఠోరపరిశ్రమ, ఆత్మనిగ్రహం, పొదుపరితనం పాటించి, న్యూ ఇంగ్లండు వాణిజ్యమందే కాక సంస్కృతి యందు గూడ అత్యున్నత స్థానం సాధించింది. హార్వర్డు, ఏల్ అన్న రెండు విశ్వ విద్యాలయాలను నెలకొల్పుకొన్నది. ఈ విశ్వ విద్యాలయాల ద్వారా, ప్రగతి మనస్కులైన న్యూ ఇంగ్లండు వాసులు ఆధునిక ఐరోపా విచారధారతో, ముఖ్యంగా జర్మనీ బ్రిటనుల భావాలతో సన్నిహిత పరిచయం సంపాదించారు. కంకార్డులో నివసిస్తున్న రెండువేల మంది

ప్రజలు ఆ నాటి అగ్రగామి భావాలకు ఇలా సన్నిహితంగా ఉన్నారు. మత విషయంలో నాటి మేధావులైన నాయకులు ఇతోధిక స్వాతంత్ర్యప్రదమైన యూనిటేరియనిజమ్ అవలంభించారు. అది విశిష్టకాలం. నాడు గాఢమైన ఆధ్యాత్మిక అశాంతి ఉండేది. ఉత్తుంగ ఆశాభావం జయలుదేరి, కర్మవాద దిగ్ధనైరాశ్యాన్ని పటాపంచలుచేసి స్వాతంత్ర్య తేజస్సును వేలార్చి, అనుషంగికంగా ఆదర్శవాది పరంపరలను భూలోకస్వర్గ సంస్థాపనాసక్తులను, బూజుపట్టిన న్యాయాలను అంగీకరించని వారిని ఉత్పాదించింది. మొదటి నుంచీ తన ఇంట తోరో విప్లవ సంస్కరణ ధూమితస్థితిగతులందు పెరిగాడు.

బాల్యంలో అతడు స్నిగ్ధ కుటుంబమందు సుఖంగా గ్రామీణ విద్యార్థిగా వర్థిల్లాడు. ఇంకా అతనిలో తిరుగుబాటు లక్షణాలు కాని, కౌమార దశలో ప్రస్ఫుటమైన విమర్శక దృష్టి కాని పొడ సూప లేదు. అతనికీ, పాఠకరైన లేని అతని సావాసగాండ్రకూ నాడు ఒకటే వ్యత్యాసం ఉండేది. అతని తల్లి దండ్రులు తమ పెండ్లికి ముందనుభవించిన మంచి రోజులు మరచిపోలేదు. జాన్ తోరో వర్తకుడైన తన తండ్రి సంపదలను విస్మరించలేదు. సింతియా తోరో తన తల్లిదండ్రుల వంశాల నలంకరించిన వృత్తి విద్యా నిపుణలను, భాగ్యవంతులైన భూస్వాములను మరచి పోలేదు. అందువల్ల తాము నిరుపేదలయి నానావస్థలు పడుతున్నా, తమ పిల్లలకు ఉన్నత విద్య నేర్పించవలెనని శక్తివంచన లేకుండా పాటుపడ్డారు. తన ఇంట లెడ్‌పెన్సిల్ కార్ఖానాన్ని నెలకొల్పి జాన్ తోరో, డబ్బు చెల్లించే అభ్యాగతులను అప్పుడప్పుడు ఆదరించి అతని భార్య ఈ పని సాధించగలిగారు. తండ్రి తన క్రొత్త పరిశ్రమను నెలకొల్పేనాటికి హెన్రీ ఆరేండ్లవాడు.

హెన్రీ మొదట బాస్టన్ స్కూలులో చదువుకొన్నాడు. ఆ నగర వీధులు అతనికి ప్రాథమిక స్మృతిపథాలలో నిలిచి పోయాయి. అతడు అయిదేండ్లవాడై ఉండగా ఒక వేసంగి రోజున అతని పెద్దమ్మ ఒకతె అతనిని బాస్టన్ నుంచి విహారార్థం వాల్డెన్ అన్న అద్భుత ప్రదేశానికి కొనిపోయింది. అక్కడ దేవదారు వృక్షాలూ (pines), ఉజ్జ్వల సరోవరం ఉన్నవి. అతడు తరువాత తన దినచర్యలో ఇలా వ్రాశాడు :—"ఆ అటవీ దర్శనమే చాలాకాలం నా స్వప్నాలకు రమణీయాంబర మయింది. ఆ మధుర ఏకాంతతను నా మనస్సు ఆ రోజులలో కాంక్షించినట్లు కనిపించింది." ఈ విధంగా బాల్యంలోనే అతడు ప్రకృతి సౌందర్య తేజాలను చూచి ఉత్కటానందం పొందేవాడు. ఆ ఆనందాన్ని ఇలా వర్ణించాడు : "జీవితం ఆనంద మూలం. మడుగులలో ఎగిరి పడే చేపపిల్లలను, వేసంగి మలిప్రొద్దులందు బయలుదేరే అసంఖ్యాక కీటకాలను. వసంత ఋతువులో నిరంతర ధ్వనిలో అరణ్యాలను ప్రతిధ్వనింపజేసే హైలా అనే కప్ప ఎలుగును, పరిష్కృతవర్ణ చిత్రిత పక్షాలపై యాదృచ్ఛికతా పరిణామాలను మోసుకొని పోయే సీతాకోక చిలుక నిబ్బరాన్ని, ప్రవాహానికి ఎదురీదే మంచి నీటి చేపను స్మరించండి."

విశ్వవిద్యాలయ ప్రవేశార్హత సంపాదించడానికి అతడు కంకార్డు విద్యాసంస్థలో చదివాడు. అపటి పాఠ్యప్రణాళిక, సంప్రదాయాన్ని అనుసరించి గ్రీకు, లాటిను, ఫ్రెంచి భాషలకు ప్రాముఖ్యం యిచ్చింది. ఇక్కడ అతడు నృత్యం, వేణువాదం నేర్చుకొన్నాడు; సంగీత విద్యా శిక్షణ పొందాడు. దీని కతడాసక్తితో ప్రతిస్పందించి ఉంటాడని మనం ఊహించవచ్చు. అయితే ఈ విద్యయందు అతడు నేర్చినది స్వల్పమే అయినా,

అతని జీవితంపై దీని ప్రభావం ప్రగాఢం. ఏ మానవుడు, ఏ ఉపదేష్ట బోధించని జీవితాన్ని ఇది అతనికి బోధించింది. బాలుని ఉత్సాహంలోనే అతడు పుస్తకాల చదువు జీర్ణించుకొన్నట్లు కనిపిస్తున్నది. ఎందుకంటే కౌమారదశలో కనిపించనున్న ఉత్తమ స్థాయి చీకుచింతలు లేని ఆ కాలంలో కనిపించలేదు. కౌమార దశలో అతడిలా వ్రాశాడు: "విద్య తరచుగా ఏమి చేస్తుంది? స్వచ్ఛందంగా వంకలు తిరిగి పారే వాగును తిన్నగా పారే (మురుగు) కాలవగా మారుస్తుంది." ఏది ఎలా ఉన్నా బడిలో అతడు నేర్చుకొన్న లెక్కలు ఉత్తర కాలంలో భూమాపనోద్యోగం సంపాదించటానికి ఉపయోగపడ్డవి. అతడు చేసిన ఉద్యోగాలన్నిటిలో అదే అతని నైజానికి ఎక్కువ అనుకూలంగా ఉన్నది.

లాటిను, గ్రీకు, ఫ్రెంచి భాషలలోను గణితంలోను గాఢ పరిజ్ఞానం సంపాదించి పేదవిద్యార్థులకు లభించే ఉచిత వేతనం పొంది పదునారవ ఏట హెన్రీ తోరో హార్వర్డు విశ్వ విద్యాలయానికి వెళ్లాడు. కళాశాలలో అతడు చక్కని ప్రావీణ్యం సంపాదించి మూడేళ్ళలో పరీక్షకులను సంతృప్తిపరచాడు. కాని విశిష్టతను మాత్రం గడించలేదు. బహుశః అతని అభిరుచులు ఉదారాలై గ్రహించిన విషయాలు అతి విస్తృతాలై, అతని దృక్పథం అత్యంత స్వతంత్రమై ఉండవచ్చును. అతని దృష్టిలో విశ్వ విద్యాలయం ఇతరుల భావాలకు ఇతర యుగాలకు పరిచాయక ద్వారమే కాని సామాజిక సంసర్గ సంపాదకమూ కాదు, వృత్తి యోగ్యతా పాదకమూ కాదు. వీలైనంతవరకు కళాశాలా గ్రంథాలయంలో కాలం గడపేవాడు. అధికారిక పాఠ్య ప్రణాళికను సరకుచేయక తాను వరించిన విషయాలను చదువుకొనేవాడు.

ముఖ్యంగా జర్మను సాహిత్యం, పదిహేడవ శతాబ్ది ఆంగ్ల సాహిత్యం తిరగవేయడం, అతనికి అలవాటు. హార్వర్డు నుంచి వచ్చేనాటికి తాను పరీక్ష యిచ్చిన అన్ని శాఖలకంటె వీనిలోనే అతనికి విశేష పరిజ్ఞానం ఉండాలి. అతడు విసుగువేసట ఎరుగని చదువరి. యావజ్జీవితం అతడు హార్వర్డు గ్రంథాలయం నుంచి పుస్తకాలు తీసుకొని చదువుతూనే వచ్చాడు.

హార్వర్డు విశ్వవిద్యాలయానికి నిశ్చింతగా వెళ్లి విశ్రాంతిలో అనిశ్చితితో తిరిగి వచ్చాడు. అతని హార్వర్డు జీవితంలోని స్థూలాంశాలు మాత్రమే మనకు తెలుస్తున్నవి కాని ఆంతరంగిక జీవిత విశేషాలు తెలియడంలేదు. అతడు కళాశాలలో గడపిన సంవత్సరాలు విశేషరహితంగా గడిచినట్లున్నవి. విశ్వవిద్యాలయ సామాజిక జీవితంలో అతనికి అంత ఆసక్తి లేదు. హార్వర్డులో ఉండగా అతనిని ఎరిగిన విద్యార్థులు అతనిని గూర్చి విరుద్ధాభిప్రాయాలు ప్రకటించారు. అతడు చదువుకొన్న రోజులలోనే ఆ విశ్వ విద్యాలయంలో చదివిన జాన్ వైస్ అన్న విద్యార్థి వెలువరించిన అభిప్రాయమే తోరోను గూర్చి యథార్థ ప్రియంకర చిత్రాన్ని ప్రసాదిస్తున్నది: "ఆ ప్రశాంత ప్రవృత్తి మాటున వికసిస్తున్న ఉత్తమ ప్రతిభను మేము ఊహించలేకపోయాము. వ్యక్తిగతాభిరుచులలో పేర్కొనదగిన విశేషం కనుపించలేదు. కాకపోతే ప్రాచీన ఆంగ్ల సాహిత్యంలో అతనికి అమితాసక్తి ఉండేది. గవర్, ఛాసర్ కవులనాటి నుండి ఎలిజబెత్ యుగంనాటి వరకు ఉన్న కవుల కావ్య సంపుటులు అతనివద్ద ఉండేవి. ఈ గనిలో అతడు ఉత్సాహంతో పరిశ్రమించాడు.... అతడు ప్రజల సంగతి పట్టించుకోలేదు. సహాధ్యాయులు అతని కతి దూరస్థులుగా కనిపించేవారు. ఈ సమాధ్యవస్థ ఎల్లప్పుడు అతని దుస్తులకంటె

సన్నిహితంగా ఆవరించి ఉండేది. అతని లలాటం భావశోభి కాకపోయినా ప్రశాంతంగా ఉండేది. అయితే అందు మాంద్యం కనిపించేది...అతని కన్నులు మాత్రం ఒక్కొక్కప్పుడు ఏదో పోగొట్టుకున్నట్లు, దేనినో కనుగొనబోతున్నట్లు కనిపించేవి. మార్గపార్శ్వాలలో ఉన్న ప్రకృతి రహస్యాలనునేర్చుకొనే తచ్ఛిశువు చూపువలె ఆ చూపు కనిపించేది. అల్పసహనులైన పరిశీలకులకు అందని చేతనాచేతన ప్రపంచ సూక్ష్మ లక్షణాలను గ్రహించి, అతని కన్నులు, వానితో పుస్తకాలను నింపివేశాయి. ఇతరు లూహించి ఎరుగని భూతల విశేషాలెన్నో అతడు గ్రహించాడు...అతనప్పుడే ఏదో ఒకానొక వాల్డెన్ సరోవర తీరంలో తపోనిష్ఠుడై తాత్కాలికకు తీరం నిర్మించుకొని అందు నివసింప సాగాడు. కాగా కళాశాలలో మా నుంచి తాను దూరంగా ఉన్నాడంటే ఆశ్చర్యం లేదు..."

ఇప్పటి కతని మనస్సు జాగృతి పొందింది. భావిగద్య విద్యాప్రవీణుడు ఆంగ్ల సాహిత్యంలో తను కనుగొన్న ఉత్తమ లక్ష్యాలను జీర్ణించుకొని పద్యాలు వ్రాస్తూ వచ్చాడు. భవిష్య సమాజ విమర్శకుడు తన సహచరులైన హార్వర్డు విద్యార్థులపై విమర్శక బాణప్రయోగం ప్రారంభించాడు. సెలవులలో కంకార్డుకు వచ్చినప్పుడు హార్వర్డు విద్యార్థి సమాజంపై తన నిశితచతురోక్తులు జలిపించి రాల్ఫ్ వాల్డో ఎమర్సన్‌ను ఆనందపరవశుణ్ణి చేశాడు. దానికి ఎంతో మెచ్చుకొని అతడు తోరోను అతని కళాశాల జీవిత చరిత్రను వ్రాయవలసినదని ప్రోత్సహించాడు.

కాని హెన్రీ ఆ సూచనను పాటించి రచన కుపక్రమించ లేదు. అంతకంటె అతడు ఈస్కిలస్ కావ్యానువాదానికో లేదా, స్వకీయ పద్యకావ్య రచనకో సిద్ధంగా ఉన్నాడు. అప్పుడే అతని

చెవులకు విధి దుందుభి విచిత్ర లయను వినిపించసాగింది. అతడు ఆ లయ కనుగుణంగా బయలుదేరనారంభించాడు. యంత్ర తుల్యోద్యోగాలకు కొరగాని ఆ లయ అతనిని స్వకీయ విచిత్ర మార్గాన నడపబోతున్నది.

---

19

## అధ్యాయము 2

"యదృచ్ఛాబంధం ముడిచిన వట్టి జతవాల మూటను"—తొరో

హార్వర్డు విశ్వ విద్యాలయం తొరోను పండితుని గావించ టమే కాదు వలసిన శిక్షణ ఇచ్చి రచయితను చేసింది. ఆనాడు ఆ విశ్వ విద్యాలయంలో సుప్రసిద్ధుడైన ఎడ్వర్డు టి. చానింగ్ అలం కార శాస్త్రాచార్యుడుగా ఉండేవాడు. న్యూ ఇంగ్లండులో తరువాత బయలుదేరనున్న పునర్వికాసోద్యమ నాయకులు ఎమర్సన్, ఆలి వర్ వెండల్‌హోమ్సు మున్నగువారు అతనివద్ద శిక్షణ పొందిన వారే. క్రమికతకు, యుక్తి యుక్తతకు ఆదర్శప్రాయమైన శైలిని అతడు హెన్రీకి కరపాడు. విద్యార్థుల భావాలను అతడు సునిశితంగా విమర్శించేవాడు. కళాశాలలో తాను వ్రాసిన వ్యాసా లను తొరో భద్రంగా దాచిపెట్టాడు. అప్పటి ఆలంకారిక శిక్షణ ఎంత ఉత్తమంగా ఉండేదో ఆ వ్యాస శీర్షికలే మనకు స్పష్టం చేస్తున్నవి. గంభీరమైన మానవ ప్రవృత్త్యంశ మొకదాని నధిక రించి తీక్ష్ణవ్యాసం తయారు చేయాలంటే మిక్కిలిగా శ్రమపడాలి.

ఎంతో విసుగు కలుగుతుంది. హెన్రీకూడా తన సహాధ్యాయుల వలనే కృత్రిమ నీరసవ్యాసాలు కొన్ని వ్రాశాడు. ప్రాథమిక దశ లోనే సమాజ విమర్శనయందు అతడు స్వతంత్ర మార్గం త్రొక్కాడు. హార్వర్డ్‌లో మొదటి సంవత్సరం చదువుతున్న రోజులలోనే అతనిని గూర్చి ఎమర్సన్ తన దిన చర్యలో ఇలా వ్రాశాడు. "ఆ విద్యార్థి చెప్పే ప్రతి విషయం సమాజాన్ని పరిహ సిస్తుంది. కాని నిజానికి అతని తాత్పర్యం గంభీరం. దానికంటె నిశితంగా ఆలోచించవలసిన విషయం మరొకటి ఉండదు." హార్వర్డ్‌లో ఉండగా ఆయన తన భావాలు తనలోనే దాచుకొనే వాడు. ఒకసారి మాత్రం అతని హృదయం పొక్కింది. "నాగ రులకంటు మన ఇండియన్‌లో మానవత్వం మెండు. అతడు మానవునివలె బ్రతుకుతున్నాడు. మానవునివలె ఆలోచిస్తున్నాడు. మానవునివలె అంతరిస్తున్నాడు....వ్యుత్పన్నత కళకు సాధనం. అంతే కాని పరిపూర్ణ పురుషునకు అది ఆవశ్యకం కాదు. అది అతనిని వినీతుని చేయజాలదు.... ఇలాంటి వానిని విన్నప్పుడు శుష్క-పండితుల కనుబొమలు ముడివడవచ్చును. అయితే ఇలాంటి సందర్భాలు అరుదు; తన యౌవనదశలో ఎక్కువ భాగం విప్ల వాగ్నితో తుక తుక ఉడికిపోతున్న తన హృదయభాండానికి మూత పెట్టి గట్టిగా బిగించి వేశాడు.

హార్వర్డ్‌లో ఉండగా తోరో గంభీరంగా ఆలోచించ సాగాడు. తన తరంలోని యువ హృదయాలను ఉత్తేజపరుచే నూతన భావాలు బయలుదేరుతున్నవి. ఇంగ్లండులో రాబర్ట్ ఆవెన్ అప్పటికి ఎంతో కీర్తి ఆర్జించాడు. అతని అనుయాయు లెందరో న్యూ ఇంగ్లండులో ఉన్నారు. అతనికీ, అసల్ప సంఖ్యాకులైన అతని అనుయాయులకూ సోషలిస్టు స్వర్గం భూలోకంలో అవత

రించబోతున్నట్లు కనిపించింది. అయితే ఆ స్వర్గస్థాపన పద్ధతిలో ఏకీభావంలేదు. కార్మికవర్గం వ్యవస్థీకృతమై అధికారం చేపట్టి నప్పుడే ఈ పరిణామం వస్తుందని వాస్తవిక వాదులైన ఇతర మేధావులు భావింపసాగారు. అది విప్లవాత్మక కార్మిక సంఘో ద్యమంతోను, ఛార్టిజంతోను, టోల్పుడిల్ ప్రాణ త్యాగులతోను సంకీర్ణంగా ఉన్న యుగం. కాల్రిడ్జి, వర్డ్స్‌వర్త్ కవుల భావు కత్వం (Romanticism) నిజవాసనలు విరజిమ్ముతున్నది. కాల్రిడ్జి, స్కాట్, బైరన్, షెల్లీ, కీట్సు కవుల మరణానంతర ప్రభావం అపారంగా వ్యాపించింది. ఈ విషయంలో ఇతర దేశా లకు అమెరికా ఏ మాత్రం తీసిపోలేదు. పారిశ్రామికాభివృద్ధితో కర్మాగారాలకు నెలవులైన పట్టణాలు బయలుదేరాయి. వీనితో క్రొత్త సామాజిక సమస్యలు తలెత్తాయి. వీని పరిష్కరణకై భావుకత్వానికి మారుగా ఆచరణ సాధ్యమైన ఆదర్శం నెలకొంటు న్నది. అమెరికా, ఐరోపాల రెంటి నడుమ మేధావులు నిరంతరం రాకపోకలు సాగిస్తూ వచ్చారు. తుమ్మెదలు దూర భూమికిపోయి మధువుతో తేనె పట్టునకు తిరిగి వచ్చినట్లే ఈ మేధావులు యూరపు నుంచి నూతన భావాలతో స్వదేశానికి తిరిగివచ్చారు. ఫ్రాన్సు నుండి షాటోబ్రియాండ్ హ్యూగోల భావుకత్వమే కాక ఛార్లెస్ ఫ్యూరియర్ ప్రతిపాదించిన సోషలిస్టు సిద్ధాంతాన్ని కూడ పట్టుకొని వచ్చారు. వెంటనే న్యూ ఇంగ్లడులో కొంతమంది ఫ్యూరియర్ అనుయాయులు బయలుదేరారు. కార్మికవర్గోద్యమంలో వారికి ఆసక్తిలేదు. నిరాడంబరంగా సంతృప్తితో జీవించే సంఘాలను నెలకొల్పి వాని ద్వారా సోషలిజం వెంటనే వ్యవస్థాపించాలని వారి సంకల్పం. జర్మనీనుంచి తిరిగి వచ్చినవారు ఆ దేశపుతత్త్వ శాస్త్ర సంపదనంతా అమెరికాకు కొనివచ్చారు. ఐరోపా విచార

ధార మూలాన కొలదిమంది న్యూ ఇంగ్లండువాసులు భక్తి జ్ఞానం యోగవైరాగ్య మార్గ ప్రతిపాదక ప్రాచ్యగ్రంథ పరిచయం పొంద సాగారు.

ఈ కార్యకలాపాల మూలాన న్యూ ఇంగ్లండు మనస్సు వికసించింది. భావనానిరోధాలు అంతరించాయి. యువకుల మనస్సులు నూతన ప్రభావాల కనుగుణంగా తయారయ్యాయి. కార్లైలు ఉద్బోధంతో బాస్టన్ వర్తకులు కదలలేదు. అమెరికన్ మేథకు కేంద్రమైన హార్వర్డ్‌లోని కళాశాల పోషణకు వలసిన ధనసంపత్తిని సమకూర్చి వారెంతో గర్వించారు. అయితే విదేశీయ నూతన భావాలను తమ కళాశాల అనుసరిస్తున్నది. దీనితో తమ సొమ్ము వమ్ముకావటం లేదా అని అప్పుడప్పుడు వారు ప్రశ్నించుకొనే వారు. ఏది ఎలా ఉన్నా విదేశ వాణిజ్యసంస్కారం పెరిగింది. సముద్రయానపరులు అధికులయ్యారు. ఈ రెండు కారణాల వలన బాస్టన్ నగరవాసులకు విశ్వమానవ సౌభ్రాత్ర దృష్టి క్రమంగా పెంపొంద వచ్చింది. ఆర్థికాభివృద్ధి సిద్ధించింది. ఆధునిక నాగరకతా సంస్కృతుల యందు వారికున్న వైముఖ్యం సన్నగిలసాగింది. ఈ విధంగా అమెరికన్ విచార భావాత్మక జీవనానికి బాస్టన్ ఆవాలమయింది. ఐరోపావాసులు కూడా ముక్తకంఠంతో ఒకేసారిగా ఎడింబరో, పారిస్, బాస్టన్ నగరాలను పేర్కొనసాగారు. న్యూ ఇంగ్లండులో కొంతమంది ఉత్తమ రచయితలు బయలుదేరారు. హార్వర్డ్‌లో తోరో విద్యనభ్యసిస్తున్న కాలంలో విదేశ భాషాచార్యుడుగా పనిచేస్తున్న హెన్రీ వర్డ్స్‌వర్త్ లాంగ్‌ఫెలో అప్పటికి ముప్పదేండ్లవాడై తన పద్యకవిత్వంతో ఖ్యాతి సంపాదిస్తున్నాడు. ఆ కాలమందే హార్వర్డ్‌లో 1820-30 మధ్య విద్యార్థిగా ఉన్న రాల్ఫ్ వాల్డో ఎమర్సన్ ఇంగ్లండు వెళ్లి

కాల్రిడ్జ్, వర్డ్స్ వర్త్, లాండరు, డిక్వీన్సీ, కార్లైలు మున్నగు ప్రఖ్యాత రచయితలను సందర్శించి స్వదేశానికి తిరిగివచ్చి వ్యాస రచయితగా ఉపన్యాసకుడుగా ఖ్యాతికెక్కాడు.

1830-40 నాటి స్థితిగతులు ఆశలతో విప్లవ భావాలతో తొణికిసలాడు తున్నవి. మానవుడు స్వయం సంపూర్ణత అవగాహన శక్తిపొంది వీరపురుషుడుగా తయారవుతున్నాడని నాటి యువలోకం ప్రచురంగా నమ్ముతూ వచ్చింది. మానవబుద్ధిని ఉత్సాహాన నడిపించ బూనుకొన్న పునర్వికాసోద్యమాలలో పాల్గొనండని ప్రబోధించి ఎమర్సన్ తన శ్రోతలను ఉత్సాహపూరితులను చేశాడు. నూతన భావలక్షణాలను సమగ్రంగా తెలుపగల ఏకైక పదమేది కనిపించలేదు. న్యూ ఇంగ్లండులో నవ్యత అన్న పదం నాడు ఉచ్చరింపబడగానే ప్రతివారికి అర్థమయ్యేది. ముఖ్యంగా రాల్ఫ్‌వాల్డో ఎమర్సన్‌కు సంబంధించిన తాత్త్వికత నవ్యత అంటే కౌతుకాత్మక "వాతావరణ" మని ఎల్లవారూ గ్రహించేవారు. హెన్రీ తోరో 1337 లో పట్టభద్రుడై కళాశాలనుంచి కంకార్డ్ గ్రామంలోని తన ఇంటికి వచ్చాడు. పాశ్చాత్య ప్రగతి చరిత్రలో అది సామాన్య సమయంకాదు. నాటికి కంకార్డ్ కూడా సాధారణ గ్రామంకాదు. ఎందుకంటే అప్పటికే మూడు సంవత్సరాలనుంచి ఎమర్సన్ అక్కడే ఉంటున్నాడు.

ముప్పది నాల్గేండ్ల ప్రాయంవాడైన ఎమర్సన్‌కు హృదయంగమ వ్యక్తిత్వం ఉన్నది. అతని సందేశ ప్రాముఖ్యాన్ని గ్రహించి నిర్జీవ సిద్ధాంతాలను త్రోసిరాజని మానసిక స్వాతంత్ర్య సవ్యతాభిముఖమై ధీరఘీరగా పయనించాలని భావించిన యువలోకంలో అతని ప్రభావం అనల్పం. "ఎమర్సన్ సందేశం ఏ తరంలోని

యువలోకానికైనా ఆకర్షకంగా ఉన్నది. కాని 1830-40 నాటి లోకమనే మందుగనికి అది విస్ఫులింగమే. బాస్టన్‌లోని ఒక చర్చిలో ఒకప్పుడు ఆయన పాస్టరు ఉద్యోగంచేసి మానివేశాడు. స్వతంత్ర జీవనానికి వలసిన రాబడి పొందిన తరువాత ఆయన కంకార్డ్ గ్రామం వెలుపల మంచి ఇల్లు కొనుక్కొని ఒక ప్రక్క గ్రామస్థ సుఖజీవనం చేస్తూ మరొక ప్రక్క బాస్టన్ హార్వర్డ్ మేధావి బృందానికి సమీపంలో ఉండగలిగాడు. మొదట అతని జీవితం నిలుకడ లేనిదై అనేక దురదృష్టాలకు పాల్పడుతూ వచ్చింది. హార్వర్డ్‌లో విద్య నభ్యసించి చర్చిలో ఉద్యోగంచేసి మానుకొన్న పిమ్మట కొంతకాలం అధ్యాపక వృత్తిచేసి దానినుంచి కూడ విరమించుకొన్నాడు. దారిద్ర్యంలో పోరాడాడు. అంతలోనే క్షయరోగం పట్టుకొన్నది. ఆ తరువాత పెండ్లి చేసుకొన్నాడు. కాని అనతికాలంలోనే అతని భార్య మరణించింది. అతని జీవితం లక్ష్య శూన్యమై ఒక క్షేత్రంనుంచి మరొక క్షేత్రానికి దొర్లుతూ వచ్చింది. అతనికంటె వయోధికులైన వారు అతని మేధా సంపత్తిని గుర్తించారు. అతని ఉపన్యాసాలు, వ్యాసాలు సూటిగా హృదయంలో నాటు కొంటున్నవని అంగీకరించారు. అయినా అవి అరాజకత్వం, నిరీశ్వరత్వం బోధిస్తున్నవని భావించారు. ప్రాంతపు. జీర్ణ వదనుడు, తపస్వి, శీలశోధనుడు అయిన ఎమర్సన్ ప్రశాంత పండిత ప్రవక్త, దృఢ విశ్వాసంకలిగి తన ప్రభావానికి అందుబాటులో ఉన్నవారికి తన సందేశం వినిపించాలనీ సహాన్వేషకులను చేరదీయాలని తహతహ లాడుతున్నాడు. యువకుడైన హెన్రీ థోరో ప్రతిభను గ్రహించి అతను దానిని వెలార్చాడు. థోరో జీవితంలో ఎమర్సన్ ప్రభావం అనల్పం. ఈ ప్రభావమూ గౌరవమూ ఉభయనిష్ఠం. థోరో యథార్థం

పాండిత్యం జంకుగొంకులు లేని ఋజుత్వం, ఉన్నత మనీష. ఆధ్యాత్మిక బలం గుర్తించడానికి ఎమర్సన్‌కు ఎంతోకాలం పట్టలేదు. హెన్రీ చూపించిన ప్రశంస అతనిని ఎంతో సంతోషపెట్టింది. అతని చతురోక్తికి ఆనందించాడు. అతనికున్న ప్రకృతి ప్రణయం చూచి ముగ్ధుడయ్యాడు. దేశీయవృత్తి నైపుణ్యం, అప్పుడే తొంగి చూస్తున్న సాహిత్యకౌశలం అతనిని వివశుణ్ణి చేశాయి. హెన్రీ తన గురువునుండి ఎంతో నేర్చుకొని దానికి ప్రతిఫలంగా ఎమర్సన్‌కు తన కృషివల నైపుణ్యం కరపవలసి ఉన్నది.

అతని దృష్టిలో గ్రీకుభాష వీర్యవంతమైన తజ్జాతి విచారణకు, కవిత్వానికి చేరవేసే ద్వారం మాత్రమే. అతని దృష్టిలో ప్లేటోరచనలు జడములు, నిర్జీవాలు. కాని ఇలియడ్ కావ్యంమాత్రం శ్రమకు తగిన ప్రతిఫల మిస్తుంది. లాటిన్ రచయితల విషయంలో కూడా ఇంతే. అత్యంత స్వతంత్ర ఆధునిక భావాభివ్యంజకం కాబట్టి జర్మను భాషను గూడా అభ్యసించుకోవాలి. ఫ్రెంచి భాషానువాదాల ద్వారా అతడు ప్రాచ్యదర్శనాలు కొన్ని సేకరించాడు. ఓవెన్ అనుయాయి అయిన ఆరెస్టిస్ బ్రౌన్సన్‌తో స్నేహం చేశాడు. ఈ మైత్రివలన ఇంగ్లీషు సోషలిస్టు నాయకుల ప్రధాన భావాలను అతడు చర్చించటానికి అవకాశం ఏర్పడింది. వీటి అన్నిటికంటె ముఖ్యమైనది మరొకటి ఉన్నది. ఎమర్సన్ వ్రాసిన "ప్రకృతి" అనే గ్రంథం అతడు చదివాడు. ఈ పుస్తకం అతడు హార్వర్డ్‌లో ఉండగా వెలువడింది. ఇది హృదయప్రబోధకంగా అతనికి తోచింది. అంతవరకు అతనిలో అస్పష్టంగా ఉన్న వాంఛలకు అది నిర్దిష్టరూపం కల్పించి తనపై నాధారపడి జీవనయాత్ర సాగిస్తూ ప్రకృతి ధ్యానంతో ఆత్మవికాసం, శాంతి, కాంతి సాధించాలన్న కాంక్షను రేకెత్తించింది. అంతకుముందే

ఎమర్సన్ వ్రాశాడు. "ప్రపంచం ఐక్యతాస్వప్నమై భిన్నాభిన్నమై కుప్పగ సారంగా పడివుండటానికి కారణం ఒకటే. మానవుడు తనలో తను పొత్తుమాని బ్రతుకుతున్నాడు....కాబట్టి నీ ప్రపంచాన్ని నీవు నిర్మించుకో."

యువ పట్టభద్రుడయిన హెన్రీ తోరోకు జీవిత కర్తవ్యతా విషయంలో నిర్దిష్ట భావాలు లేవు. జీవితంకోసం అధ్యాపకవృత్తిని స్వీకరిస్తాడని అతని తల్లిదండ్రులు ఆశించారు. తాను కవిగా ఉండాలని మాత్రమే అతడు ఊహించుకొంటున్నాడు. ఎమర్సన్ అనుయాయి బృందంలో కవిగానే అతనికి ప్రవేశం లభించింది. అతడు 1837 ఆగస్టులో హార్వర్డ్‌నుంచి తిరిగి వచ్చాడు. ఏదో తాత్కాలికంగా మాత్రమే చేదామనుకొని సెప్టెంబరులో అతడు కంకార్డ్ గ్రామపాఠశాలయందు ఉపాధ్యాయ పదవి స్వీకరించాడు. స్వీకరించిన ఒక పక్షం గడచిన తరువాత ఆ గ్రామీణ విద్యాసంఘంతో తగవులాడాడు. విద్యార్థులకు శారీరక దండనం విధించవలసిందని ఆ సంఘం పట్టుపట్టింది. కాని అలాంటి దండనంలో అతనికే మాత్రం నమ్మిక లేదు. పాఠశాల పాలకవర్గంలో ఒకడు తీవ్ర శిక్ష విధించక తప్పదని పట్టుపట్టగా తన విద్యార్థులను ఆరుగురిని బెత్తంతో శిక్షించి దానితో ఏవగించుకొని అతడు పాఠశాలనుంచి వచ్చివేశాడు. మరెన్నడూ ఆ పాఠశాల ముఖం చూడలేదు. పిల్లలను పట్టుకొని బాదటంకంటె దేశాలు పట్టుకొని పోవటం అతనికి మేలుగా తోచింది. ఆ సందర్భంలో అతని కుటుంబం ఏమనుకొన్నదో మనకు తెలియదు. పెన్సిళ్ళ కర్మాగార నిర్వహణంలో సంసారం ఈడ్వలేక ఈడిగలబడుతున్న ఆ మూగనోముల తండ్రి, ఉడుకు రక్తంతో తన కొడుకు కావించిన పనికి తల పంకించి ఉంటాడని ఊహించవచ్చు. కుటుంబంలోని ఇతర

సభ్యులు అతని చర్యను శ్లాఘించి ఉంటారు. ఎందుకంటె మానవ వాదాన్ని పురస్కరించుకొని సంఘ సంస్కరణలు జరగాలని వారు ఉత్సాహపడుతున్నారు. వాస్తవానికి ఆ నాడు తోరో గృహం దాస్య నిరోధన కేంద్రం.

ఈ లోగా హెన్రీ ఏమి చెయ్యాలి ? జీవనోపాధి సమస్య అప్పుడే కాదు ఇంకా పెక్కేండ్ల వరకూ అతనిని చీకాకు పరచ బోతున్నది. చిత్తశుద్ధితో పరిశ్రమించదగిన వృత్తిని అతడు తీవ్రంగా ఆకాంక్షించాడు. ఆ వృత్తిలో ఎంత కాలమైనా, ఎంత శక్తినైనా వెచ్చించటానికి సంసిద్ధుడే. కంకార్డ్‌కు కవిగాని, సాహిత్య విమర్శకుడుగాని అవసరంలేదు. సోమరిపోతుగా కూర్చుండక తాత్కాలికంగా పెన్సిళ్ళ ఉత్పత్తిలో అతడు తండ్రికి చేదోడుగా ఉండవచ్చును. అయినా ఆ వ్యాపారానికి అది అను కూల కాలం కాదు. తోరో పెన్సిళ్లు చాలా మేలైనవి. చాకదారు విదేశపు సరుకు వచ్చి పడ్డది. ఆ సరుకే ఎక్కువగా అమ్ముడు పోతున్నది. వారి వ్యాపార సంస్థకు తోరో అండ్ సన్సు అన్న పేరు ఉన్నది. కొడుకులు-ముఖ్యంగా హెన్రీ-ఆ వృత్తిలో నిపుణులే. అయినా వారందరినీ అందులో నియోగించాలంటే తగిన పని లేదు.

బ్రతుకుతెరువుకై కొడుకులు మరొక వృత్తి చూచుకో వలసి వచ్చింది. గ్రామీణ పాఠశాలలో హెన్రీకి తటస్థించిన భంగపాటును ధట్టి. స్వతంత్రంగా పాఠశాలను ప్రారంభిస్తే బాగుండునని యోచించి 1888 జూనులో అన్నదమ్ము లిద్దరు దానికి పూనుకొన్నారు. మూడు మాసాలలోనె రిక్తంగా ఉన్న కంకార్డ్ విద్యా సంస్థను తోరో సోదరులు (జాన్, హెన్రీ) నిర్వహించ తలపెట్టారు. 25 మంది విద్యార్థులు చేరారు. మరి

పెక్కురు చేరటానికి సిద్ధంగా ఉన్నారు. దీనితో కొంతకాలం దనుక పాఠశాలకు ఆర్థికస్తోమత చిక్కింది.

ఎల్లవిధాల అది ఉత్తమ పాఠశాల. పాఠశాలను సోదరులు అక్కగా నిర్ణయించారు. శారీరక దండనాన్ని పరిహరించి వివేకంతో పిల్లలకు క్రమశిక్షణ అలవరించారు. విద్యా విధానంలో ప్రగతిశీల భావాలు గోచరింపసాగాయి. ఎందువల్లనంటే నూతన విద్యా బోధన పద్ధతులను ప్రచారిస్తున్న ఎమర్సన్ అనుయాయి వర్గాన్ని హెన్రీ యథాపూర్వం కలుసుకొంటున్నాడు.

ఎమర్సన్ ఇంట సమావేశమై అతని అనుయాయులు సాధికారంగా అవేశకలితులై నూతన విద్యా బోధన పద్ధతులను చర్చిస్తుండేవారు. వానిలో తరచు వెర్రిమొర్రి సిద్ధాంతాలు గూడ ఉండేవి. వాని నన్నిటిని హెన్రీ విన్నాడు. కాని అతడు ఆ వాద ప్రవాహంలో కొట్టుకపోలేదు. అప్పటికే అతనికి నిర్దిష్టశీలం, తాత్త్విక దృక్పథం ఏర్పడ్డవి. అవి ఇంకా పరిణతి పొందవలసి ఉన్నది. అయినా అవి అంతగా మారబోవటం లేదు. అప్పటికే అతని మనస్సు ఆధ్యాత్మికవాదం వైపు మొగ్గింది. అతని భావాలు మిక్కిలి వైయక్తికాలు. అంతమాత్రాన అవి ఆచరణాసాధ్యాలు కావు. గ్రామీణ వృత్తి విద్యలను నిర్వర్తించదగిన సామర్థ్యం అతనికున్నది. అందువలన ఆచరణీయతను పురస్కరించుకొని అతడు నూతన సామాజిక సిద్ధాంతాల విలువలను నిర్ణయించుకొనేవాడు.

చిన్నపిల్లలకు హెన్రీ ఉత్తమ గురువు. సమవయస్కుల తోటి సాహచర్యంకంటె ఆత్మసాహచర్యం అతనికిష్టం. అయినా హకిల్‌బెర్రీల కోసం బాలబృందాన్ని పల్లెసీమలకు కొనిపోయి, అచట గ్రామీణ వృత్తులందు శిక్షణ ఇవ్వడం, తనకున్న ప్రకృతి

పరిజ్ఞానం అలవరచటం, ఇండియన్ల కథలు చెప్పడం మున్నైన పనులకు అతనెప్పుడూ సంసిద్ధుడే. తన బాల్యావస్థను అతడు చక్కగా ధారణచేశాడు. ఈ ధారణాశక్తివలన అడవులకు వెళ్లినపుడు మరొకసారి ఆ సుఖతర బాల్యావస్థను తిరిగి అనుభవింప గలిగేవాడు. తోరో పాఠశాల విశిష్టత బాహ్యక్షేత్ర కార్యకలాపాల వల్లనూ, ప్రకృతి పరిశీలన వల్లనూ, వస్య వృత్తులవల్లనూ వ్యక్తమయింది. సోదరు లిరువురు ఆప్తమిత్రులుగా ఉండేవారు. పెక్కు పర్యాయాలు జాన్ హెన్రీని అడవులకు కొనిపోయాడు. అతడు పక్షులను జాగ్రత్తగా పరిశీలిస్తుండేవాడు. కొంతకాలం బ్రతికి ఉంటే హెన్రీకంటె అతడే క్రమబద్ధ ప్రకృతి శాస్త్రజ్ఞుడయ్యేవాడు. పాఠశాలకు మొదటి సంవత్సరం జయప్రదంగా ముగియగానే సెలవు లిచ్చి, వారు పడవ ప్రయాణానికి పూని స్థానిక నదులపై పయనిస్తూ, రేలు ఏటి ఒడ్డున నిద్రించేవారు. జాన్ పక్షులను పరిశీలిస్తూ ఆనందించేవాడు. హెన్రీ ప్రశాంతంగా కూర్చుండి కలువల సొగసు, బెస్తవాండ్ర ఓర్పు, ఏటి నీళ్ళ మిలమిలలు తిలకిస్తూ వీటి నన్నిటిని తన దినచర్యలో వ్రాసు కొనేవాడు.

జాన్‌కు 21 సంవత్సరాలు, హెన్రీకి 22 ఏండ్లు. జీవితం హాయిగా గడుస్తున్నది. అయినా విభ్రాంతులు, నూతనావేశాలు వారికి కలుగక మానలేదు. సోదరులకు ప్రణయ రుచి గ్రహింప దగిన వయస్సు వచ్చింది. అన్నదమ్ము లిద్దరూ ఆ వేసవిలో ఒకే అమ్మాయిని ప్రేమించారు. పదిహేడు సంవత్సరాల అందమైన ఆ అమ్మాయి పేరు ఎలెన్ సెవెల్. ఆమె వారి కుటుంబానికి మిత్రురాలు. వారి పాఠశాలలో చదువుతున్న ఒక విద్యార్థికి సోదరి. కంకార్డ్, మెర్రీమానిక్ సామీప్యాలలో వారి శిబిర

ప్రాంతపు నెగళ్ళ ప్రసక్తి, ఆ అస్పష్టమైన ముక్కల నడుమ నిలిచివుండేది. హెన్రీ మాత్రమే దానిని గుర్తించి ఉంటాడు. ఎలెన్‌ను పెండ్లాడాలన్న కాంక్షను జాన్ దాచుకోలేదు. హెన్రీ దానిని గురించి మాట్లాడలేదు. అతని ప్రేమ అతని హృదయంలోనే ఏలీనమైపోయినట్లు కనుపించింది.

ఒక సంవత్సరం గడిచింది. ఆ వసంతకాలపు వేసవిలో తనను పెండ్లాడవలసిందని జాన్ ఎలెన్‌ను కోరాడు. సుదీర్ఘం తటపటాయించి తుది కామె అతనిని నిరాకరించింది. దానితో తలవని తలంపుగా హెన్రీకి ఆశాభావం కలిగింది. కొన్ని మాసాలు గడిచిన పిమ్మట ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపి ఆ మీదట చూసి యేట్‌లో ఉండగా ఆమెకు ప్రేమలేఖ వ్రాశాడు. తన ఆశాసౌధ విధ్వంసనాన్ని అవలోకించే దుస్థితి ఇప్పుడతనికి కలిగింది. తోరో సోదరు లిరువురు ఆమె కిష్టులే. కాని వారిలో ఎవరినీ ఆమె ప్రేమించలేదు. తొల్లిటి ఆప్యాయత తిరిగి తమ నడుమ ఏర్పడదు గదా అని ఆమె విచారపడ్డది. ఈ సందర్భాన ఆమె వ్రాసిన ఉత్తరం ఒకటి ఉన్నది. "ఆ సాయంకాలం హెన్రీ తోరోకు లేఖ వ్రాశాను. ఆ ఉత్తరం పంపడానికి పడ్డ బాధ జన్మలో మరెప్పుడూ పడలేదు. తొల్లిటి స్నేహం, స్వచ్ఛంద సుఖగోష్ఠి తిరిగి లభించవు గదా అన్న భావం కలిగి దుస్సహదనను ఆపాదించింది. ఆ ఉత్తరం అతి క్లుప్తంగా ఉన్నది. అదే సముచితమనుకొంటాను." హెన్రీ కౌతుకంతో తిరిగి ఏ కన్యను కన్నెత్తి చూడలేదు. తన హృదయ ఫలకంలో ఎలెన్ రూపం హత్తుకొనిపోయిన తరువాత పక్కన యువతులు బహుశః అతనికి అసహ్యంగా కనుపించి ఉంటారు.

---

# అధ్యాయము 3

"మన జీవనం నదీజలసదృశం. మానవుడు మున్నెన్నడూ కని ఎరుగనంత ఉత్తుంగంగా అది ఈ ఏడు పొంగి సంతప్తోన్నత భూములను ముంచవచ్చు"

—తోరో (వాల్డెన్)

"నా మిత్రుడైన హెన్రీ థోరో ఏకాంతంగా ఉన్న కల అపరాహ్ణాన్ని తన నిరాడంబరతతో విస్పష్ట దృష్టితో కల ఈ లాడించాడు" అని ఎమర్సను తన దిన చర్యలో 1838 ఫిబ్రవరి 17న వ్రాశాడు. ఆ అపరాహ్ణమంతా వారిద్దరూ ఎమర్సన్ తోటలో గడపారు. ఎమర్సను మొదటిసారిగా వెనుకకు వ్రాలివింటున్నాడు. దోహదముంటే హెన్రీ అతిభాషి. కొన్ని విషయాలను ఎమర్స న్‌కు కూడా బోధించగలడు. ఉదాహరణకు రెడ్ ఇండియనను కంకార్డ్‌లోని వారి అవశేషాలను, కెనడా ఉన్ని వ్యాపారులను (మహా యాత్రికుడు ప్రకృతి శాస్త్రవేత్త అయిన అలెగ్జాండర్ హెన్రీ "కెనడాలో యాత్రలు సాహస కృత్యాలు" అన్న పుస్తకం

పతనంతో ఈ వ్యాపారులందు ఆసక్తి పెరిగింది.) న్యూ ఇంగ్లండులో మొదట నెలకొన్న వారి చరిత్రను తీసుకోవచ్చును. వీటన్నింటికంటె ముఖ్యం ప్రకృతి. ప్రకృతి అంటె ఎమర్సను, కార్లైలు అభివర్ణించిన అమూర్త ప్రకృతి కాదు. ఇంద్రియ గోచరాలైన భూమ్యాకాశాలు, నదీ పర్వతాలు, నరతరు జంతుజాలాలు గలిగిన ప్రకృతి.

ఈ ప్రకృతి చరిత్ర పరిశీలనాసక్తియే మున్ముందు విద్వన్మిత్రులలో అతనికి విశిష్టతను చేకూర్చబోతున్నది. కంకార్డ్ పల్లెపట్టులలో తను సాగించిన ఏకాంత విహారాలందు గోచరించిన ప్రతి అంశాన్ని అతడు తన దిన చర్యలో వ్రాయ నారంభించాడు. ఆ అభ్యాసం ఎమర్సనుకు కూడ ఇష్టమే. అతడు (ఎమర్సన్) వ్రాశాడు: "జీవితం సుదీర్ఘమే అయితే, నా అసంఖ్యాక రచనాలలో అనుమాన పరివర్తిత శిఖరపరిసరాలలో ఉండే అడవుల ప్రకృతి చరిత్రను అందు వ్రాస్తాను. వాని ఖగోళశాస్త్రం, వృక్షశాస్త్రం, శారీరక శాస్త్రం, విచిత్ర ఉల్కా శాస్త్రం, రవిద్వం వీటినన్నిటిని అది ఏకత్రితం చేయాలి. ఏ విహంగమూ, ఏ కీటకమూ 'ముకుళమూ విస్మృతం కారాదు.' కాని ఎమర్సనుకు అంతకు ముందే నిర్ణీతపథం ఉన్నది. సాధించవలసిన లక్ష్యం ఏర్పడింది. రచనలు సాగించాలి. ఉపన్యాసాలు ఇవ్వాలి. ప్రకృతి శాస్త్రంలో అతనికి ఆగంతుకాసక్తి ఏర్పడింది. అంతేకాని హెన్రీకున్న సహజోత్సాహం అతనికి లేదు. విచారధారకు, సాహిత్యానికి తోరో చేయనున్న సేవకు ఈ ఉత్సాహమే మూలమవుతుందని ఎమర్సను అనతికాలంలోనే గ్రహించాడు. అతనికి విద్వత్తు మెండు. కృత దేశసంచారం అధికం. లోకానుభవం కూడ ఎక్కువే. హెన్రీ

అంతేనో కంకార్డ్‌లో మెండుగా సంచరించాడు. స్వల్పప్రదేశంతో గాఢ పరిచయం ఏర్పరచుకో గలిగితే, అనుక్షణం పరివర్తి ప్రపంచ యాత్రకంటె మానవుడు ఎక్కువ జ్ఞానం పొందగలడని హెన్రీ విశ్వాసం. జాంజిబార్‌లోని పిల్లులను లెక్కించటానికై సగం ప్రపంచం సంచరించటంలో అతనికి అర్థం కనిపించలేదు. సగం ప్రపంచానికి మిగతా సగం ప్రపంచం ఎలా బ్రతుకుతున్నదో తెలియదన్న మాట యథార్థం కాదని అతని భావన. ఎల్ల దేశాల లోను మానవ జీవితాలు ఒకటే. అన్నీ ఏకవిధానుభూతి పూర్ణాలు."

హెన్రీ తరచు కాలిత్రోవలు పట్టుతుండేవాడు. అవి అతనిని విచిత్ర పథాలకు కొనిపోయి అచటినుంచి రిక్త క్షేత్రాలను, ఉపేక్షితోపవనాలను, కంకార్డ్ పచ్చిక మైదానాలను దాటించి దూరంగా ఉన్న అడవులకూ, సరోవరాలకు చేరవేసేవి. అతడు మస్కెటాక్విడ్ నదీతీరాల వెంట వెళ్ళేవాడు. (మంద ప్రవాహ అయిన కంకార్డ్ నదికే ఇండియన్లు మస్కెటాక్విడ్ అన్న పేరు పెట్టారు.) ఈ పేరుతోనే దానిని పేర్కొనటం అతని కిష్టం. ఆ తీరాల పొడవునా సిందూర వృక్షాలు (Oak trees) కలిగిన పచ్చిక బయళ్లుండేవి. అక్కడ క్రాన్ బెర్రీలు మెండు. ఎల్లోమాపుల్, ఆల్డర్ వృక్షాలు, ద్రాక్షలతాపరివృతాలై వెలుగుకోసం చెస్ట్‌నట్లతోను, దేవదారువులతోను పోటీ పడుతుండేవి.

ప్రకృతిలోని ప్రతిజీవి, ప్రతివస్తువు—మత్స్యాలు, జంతువులు, కీటకాలు, పక్షులు, పుష్పాలు, వృక్షాలు, మున్నైనవన్నీ—అతనిని మిక్కిలిగా ఆకర్షించాయి. తన దృష్టినంతా అతడు వాటిపై కేంద్రీకరించాడు. అప్రమత్త దృష్టితో, ప్రజ్ఞతో తాను కనుగొంటున్న విషయాలను పుస్తకాలలో వ్రాసుకొన్నాడు. ఇంద్రియలాలసుడై ప్రకృతిని సందర్శించి పారవశ్యం పొందాడు. నిర్లిప్త

విశేషజ్ఞ, శాస్త్రీయదృష్టి అతనికి సహజాతం కాదు. గ్రామం విడిచి వెళ్ళిన తరువాత అతనిలో వచ్చిన పరిణతిని చూసి అతని మిత్రులు విస్మితులయ్యారు. ఆడవులలో అతడు అద్భుతదర్శనోత్సాహంతో ఉత్తేజితుడయ్యాడు.

విస్తృత భూభాగంలో చెదిరి ఉన్న ఉద్యానాలను పరిశీలించాలన్న ఆసక్తితో ఉండే అతడు రోజుకు ఇరవై ముప్ఫై మైళ్ళ చొప్పున దినాల తరబడి పయనించేవాడు. తులనాత్మకమైన వృక్షముకుళ ప్రభేద పరిశీలనకై ఎంతో దూరం పయనించాడు. ఈ విశేషాలను ఏకబిగిగా నిరాహారుడై గంటల తరబడి నిలిచిగాని కూర్చుండిగాని సంపాదించ గలిగేవాడు. ఆ సమయంలో వన్యమృగాలు తమ వన్నెలను విస్తరించి దాపున సాక్షాత్కరించేవి. నది ప్రక్కన గంధమూషికాలను (మస్క్ రాట్లను). చేపలను అవలోకిస్తూ సుదీర్ఘం పయనించేవాడు. ఆ వాగులో ఉన్న పాట్ (చేప)ను ఎలా చేరి పట్టుకోవాలో, ట్రౌట్ (చేప)ను ఎలా లాలించాలో, బురద నీళ్ళలో దిగి తాబేళ్ళను కాళ్ళు పట్టుకొని ఎలా లాగాలో నేర్చుకొన్నాడు. ఎగిరే ఉడుతలను, తాబేటి ప్రస్తు పిల్లలయ్యే తీరును, గ్రుడ్లగూడల అందాలను అతడు వర్ణించాడు. కప్పలు, ఎముకలు. దేగలు, గాయక శకుంతాలు. బహు పత్రకాలు, సూకరులు, వృక్ష ఫలాలు, నదుల వంకలు, ప్రకృతి దృశ్యాలు, అతనికి తెలుసు. ప్రతిదానికి మరొక దానితో సంబంధం ఉన్నది. అందువల్ల ఏదీ విస్మరణీయం కాదు.

శీతాకాలంలో గ్రామీణ ప్రాంతం అతనికి ఏక భోగం. అప్పటి విశేషాలను అతడిలా అభివర్ణించాడు: "నిండు మంచు మీదుగా స్కేటింగ్ పాదుకలతో నక్క వెంటపడ్డాను. అప్పుడప్పుడది వెనుక కాళ్ళమీద కూర్చుండి నన్ను చూసి తోడేటి పిల్లవలె

అరిచేది....నేరుగా దాని వైపు స్కేట్ చేయగానే అది తన సత్తువ కొలదీ పారిపోయేది. నేను కదలక నిలబడినప్పుడు దానికి భయోపశాంతి కలుగకపోయినా అప్రధృష్య స్వభావ చోదితమై అది కూడ వెనుక కాళ్ళపై కూర్చునేది..........." లేదా, అతడు మంచులో శ్రమపడి వెళ్ళి అతర్కితో పనల సంతోషం పొందేవాడు. "మంచు మూడడుగుల లోతుంటుంది. అందులో గడ్డ మంచు రెండడుగుల మందం ఉంటుంది. గత రాత్రి ఉష్ణమాపకంలోని పాదరసం 30° లకు దిగి ఉండవచ్చును. ప్రకృతి యందలి ప్రవాహాలన్నీ ఘనీభవించినట్లు కనిపించాయి. బాటసారి దారిలో చలికి గడ్డ కట్టుకొని పోయాడు. ఆ భూర్జవనాంచలాన ఎర్రని రొమ్ములు కలిగిన కుంత సందోహాలు (Red Polls) భూర్జ బీజాలు మేస్తూ హిమధూళిని రెక్కలనుంచి విదల్చుకొంటూ ఉంటాయి. ఎంతటి మనోజ్ఞ వైపరీత్యం ; ఉష్ణమండలాంతర వర్ణాలు అరుణ వృక్షాలు, వెనుక అతి శీతలమైన మంచు, ఆ దివ్యత...ఆ ఆకృతి లావణ్యం, ఆ వర్ణపరిణతి ఈ కఠోర నిర్జీవ ఋతువులో ఉన్నవి."

విశ్వ దివ్యరహస్య వర్ణనలో, రామణీయక అంతరాంతరాల చిత్రణలో కార్లైలు వాక్యాలకు అతడు అనుకరణం పలకగలిగిన సందర్భాలున్నవి. అందువల్లనే ఎమర్సనుకు అతనిలో పరతత్త్వాన్వేషకుడైన ఆదర్శ శిష్యుడు గోచరించాడు. ప్రకృతాని కతడు అతి స్వతంత్రుడు. అయినా అంగీకృత భావాలకూ లౌకిక కాంక్షలకూ విముఖుడై ఉన్న ఆ యువకుడు ఒకనాటికి పరమార్థాన్వేషక బృందంలో చేరుతాడని ఎమర్సను భావించాడు. ఇదివరకే థోరో చర్చి సభ్యత్వాన్ని వదలుకొన్నాడు. ఎమర్సను చుట్టూ మూగి ఉన్న స్వతంత్రులవలెనే అతడు నూతన భావమార్గాలను, నవ్యజీవిత పథాలను చర్చించటానికి సంసిద్ధంగా ఉన్నాడు. అత

డెల్ల విధాల ప్రోత్సహింపదగిన యువకుడు. అనతి కాలంలోనే ఎమ ర్సను దంపతులను అతడు కూడ తరచుగా సందర్శిస్తూ వచ్చాడు.

ఎమర్సను, అతని రెండవ భార్య లిడియను, తనయందు ఆదరభిమానాలను నెరపుకున్నారని అతడు గ్రహించాడు. లిడి యనుతో అతనికి చిరతర కోమల స్నేహం ఏర్పడబోతున్నది. ఆమె పాలిపోయి బక్కపలచగా ఉండేది. అతని యోగక్షేమాలు కనుగొని అతని అభివృద్ధిని కాంక్షిస్తుండేది. అతని భావాలలో పెక్కింటిపై సానుభూతి చూపేది. అతనికి ఆమె మూర్తీభ వించిన ఆదర్శ మహిళాత్వ దశావిశేషం. ఏ యువకవి అయ్యా కైనా తన గేయ కవితను గాని, చైతన్య పూర్ణలేఖలను గాని నివేదించటానికి ఆమె యోగ్యంగా గోచరించింది. ఎమర్సను దంపతుల ఇంట అతనికి తరచుగా ఎదురుపడుతూ వచ్చిన మార్గ రెట్ ఫుల్లర్ అనే ఆమె ఆమెకు కేవలం భిన్నంగా ఉండేది. మార్గరెట్ ప్రతిభావంతురాలైన రచయిత్రి. "సవ్యత" కు ప్రత్యక్ష శిష్యురాలు. ప్రబల వ్యక్తిత్వమున్న మహిళ. ఆమె దృష్టిలో హెన్రీ వరిష్ఠుడే గాని అనుభవహీనుడు. మంచివాడే కాని అత నిని యోగ్య స్థానంలోనే ఉంచాలని ఆమె భావించింది.

ఎమర్సను ఇంట కంకార్డు మేధావులు సమావేశమై తమ గురువు సన్నిధానంలో సవ్యతా తత్త్వాన్ని వివరిస్తూ ఉంటే హెన్రీ సావధానుడై విన్నాడు. వారి ఉపన్యాసాలనుబట్టి ఆ మానవులు ఎలాంటివారో అతడు పరిశీలించ గలిగాడు. చప్పోపన్యాస వేదిక కాబోతున్నదన్న అనుమానం కలుగగానే దాని బండారం బయట పెట్టటానికి సిద్ధమయ్యేవాడు. వాక్పటువులై వారస్థాయిలో ఉప న్యాసం సాగించే ఉత్సాహవంతుల ఉపన్యాసాలను, విస్మయ అవిశ్వాసాలతో అతడు ఆలకించాడు. వైయుష్టికంగా వారిని

ప్రేమించాడు. ముఖ్యంగా సమాజాలను నెలకొల్పాలని వారు ప్రతిపాదిస్తున్నప్పుడు వాటికి దూరమై ఉండాలని ఉబలాట పడేవాడు.

1840 వ సంవత్సరంలో అమెరికను సాహిత్య చరిత్ర యందు ఒక చిన్న సంఘటన జరిగింది. తోరో జీవితంలో అది అతి ముఖ్యం. "ది డయల్" (The Dial) అను పత్రిక పటాటోపంతో ఎమర్సనుచే ప్రారంభింపబడి న్యూ ఇంగ్లండులోని పారమార్థికవాదుల మతాన్ని వెలువరింపసాగింది. న్యూ ఇంగ్లండు సంస్కృతికి ఇంకా కేంద్రంగానే ఉంటూ వచ్చిన బాస్టను నగరం నుంచి అది వెలువడింది. కేవలం అల్పసంఖ్యాక పాఠకులకే చేరినా (చందాదారుల సంఖ్య 300 లోపు) అది వివిధ ప్రాంతీయ మేధావుల దృష్టిని ఆకర్షించింది. తోరో వంటి అజ్ఞాత యువ రచయితలను ప్రపంచానికి పరిచితులను చేసింది. అది లేకపోతే వారి తొలి రచనల ప్రకటనకు ప్రచురణావకాశం లభించి ఉండేది కాదు. డయల్ ప్రచురణకర్త్రి సాహసోపేతురాలైన కుమారి ఎలిజబెత్ పీబాడీ. ఆమె అంతకుముందే బాస్టను నగరంలో వెస్ట్ స్ట్రీట్ (west street) లో ఆ వాన మేర్పర్చుకొని పారమార్థిక ప్రతిపాదకులైన ఇతర రచనలనూ, తన బావ అయిన నథానియల్ హతారను తొలి రచనలనూ ప్రకటించింది.

1840 నుండి 42 వరకు మార్గరెట్ ఫుల్లర్ డయల్ పత్రికకు సంపాదకురాలు. పాఠశాలాధ్యాపకుడై యువకుడుగా ఉన్న తోరో రచనలు అప్రౌఢాలని తలచి వానిలో అధిక భాగాన్ని ఆమె ప్రచురింప నొల్లక త్రిప్పి పంపివేసింది. దీనితో అతని అభిమానం కొంత దెబ్బతిని ఉండవచ్చును. కాని దీనివలన అతని శైలి కొంత చిక్కదనం సంపాదించుకొన్నది. తోరో అదృష్ట

వంతుడు. మంగళమూర్తి అయిన ఎమర్సన్ ప్రరోచక సూచనలిచ్చి తన్ను రచనకు ప్రోత్సహిస్తున్నాడు. అతనికా ప్రోత్సాహం అవసరం. ఎందుకంటే అతడు తన జీవన భృతిలో కొంతమేర తన రచనల ద్వారా సంపాదించాలని ఉబలాట పడుతున్నాడు. ఏ నీరస వృత్తికి దాస్యం చేయవలసి వస్తుందోనని అతని భయం. ఆ దుస్థితినుంచి తప్పించుకోవాలంటే రచన ఒక్కటే అతనికి మార్గంగా కనిపించింది. తన దినచర్యలో అతడు వ్రాసుకొన్నాడు. "ఏ వృత్తిని స్వీకరించేవారిలో నైనా అధిక సంఖ్యాకులు దైవోపహతులనే చెప్పాలి. మానవలోకం వారికి వెంటనే అంత్యక్రియలు జరపవచ్చును."

1841 వ సంవత్సర ప్రారంభంలో అన్నరోగ గ్రస్తుడయ్యాడు. అప్పటివరకు పాఠశాలను ఎలా నిర్వహించాలో బోధపడక తోరో ఆందోళనపడుతూ వచ్చాడు. అన్నగారి రోగ గ్రస్తతతో అతనికి ఆ ఆందోళన తొలగి కొంత ఊరట లభించి ఉండాలి. గత్యంతరం లేకపోతే తప్ప తిరిగి ఉపాధ్యాయ వృత్తికి దిగరాదని అతడు నిశ్చయించుకొన్నాడు. స్వాతంత్ర్యం తనకు అందికలో ఉన్నదనే అతడు భావించాడు. "గ్రహాలకంటె కూడ నేను స్వతంత్రుడను....ప్రజాభిప్రాయానికి, ప్రభుత్వానికి, మతానికి, అధ్యాపనకు, సమాజానికి దూరంగా వెళ్ళిపోగలను.... అదృష్టవంతుణ్ణి...భూమిలో పాదుకొని పోలేదు. ఇక్కడే సమస్త ప్రపంచం లేదు....ఏ పురపాలక సంఘం గుమస్తా గిరిలోనో ఇరుక్కొని ఉంటే ఈ వేసవిలో టియరాడెల్‌ఫ్యూగోకు నీవు వెళ్ళజాలవు."

స్వాతంత్ర్యం పొందవలసినది అతని శరీరం మాత్రమే కాదు. మనలో పెక్కురను పీడిస్తున్న మానసిక జాడ్యమంటే

అతనికి ఎక్కడలేని భయం కలుగజొచ్చింది. అతడు వ్రాశాడు: "అవయవాలకు వలసినంత అవకాశం ఉన్నది. కాని ఆత్మలే మూలబడి త్రుప్పు పడుతున్నవి." స్వాతంత్ర్యం జారిపోనీక కాపాడుకోవాలన్న దృఢ సంకల్పంతో తన తల్లి తండ్రులకు దూరంగా పోయి ఉండాలని అతడు తగిన నెలవు కోసం అన్వే షిస్తూ వచ్చాడు. ఆకలితో మాడితేనేమి ఉండటానికి అట్టకమే కావాలని అతడు కోరుకోలేదు. అతనికున్న కోరిక ఒకటే. అవ సరాలను వీలుపడినంతవరకు తగ్గించుకొని సాధ్యపడినంత తక్కువ ఆదాయంతో బ్రతకటానికి వీలైన క్షేత్రకుటీరం ఎక్కడైనా దొరుకుతుందేమోనని వెతకసాగాడు. అది దొరికితే ఆలోచనకు, ప్రకృతి పరిశీలనకు, వ్రాతకు పూర్ణావకాశం లభిస్తుంది. యధా ప్రాప్తంగా ఇతరులకు పనిచేసిపెట్టి వచ్చిన డబ్బుతో తన నిరా డంబర జీవయాత్ర సాగించాలని అతని సంకల్పం. కాని తాను కోరిన కుటీరం అతనికి లభించలేదు. అలాంటిది ఇతరులవలన లభిస్తుందా లేక తానే నిర్మించుకోవలసి ఉంటుందా అని సంశ యిస్తుండగా అతనికి ఎమర్సన్ ఉద్యోగం చూపించాడు. 1841 ఏప్రిల్‌లో అతడు ఆ ఉద్యోగంలో చేరాడు.

ఎమర్సన్ అతనికి చూపిన ఉద్యోగం కొంతవరకు హెన్రీ కోసం కల్పించినదే. అతని తలపునకు అనుగుణమైన స్థితిగతు లను కల్పించాలని ఎమర్సన్ ఉద్దేశం. కొంత విశ్రాంతి, ఆప్యా యతను ప్రసాదించే ఇల్లు, తినటానికి వలసిన తిండి...ఒక్క మాటలో చెప్పాలంటే దాదాపు స్వాతంత్ర్యం కల్పించటమే ఆ ఉద్యోగ లక్ష్యం. అది ఎమర్సన్ కుటుంబానికి కూడా లాభదాయ కంగా ఉండాలి. త్వరలోనే అతడు ఉపన్యాసాల పర్యటనకై బయలుదేరబోతున్నాడు. అప్పుడు వారాలతరబడిగా ఇంటికి వచ్చే

వీలుండదు. హెన్రీ అతని కుటుంబంలో చేరి యజమానుడు పర్యటనలో ఉన్నప్పుడు ఇంట వ్యవహారాలు చక్కదిద్దాలి. అంతకంటె మేలైన ఏర్పాటు ఎమర్సన్ ఏమి చేయగలడు ? అతని పిల్లలందు హెన్రీకి వాత్సల్యం ఉన్నది. లిడియను కూడా అతనికి సుముఖురాలే. ఇల్లూ, పొలం చక్కదిద్దగల నేర్పు, విశ్వాసపాత్రత తోరోకు ఉన్నవి. తోటను కాపాడుతూ పండ్లచెట్లకు వలసిన దోహద క్రియలు చేయగలడు. కోళ్ళను కనుగలగి పెంచగలడు. సాయంకాలం వచ్చి లిడియన్‌కు ఏకాంతతవలన కలిగిన నిరుత్సాహతను పోగొట్టి ఇల్లు త్రొక్కుకుని వచ్చిన అతిధుల సత్కరణకు తోడ్పడగలడు. అతనికి ప్రత్యేకమైన గది, భోజన సదుపాయాలు కల్పింపబడుతవి. అంతకు తక్క వేతనమేమి ఉండదు. దానికి కారణం ఒకటే. ఎమర్సన్ అంత సంపన్నుడు కాడు. "భోగ భాగ్యాలతోడి వైరంకంటె మరొక వైరం నాకు కలుగరాదు," అని తన దినచర్యలో వ్రాసుకొన్న తోరోకు ఇది ఒక కష్టంకాదు. పైగా నిర్వర్తించవలసిన విధులు కూడ సుకరాలు. మీదుమిక్కిలి యధేచ్ఛగా రావచ్చును. పోవచ్చును. కుటుంబంలో సమాన ప్రతిపత్తి అనుభవించవచ్చును. వర్ధమాన రచయిత అంతకంటే అధికంగా కోరుకోగలడా ?

తమ రెండు కుటుంబాలు కలిసి ఉమ్మడిగా ఎమర్సన్ ఇంట ఉండాలని ఎమర్సన్, అతని మిత్రుడు ఆల్కాట్ అనుకొన్నారు. కాని వారికంటె లోకానుభవం మెండుగాగల వారి భార్యలు దానిని పడనీయలేదు. ఆల్కాటు కుటుంబానికి బదులు హెన్రీ వచ్చి వారితో చేరాడు. ఈ యత్నం సఫలమే. ఎమర్సన్ దంపతులకూ అతనికీ మధ్య చక్కని సౌహార్దం ఏర్పడింది. ఎమర్సన్‌కు తోటపనిలో ఆసక్తి లేదు. అతడు ఇంటివద్ద ఉన్న

ప్పుడు తోరో వెనుక నిలిచి తోటలో చిన్నచిన్న పనులు చేస్తూ సంతోషపడేవాడు. తోరో అతనిని వాహ్యాళికై అడవులకు కొని పోయి మున్నెన్నడూ కనీ వినీ ఎరుగని ఉద్భిజ్జాలను పక్షులను చూపి నూతనానందం కలిగించాడు. వెన్నెలలోని ప్రకృతి సౌందర్యం చూపటంకోసం ఒకరాత్రి అతనిని పడవలో కంకార్డు నదిపై తీసుకొనిపోయాడు. ఎమర్సన్ ఆ మనోజ్ఞ దృశ్యానికి ముగ్ధుడై తన దినచర్యలో ఇలా వ్రాశాడు: "ఏకైక క్షేత్రం మీదుగా మేము పడవ వద్దకు వెళ్లాము. వెంటనే కాలాన్ని, శాస్త్రాన్నీ, చరిత్రనూ విస్మరించి ఒక తెడ్డు తోపుతో ప్రకృతిలోకి ప్రవేశించాము."

కంకార్డు సాంస్కృతిక జీవిత మధ్యంలో వసిస్తున్న ఆ యువకునకు ఆ రెండు సంవత్సరాలు బహూంఘటనా విశిష్టాలు. డయల్ పత్రిక వల్లనూ, ప్రవర్ధమానంగా ఉన్న ఎమర్సన్ ప్రఖ్యాతి వల్లనూ ఏకీకృతి పొంది పారమార్థికవాద మిత్రులు నానాటికి అధికంగా వచ్చి కంకార్డులో నెలకొనసాగారు. ఉత్సాహ వంతుడు, భావనాదోహదకారుడు అయిన బ్రాన్సన్ ఆల్కాట్ వచ్చాడు. అనతికాలంలోనే "ఫ్రూట్ లాండ్సు" సమాజ విచ్ఛిత్తితో అతని ఆధ్యాత్మికవాదం పరీక్షకు గురిగాబోతున్నది. ఇల్లినాయ్ అడవులలోని పర్ణకుటీరంలో ఏకాంతవాసం గడపాలని హార్వర్డునుంచి పారిపోయిన ఎల్లరీ బానింగ్ అన్న మరొక ఉల్లం ఘన బుద్ధి కూడా అక్కడకు చేరాడు. అతడు మార్గరెట్ ఫుల్లర్ సోదరిని 1842 లో వివాహమాడి కంకార్డులో స్థిరపడిపోయాడు. బాస్టను నుంచి ఇంకనూ డయల్ పత్రికను నిర్వహిస్తున్న ఎలిజబత్ పీబాడీ సోదరి, తన వధువు అయిన సోఫియాను తోడ్కొని కంకార్డులోని "ఓల్డు మాన్సు" లో నివసించటానికి నథానియల్

హాతారన్ వచ్చాడు. వీరందరూ హెన్రీకి మిత్రు లయ్యారు. అందరికీ సాహిత్యాభిరుచి ఉన్నది. వీరంతా పద్యాలు, వ్యాసాలు వ్రాయటానికి తోరోను ప్రోత్సహించారు. 1842 వసంత ఋతువులో మార్గరెట్ ఫుల్లర్ నుంచి డయల్ పత్రికా సంపాదకత్వం ఎమర్సన్ పుచ్చుకొన్నాడు. తదాదిగా తోరో రచనలను పెక్కింటిని ప్రకటనార్థం స్వీకరించి ఆ పత్రిక అతనికి సంతృప్తి కలిగించింది. కాని ఈ ఉత్సాహం కూడా మందగించింది. దమ్మిడీ లేని డయల్‌లో ప్రచురణార్థం పోటీపడే వ్యాసకర్తలే దాదాపు కరవై పోయారు. 1843 లో దాని సంపాదకత్వం స్వల్పకాలం పొందినప్పుడు తోరోకు ఆ సంగతి తెలిసి వచ్చింది.

ఆ కాలంలో తోరో తాత్త్వికవ్యాసాలు ప్రకృతి సౌందర్య ప్రదర్శక వ్యాసాలు, గ్రీకు లాటిను భాషానువాదాలు, ప్రాచ్య గ్రంథానువాదాలు రచిస్తూ వచ్చాడు. అయినా ఆ నాడు అతని మిత్రులు అతనిని వర్ధమాన కవిగా పరిగణించారు. ముఖ్యంగా ఎమర్సన్ అతనిని కవితా రచనకు ప్రోత్సహించాడు. తన దిన చర్యలో తోరో అతనిని కృతజ్ఞతా పూర్వకంగా ఇలా ప్రశంసించాడు: "ఎమర్సనుకు అనన్య విశిష్ట ప్రజ్ఞలు ఉన్నవి. మానవునిలోని దివ్యత్వానికి అంతకంటె సుగమ, విశిష్టాభివ్యక్తి ఉండదు. యువ లోకంపై అతనికున్న ప్రభావం అనన్యం. అతని జగత్తులో ప్రతి మానవుడూ కవియే...." ఇలా తోరో బాల కవిగా ఎమర్సను రక్షణ పొందుతూ వచ్చాడు. డయల్ ద్వారా సాహిత్య ప్రపంచానికి పరిచితుడయ్యాడు. డయల్‌లో వెలువడిన అతని ఉత్తమ రచన కవిత్వం కాదు. 1842 లో అతని సుదీర్ఘ వ్యాసం వెలువడింది. "మెసచూసెట్స్ ప్రకృతి చరిత్ర" అని దాని శీర్షిక. విషయ ప్రతిపాదన నైపుణ్యం రమణీయ వర్ణనలు కలిగి ఆ

వ్యాసం మునుముందు తగు ఉత్తమ గద్యరచయిత కావచ్చునని సూచించింది. ఆ మరుసంవత్సరమే "మెసచూసెట్స్‌కు పదయాత్ర" అన్న వ్యాసం వెలువడింది. బాహ్య ప్రకృతి వర్ణనలో, యాత్రాచిత్రణలో అతనికున్న శక్తిని ఆ వ్యాసం దృఢపరచింది.

అధ్యాపక వృత్తి మానుకొన్న తరువాత తిరిగి ఏ జీవిక చేపట్టాలా అన్న విచారణకు దొరకొనవలసిన మధ్య కాలంలో ఎమర్సన్ ఇంట హెన్రీకి ఊపిరి పీల్చుకొనే వ్యవధానం లభించింది. కొలది కాలం అతడు సుఖించాడు. తన కర్తవ్యాన్ని నిర్ణించుకొనక పూర్వం గడచిన రెండు సంవత్సరాలలో అతని భావాలు లోతుపాతులు గడించుకొన్నవి. అనుభవం విస్తరించింది. కంకార్డు ప్రకృతి చరిత్రతో పరిచయం పెంపొందించింది. 1942 జనవరిలో ఎమర్సను చిన్నకుమారుడు వాల్డో, హెన్రీ అన్న జాన్ మరణించకుంటే ఆ సంవత్సరాలు ఆనందమయాలుగా ఉండేవి. జాన్‌కు క్షయ పట్టుకొన్నది. దానితో పాఠశాల మూసివేయవలసి వచ్చింది. ఆ రోగంనుంచి తాత్కాలికంగా అతడు కోలుకొని 1941 నాటికి తిరుగుతున్నాడు. కాని 1842 ప్రారంభంలో గడ్డం చేసుకొంటూ ఉండగా గాటుపడి రక్తం విషపూరితమై అతడు చనిపోయాడు.

అంతకు ముందెన్నడూ ఎరుగని ఒంటరితనంతో తోరో బాధ పడ్డాడు. జులైలో మచూసెట్ పర్వత మధిరోహించి ఆ కొండ కొమ్మునందలి శైత్యంలో మనస్సు సేదతీర్చుకోదలచి పశ్చిమాభిముఖుడై ఉష్ణపు మైదానం మీదుగా వెళ్లాడు. ఆ కొండ నెత్తం నుంచి ఉత్తర దిశను ఉత్తుంగతరమైన మొనాడ్‌నాక్ శిఖరాన్ని దర్శించి ఒకానొక నాటికి దానిని అధిరోహించాలని సంకల్పించుకొన్నాడు. నిబ్బరం చేకూర్చుకొని అతడు ఎమర్సన్

ఇంట నున్న తన గదికి తిరిగి వచ్చి తన యాత్రను అభివర్ణిస్తూ "బాస్టన్ మిస్సెలినీ" అన్న పత్రికకు వ్యాసం వ్రాశాడు.

ఎమర్సన్‌ల ఇంట వసించిన రెండు సంవత్సరాలలోను సాహిత్యరంగంలో అతనికి విజయసూచనలు కనిపించాయి. ఐనా ఎమర్సన్‌వలె తన భావాలను ప్రజారంజకాలైన ఉపన్యాసాల ద్వారా, పుస్తకాల ద్వారా వెల్లడించగలిగితే తప్ప వ్రాతప్రోతలతో జీవయాత్ర సాగించటానికి అవకాశం కనిపించలేదు. అతడు కూడ ఉపన్యాసాలకు ఉపక్రమించాడు. కాని కంకార్డు దాటి దూరం పోలేదు. ఒకనాటికి అతడు ప్రఖ్యాతుడు కావచ్చును. కాని ఈ లోగా ఎలా జీవించాలి? ఏ వృత్తి చేపట్టేటట్లు? అతని హృదయం మాత్రం స్వతంత్ర నైసర్గిక జీవనంకోసం అర్రులు చాస్తున్నది. అనుకూల్యం లేని వృత్తికి పూనుకొంటే తన లక్ష్యాలకు తానే ద్రోహి నవుతానని భావించాడు. అతని శీలంలో అంతర్భూతమైన శక్తి శారీరక మానసిక స్వాతంత్ర్యంవల్లనే వికసిస్తుంది. అంతకు ముందే తన దినచర్యలో తోరో ఇలా వ్రాశాడు. "యధార్థ జ్ఞానం ప్రబల నిర్బంధ నిగ్రహాల మూలాన లభించదు. కేవలం అనాసక్తి వలన, బాలునివలె అమాయకంగా ఆనందించటం వలన లభిస్తుంది." ప్రకృతి ప్రతిచోట ఆధునిక లక్షణాలైన కార్యోద్వేగాలను నిరాకరిస్తున్నట్లు కనిపించింది. ఎప్పు డవకాశం లభించినా అతడు సుదీర్ఘ విహారాలు సాగించాడు. ధన సంపాదనార్థం వెచ్చించిన రోజుకంటె గోదురుగప్ప (leopald frog) తో ఉల్లాస కర సంవాదంతో గడిపిన పన్నెండు గంటలు మేలని అతడు భావించాడు. చిత్తడి నేలలోని తన నిగూఢదుర్గం నుంచి బిట్టరన్ పక్షి దివసాంత శతఘ్నివలె కూస్తూ ఉండగా వినగలిగితే చాలు.

ఆ చిత్తడి నేలయందలి ఇవం గృహ మందలి వెచ్చదనం కంటె మేలని అతడభిమానించాడు.

అతనికి మానవులు అత్యంత తీక్ష్ణులుగా, నైతికాసక్తులుగా సామాన్యులుగా, వివాదతత్పరులుగా, గృహబద్ధులుగా గోచరించారు. మానవుడు అడవులలో గోచరించే శంబరమట్లు (moose-ఒక జాతి హరిణం) ఉంటే బాగుండునని అతడనుకొన్నాడు. క్రమంగా ప్రశాంత వానప్రస్థ జీవితం వైపు మొగ్గసాగాడు. అతడు పేర్కొన్నట్లు "శాంతి నిష్క్రియతల ఆసియా" వైపు వ్యాపక్రమింప సాగాడు. హృదయపూర్వకంగా అతడు. కోరుకొంటున్న జీవితాన్ని సమాజం అతనికి ప్రసాదించలేక పోయింది. సమాజానికి తాను చేయగలిగిన విశిష్ట సేవ కూడా కనిపించలేదు. అతడూ సమాజమూ భిన్నమార్గాలు అనుసరింప సంకల్పించినట్లు కనిపించింది. ఆ వెనుక 1840 లో తన కభిమాన పాత్రమైన చోటికి వెళ్ళినప్పుడు అత డిలా వ్రాశాడు: "వాల్డెను సరోవర తీరంలో హాయి గొలుపుతున్న లేయెండలో విహరిస్తుండగా ఈ వెచ్చదనం ఈ ముర్మర ధ్వని నన్ను గతకాలిక బాధ్యతలను మరపించాయి." మునుపటియట్లే సమాజం సాగిపోతుంది. తాను మాత్రం మానవలోకానికి ప్రసాదించగల జ్ఞానం ప్రకృతిలో ఉన్నదేమో పరిశీలిస్తాడు. అయితే ఆ ప్రకృతి ఏమి ప్రసాదిస్తుందో అతడింకా చెప్పలేని స్థితిలోనే ఉన్నాడు. 1842 మార్చి నాటికి ఈ మాత్రమే చెప్పగలిగాడు:—"నేను సంతోషంతో నా జీవిత" సంపదను మానవుల కర్పిస్తాను. నా కాన్కలలో అనర్ఘమైన దానిని వారికి ఇచ్చివేస్తాను....ప్రజాభ్యుదయంకోసం సూర్య కిరణాలను జల్లెడ పడతాను."

ఎమర్సన్ కుటుంబంలో తాత్కాలిక వాసం సమాప్తమయ్యే నాటికి అతడింకా నిశ్చిత ప్రయోజనం, ఆవశ్యక జీవితం తెల్సుకోవలసి ఉన్నది. జీవికకై రచనలు ఉపన్యాసాలు సాగించడం ఒకటే అతనికి లక్ష్యంగా గోచరించింది. ఆ లక్ష్యసిద్ధికై అతడు గట్టిగా ప్రయత్నించాడు. మరొకసారి సాయపడడానికి ఎమర్సన్ దాపునే ఉన్నాడు. తన అన్నగారైన విలియమ్ ఎమర్సన్ కుమారునకు చదువుచెప్పే నిమిత్తం న్యూయార్కు సమీపంలో ఉన్న స్టాటన్ ఐలెండుకు, తోరోను పంపించాడు. న్యూయార్కు ప్రసురణ కర్తృ ప్రపంచానికీ, రచయిత లోకానికి హెన్రీ సమీపంలో ఉంటాడు. దానివల్ల ఎక్కువ అవకాశం పొంది అతడు వాగుపడడానికి వీలేర్పడుతుంది.

తోరో అక్కడ మిత్రులను సంపాదించుకొన్నాడు. పత్రికా రచన, ప్రచురణ విధానం ప్యూరియరిజమ్, వ్యక్తిత్వవాదం మున్నైన వాటినిగూర్చి ఎంతో నేర్చుకొన్నాడు. కాని అతడు విఫలుడయ్యాడు. బహుళ ప్రచారం కలిగిన పత్రికల కొరకు పనికిరాని చెత్తా చెదారం వ్రాయటానికి సిద్ధపడితే తప్ప రచయితగా న్యూయార్కు నగరంలో బ్రతకడానికి అవకాశం చాల తక్కువని అతనికి బోధపడింది. ఆ రోజులలో కూడ ఆడవాళ్ళ పత్రికలు రచయితలకు బాగా డబ్బిచ్చేవి. "లేడీస్ కంపానియను అనేది బాగా డబ్బిస్తుందని అంటారు. కాని దానికి ప్రచురణ యోగ్యమైన దేది నేను వ్రాయలేను," అని అతడు వ్రాశాడు. అతనికి న్యూయార్కు అంటే ద్వేషమూ, కంకార్డు అంటే అభిమానమూ ఏర్పడ్డవి. ఒక్కసారిగా అంతమంది జనుల సందర్శనం అతనికి భయం కలిగించింది. జన సందోహం చూస్తేనే అతనికి ఎంతో నిరుత్సాహమేర్పడేది. రచనలో అతడు ముందుకు వెళ్ళలేకపోయాడు.

"మధ్య తరగతికి" చెందిన విలియమ్ ఎమర్సను కుటుంబపు సాహచర్యంతో అతనికి విసుగెత్తింది. శ్వాసకాస గూడ దీనికి తోడయింది. ఇంటికోసం కలవరించి దాదాపు ఎనిమిది మాసాలపిమ్మట అతడు ఇంటికి తిరిగి వచ్చాడు. వినోదార్థం బయలుదేరినప్పుడు తక్క తిరిగి ఎన్నడూ అతడు కంకార్డ్ నుంచి కాలు బయటపెట్టలేదు. అతనికి అమూల్యాలైన ప్రవాస స్మృతులు కొలదిగా ఏర్పడ్డవి. అట్లాంటిక్ సముద్ర తీరానుభవం పొందాడు. నూతన పుష్పాలను, పక్షులను, మానవులను చూశాడు. జీవిత సౌందర్యాల నూతన విధానాలను కనుగొన్నాడు. న్యూయార్కు యావజ్జీవ మిత్రుని ప్రసాదించింది. అతని పేరు హొరేస్ గ్రీలీ. సోషలిస్టు భావనా ప్రపంచాలు (Utopias) అంటే గ్రీలీకి ఎంతో ఇష్టం. "న్యూయార్కు ట్రిబ్యూన్" పత్రికకు సంపాదకుడై అనతికాలంలోనే అతడు ప్రఖ్యాతుడు కాబోతున్నాడు. నవలా రచయితకు తండ్రియైన హెన్రీ జేమ్సు "ఉదాత్తుడు, లౌకిక జ్ఞానసంపన్నుడు." అతనితో తోరో సుదీర్ఘ తాత్విక సల్లాపం సాగించి పునరుత్సాహం పొందాడు.

1844 ప్రారంభానికి తోరో తిరిగి కంకార్డుకు వచ్చాడు. అనుదినం కంకార్డు పరిసరాల్లో సంచరిస్తూ అచటి ప్రకృతి చరిత్రను పరిశీలించి తాను కనుగొన్న విషయాలను గ్రంథస్థంచేసే అవకాశం కావాలి. ఇది అతనికి అత్యంత ముఖ్యం. దీనికి భంగం వాటిల్లకుండా జీవయాత్ర సాగించే మార్గమేదా అన్న చిరకాల సంశయాన్ని అతడు తిరిగి తన 27వ ఏట పరిశీలించి తెగటార్చుకొనవలసి వచ్చింది. ప్రకృతి శాస్త్రజ్ఞత్వమే తనకు విశిష్టమైన దివ్యాదేశమని అతనికిప్పుడు బోధపట్టింది. జీవితం సార్థకం కావాలంటే ఈ మార్గమే ధైర్యంతో అనుసరించాలి. వీలైనంత తక్కువగా

తన కాలాన్ని. శక్తిని సమాజాని కర్పించాలి. వయస్సుపై బడిన కొలది ఇతరులకు కోరికలు కూడ పెరుగుతుంటవి. తాను మాత్రం తన కోరికలను క్రమ క్రమంగా తగ్గించుకోవలసి ఉంటుందని అతడు గ్రహించాడు. జీవిత ప్రాథమికావశ్యకతలకు తక్కతక్కిన వాటికై వ్యయించే కాలవిషయంలో పిసినారితనం వహింప సాగాడు. వస్తువు విలువను, దాని సంపాదనకై వెచ్చించవలసిన కాలాన్ని బట్టి నిర్ణయించ మొదలుపెట్టాడు. ఎమర్సన్ కుటుంబంతో కలిసి ఉండటానికి వెళ్ళక ముందున్న ఏకాంతతా కాంక్ష తిరిగి అతనికి కలిగింది. దానివల్ల హృదయంలో కలిగే మార్పులపై జర్మను తత్త్వవేత్త అయిన "జీమర్మను" వ్రాసిన రచనలను, "ప్రకృతి" అన్న గ్రంథంలో ఎమర్సన్ వ్రాసిన అంశాలను చదివాడు. ఆ పుస్తకం ఎన్నడూ అతనిపథం పడలేదు. ఎమర్సన్ ప్రకృతిలో ఇలా వ్రాశాడు: "అడవులలో నిత్యయౌవనం ఉన్నది. అడవులలోనే మనం భక్తి వివేకాలకు తిరిగి చేరుకుంటాము." అనంత విశ్రాంతి నిరవధికత్వాలను ప్రకృతి పిచ్చుకల కిచకిచలతో గానం చేస్తున్నట్లుగా తోరోకు వినిపించింది.

ఇలాంటి స్థితిలో ఉండగా అతడొక నాడు ఆల్కాటునుంచి గొడ్డలి అడిగి పుచ్చుకొని వాల్డెన్ సరోవర ప్రాంతారణ్యాలలో కుటీరం నిర్మించుకొనే నిమిత్తం చెట్లు కొట్టాలని వెళ్లాడు. ఏ వస్తువు ఏమిటో తేల్చుకోవాలంటే ప్రశాంతావాసం కావాలని చిర కాలం క్రిందటనే అభిలషించాడు. ప్రతివారి నుంచి దూరంగా వెళ్లిపోవాలని కోరాడు. వారిని మరచిపోదామన్న కోరికలేదు. నిర్లిప్తంగా వారిని చూడాలని అతని వాంఛ. ఇంటివద్ద ఉంటే తన తల్లి. అక్కచెల్లెండ్రు, అత్తలు పెద్దమ్మలు, పిన్నమ్మలు ఇతర అతిథులు సాగించే సాంఘిక సంస్కరణ చర్చలతో అతని చెవులు

గింగురుమనేవి. ఎమర్సన్ దంపతుల ఇంటికిగాని, మరొకరి ఇంటికిగాని వెళ్లితే పారమార్థిక వాదఘోషలు వినిపించేవి. మొదట్లో అవి కుతూహల జనకంగా ఉన్నా రాను రాను చర్విత్వ రచర్వణతో నీరసాలయ్యాయి. అతనికి వాదాలకంటే అన్యమైన మార్పు కావాలి. జీవితాన్ని సాకల్యంగా పరిశీలించి తత్ప్రధానాం శాలను తేల్చి తదీయార్థాలను నిర్ణయించుకొనే నిమిత్తం ఏకాంతంగా ఆలోచించాలనీ కర్మానుష్ఠానం కావించాలనీ అతని అభిలాష. "జీవితేతరమైన దానినెల్ల నిర్మూలించే నిమిత్తం సాధ్య పడినంత నిగ్రహపటుత్వాలతో జీవితం సాగించాలని సంకల్పించుకొన్నాను."

## అధ్యాయము 4

"ధనంలో కాకపోయినా ఎండ ప్రొద్దులందు, వేసంగి రోజులందు నేను సంపన్నుడ వయ్యాను."

—తోరో (వాల్డెన్)

వాల్డెన్ సామీప్యంలో ప్రకృతితో సావాసం నెరపాలన్న భావంతో ఎమర్సన్ ఆ సరోవరానికి వాయవ్యభాగంలో అడవి భూమి కొన్నాడు. అద్దె లేకుండా ఉండమని దానిని తోరోకు ఇచ్చి మరొకసారి అతని కృతజ్ఞతకు పాత్రుడయ్యాడు. ఈ పని జరగకపోతే తోరోకు వాల్డెన్ పర్ణశాల అమరేది కాదు. ఒక సంవత్సరం క్రిందట అతడూ అతని మిత్రుడూ వనభోజన సమయాన ప్రాలుమాలటం వల్ల అగ్ని బయలుదేరి నదీ తీరం వెంట నున్న నూరెకరాల అడవిని కాల్చివేసింది. ఈ మిత్రుడు కంకార్డ్ ప్రముఖపౌరుడైన జడ్జి "హోర్"కు పుత్రుడు కాకుంటే తోరో చిక్కులపాలయ్యేవాడు. ఆ స్థితిలో ఆ ప్రాంతాన కొన్ని మైళ్ళలో ఏ భూస్వామీ తన అడవులలో అతని ఉనికికి సమ్మతించేవాడు

కాదు. 1845 మార్చి మాసాంతంలో తోరో నిజ కుటీర నిర్మాణార్థం బయలుదేరాడు. నూతన జీవిత సృష్టికి అదే తగిన తరుణం. చలికాలమూ, అందలి ఇరుకు సరుకులూ అంతరించాయి.

ఏప్రిల్ 1వ తేదీన పొగమంచు పట్టింది. సరోవరంలో మంచు కరుగుతున్నది. ఒక పక్షంపాటు అతడు అనుదినం వాల్డెన్‌కు వెళ్లి తాపీగా కుటీర నిర్మాణానికై కృషిచేస్తూ దేవదారు తరుగంధిలమైన వాయువులో శాండ్‌విచెస్ తింటూ గొడ్డలి పెట్టుల మ్రోతలు విని దాపుకు వచ్చిన తెరువరులతో ముచ్చటిస్తూ వచ్చాడు. సరోవరానికి ఎగువ కొండపైనున్న కోనిఫర్ చెట్లలో తిన్ననైన తరుణ దేవదారువులను ఏరి కుటీరం చట్టానికి వలసినన్ని చెట్లు కొట్టాడు. గొడ్డలి ఇతరులనుంచి పుచ్చుకోవలసి వచ్చింది. కాబట్టి అది స్వతంత్ర ప్రారంభంకాదని అతని భావన. పెట్టుబడి లేనప్పుడు అంతకంటె దారిలేదు. అతడు తరువాత యజమానికి తొల్లి పుచ్చుకొన్న దానికంటె పదునైన గొడ్డలి తిరిగి అప్పగించాడు. అది సన్నచొడ్డలి అని అతడు వర్ణించాడు. అంటే పొడుగువాయి కలిగి ఇంగ్లీషు గొడ్డలిని పోలి ఉన్నది. మూలకంబాలను నలుచదరంగా చెక్కడానికి అతడు దానిని వినియోగించాడు.

ఆ తరువాత వలసిన పరికరాలను అరువుతెచ్చి కడ్డీలకు కూసాలు బెజ్జాలు కల్పించి చట్టంలో బిగించాడు. ప్రక్కలకు కప్పునకూ వలసిన చెక్కను సమీప కుటీరంనుంచి తెచ్చాడు. అది ఒక ఐరిష్ వ్యక్తి ఆవాసం. అతడు సరోవరం ప్రక్కనేపోతున్న రైలు మార్గంమీద స్వజాతీయులనేకులతో కలిసి పనిచేసేవాడు. ఆ కుటీరం కుటీరం కాదు. పెంటపోగువలె నీచంగా ఉండేది.

దానిని పడిపోనీక వెచ్చగా ఉంచడానికి చుట్టూ అయిదడుగుల ఎత్తున మట్టి పోశారు. తోరో ఆ కుటీరాన్ని నాలుగు డాలర్ల 25 సెంట్లకు కొన్నాడు. చైత్రమాస మధ్యంలో ఒక ఉదయాన బండిపై తక్కిసామీద దానిని తన నెలవునకు చేరవేశాడు. నిరుద్యోగి అయిన ఒక ఐరిష్ వ్యక్తి ప్రేక్షకుని యట్లు నిలబడి అతడు అటుపోయి ఇటు వచ్చేలోపున అందున్న మేలైన మేకులు అపహరించాడు. కుటీరం ముగించక ముందు దాని వెనుక సులా టీలో చలిదెబ్బకు పాల్పడనీక కూరగాయలు దాచుకొనే కొట్టు కల్పించే నిమిత్తం త్రవ్వవలసి వచ్చింది. చెట్ల వేళ్ళను ఛేదించి ఏడడుగుల లోతు త్రవ్వాడు. అచట మంచి ఇసుక పొంది సంతో షించాడు. ఇంటికంటె ముందు తిండికై జాగ్రత్తపడటం ఆదిమ మానవునకు సహజమే కదా! బాస్టను నగరంలోని ఇండ్లకయినా దుంపలు దాచుకోడానికి ఇలాటి నేలకొట్లు ఉన్నవా అని అతడు పరామర్శించాడు. అలాంటి కోష్ఠాన్విత గృహం ఎంత అందంగా ఉన్నా బిలాగ్రాలింద విశేషమే కదా అని అనుకొన్నాడు. ఇలాంటి కొట్లుకూడ అతనిని ఎంతగానో ఆకర్షించాయి. ఎందుకంటే ఇంట్లో చిరకాలం మనేది ఈ భాగమే. ఇల్లుకూలి నశించినా తరచూ ఈ కొట్టు గుంటరూపాన నిలిచిపోతుంది. ఒక శతాబ్దం గడచిన తరువాత భూమిలో నిలిచిపోయిన ఈ గుంటను సంద ర్శించడానికి ప్రజలు వస్తారని తెలిసి ఉంటే అతడు ఎంతో సంతో షించి ఉండేవాడు. ఎందువల్లనంటే కంకార్డు పరిసరాలలోని పూర్వవాస శిథిలాల సందర్శమందు అతనికి ఆసక్తి ఉండేది.

కుటీర నిర్మాణార్థం సేకరించిన ప్రతి కర్రముక్కతోనూ, త్రవ్విన ప్రతి పారమట్టితోను అతడు మిక్కిలిగా ఆనందం పొందాడు. ఆయా పనులు చేస్తున్నప్పుడు కలిగిన భావాలతో

ఆనందించాడు. ఈ ఆనంద విస్తృతికై అతడు కుటీరం మెల్ల మెల్లగా నిర్మించాడు. కుటీరపు చట్టం నిలబెట్టటానికి పారమార్థిక వాద మిత్రుల సాయంపొందాడు. ఆవశ్యతకంటె ఇరుగు పొరుగు లందున్న అభిమానంవల్లనే ఇలా చేయటం జరిగింది. సరోవరం నుంచి పొగగొట్టపు కట్టడంకోసం రాళ్లు చేతివాటున చేరవేసి కప్పు. పలకలు పూర్తిగ వేయకముందే పునాదివేశాడు.

1845 జులై 4 తేదీకి కప్పుమీద కడపటి పలక ఎక్కింది. లోన చినుకుపడకుండా చేయవలసిన పని అప్పటికి ముగియలేదు. పొగగొట్టం కూడ పూర్తికాలేదు. అయినా కుటీర ప్రవేశంచేసి తోరో కాపురం ప్రారంభించాడు. యాదృచ్ఛికంగా నాడు అమెరికా తక్కిన కట్టుబళ్ళకు వ్యవధానంలేదు. కుటీర ప్రాంతంలోని నిస్సారమైన రెండున్నర ఎకరాల గరపమడిలో చిక్కుళ్లూ, కూరగాయలు పెట్టాడు. అందులో చాళ్లు దున్నవలసి ఉన్నది. వసంత ఋతువులో ఆమడిలో చెట్ల మొదళ్లు త్రవ్వివేసి బాడుగ గుర్రాలతో దున్ని సాగునకు సిద్ధపరిచాడు. అంతరించిన ఇండియన్ల బాణపు ములుకులు దుక్కి దున్నుతుండగా బయటపడ్డాయి. మొదటి వేసవిలో చిక్కుడు చాళ్లు పెట్టాడు. ఆ చాళ్ళను ఒండొంటితో జోడించి తిన్నగా నిలిపితే ఏడుమైళ్ళ పొడవుంటవని లెక్కగట్టాడు. అతడు దున్నిన తరువాత ఎప్పుడో చిక్కుళ్లు నాటజొచ్చాడు. వాస్తవానికి కలుపుకూడా తీసివేయవలసిన తరుణంలో ఆ పని ప్రారంభించాడు. దాని పర్యవసానంగా కలుపు మెండుగా పెరిగి పైరును మ్రింగివేసేటట్లు కనిపించింది. ఆ వేసవి అంతా మొక్కలు మధ్య చాళ్లు క్రిందికీ మీదికీ రోజూ కొన్ని గంటల సేపు త్రవ్వి త్రవ్వుగోలతో కలుపు తీసివేస్తూ వచ్చాడు. ఇది అతని కొక క్లేశంకాదు. చిక్కుళ్ళను పెంచడం అతని కొక

వినోదమై చిత్తశాంతిని చేకూర్చింది. తోడి రైతులవలెనే తన భూమికి తాను బద్ధుడనై పోలేదని హర్షించాడు. చిక్కుడు చేను ఏ నిమిషాననైనా విడిచిపోగలననీ, దానివలన ఎక్కువ నష్టపడననీ గుర్తించి సంతోషపడ్డాడు. చీకు చింతాలేని అలాంటి రైతు మరొకడుండడు. అతని చేనికి ప్రక్కన కంకార్డుకు పోయే రోడ్డున్నది. ఆ మార్గాన పోయేవారికి కనిపించక చిక్కుడు చాళ్ళ నడుమ కలుపు మొక్కలు తీసివేస్తూ వారు చెప్పుకొనే మాటలు వినేవాడు. ఆ దారినిపోయే రైతులు ఆ పైరును గూర్చి పుల్లవిరుపులు పలికేవారు. అవి విని అతడు నవ్వుకొనేవాడు. సగ్నపాదుడై కృషి చేస్తున్న ఆ సస్యపోషణోత్సాహి ప్రధానంగా తత్త్వక్షేత్ర కర్షణం సాగిస్తున్నాడనీ, కావలసినది గడ్డికాదు చిక్కుళ్ళని వేసవిలో భూమిచే పలికిస్తున్నాడనీ వారికేమి తెలుసు?

భూ జీవనం అతనిని మిక్కిలిగా ఆకర్షించింది. మెసాచుసెట్సు అంత ఉత్తరాన గూడా ఆరోగ్యానికి బలానికి కావలసిన ఆహారంకోసం మానవుడు తన ఇరుగు పొరుగులపై ఆధారపడక జీవయాత్ర సాగించవచ్చునని అతడు భావించాడు. అయినా కలుపు మొక్కలతో కొన్ని వంటకాలు తయారు చేయటం వినా అతడు అధికంగా పరిశోధనలు సాగించలేదు. బియ్యం, గోధుమపిండి, చక్కెర పానకం (Molasses), మరికొన్ని పదార్థాలు కొనుక్కుంటూనే ఉన్నాడు. మొదట్లో ఈస్టును ఉపయోగించి రొట్టెను తయారు చేసుకొనేవాడు. ఈస్టు కలపని రొట్టెతోనైనా కాలక్షేపం చేయవచ్చునని తరువాత తెలిసికొని సంతోషించాడు. అప్పుడు గ్రామంలోని రొట్టెల వానిపై ఆధారపడవలసిన అవసరం ఉండదు. తన స్వభావానికి తగినట్లుగా రొట్టెలు ఎలా చేయాలో బోధించే సిద్ధాంతాలను అతడు చదువ నారంభించి ఆశాభయందు ప్రాచీన

ప్రామాణికుల వాదాలను అవలోకించి స్వకీయ పద్ధతి ఒకటి కను గొన్నాడు. ఈ పద్ధతిని తయారుచేసిన రొట్టె శరీరధారణకు చాలు. రుచులు కోరేవారి కది నచ్చకపోతే పోవచ్చును. నిరాడంబరతనూ పొదుపరితనాన్నీ అభిలషించి టీ కాఫీ మానివేశాడు. దాదాపు శాకాహారి అయ్యాడు. కాకపోతే ఎప్పుడన్నా వాల్డన్‌చేపలు తినేవాడు.

అతని ఇల్లంతా కలసి 15 అడుగుల పొడవు, 12 అడుగుల వెడల్పుగల గది ఒకటి. దానిమీద అట్టక, క్రింద నేలకొట్టు. ఈ పెద్దగదిలో ఒక మంచం, బల్ల, వ్రాత బల్ల, మూడు కుర్చీలు, మూడు అంగుళాల వ్యాసం గలిగిన అద్దం, పట్టకారు, పొయ్యిలో కట్టెలుంచి కాల్చడానికి వలసిన కొరముట్టు(Andirons), చిన్నకాగు, లోహపు వంటపాత్ర (Skillet), పెనము, కలియబెట్టుకొనే గరిటె, కడుగుకొనే వెడల్పాంటి గిన్నె, రెండు కత్తులు, రెండు ఫోర్కులు, మూడు పళ్ళాలు, ఒక కప్పు, ఒక గంటె, నూనె సిద్దె, చక్కెర పానకానికి ఒక కూజా, జపాను వార్నీషువేసిన దీపం ఉన్నవి. తనకు అన్ని కుర్చీలు దేనికో వివరిస్తూ అన్నాడు: "ఏకాంతకాల యాపనకు ఒకటి కావాలి. స్నేహ సుఖానుభూతికి రెండు కావాలి. సమాజ సంపర్కం కావాలంటే మూడవసరం." అదనంగా ఉన్న పళ్ళాలు, కత్తులు మున్నైనన భోజనోపకరణాలు అతిథి వచ్చి నప్పుడు కలిసి భోజనం చేయడానికి తోడ్పడాలి. ఒకేసారి అనే కులు వస్తె సామాన్యంగా వారిని భోజనానికి ఉండమనే వాడు కాడు. ఇంటిపని అతనికి సుఖంగా గడిచిపోయింది. గది మురికిగా ఉంటే మరునాడు పెందలకడనే లేచి ఉపకరణాలన్నీ బయటపెట్టి నీరుపోసి రుద్ది కడిగి ప్రొద్దుటెండకు ఆరవిడిచి తాను ఆలోచనా నిమగ్నుడయ్యేవాడు. "వెలుపలి పచ్చికపై గృహోపకరణాలను

ప్రోపుగా వేసినపుడు ఆదృశ్యం విచిత్రంగా కనిపించేది. అది జిప్సీలనే సంచారకజాతి వస్తుసామగ్రి వలె గోచరించేది. ముక్కాలి పీటమీద పుస్తకాలు, కలం, సిరాబుడ్డి, అలాగే దేవ దారు తరువుల మధ్య హికరీల (Hickories) మధ్య ఉండేవి. ఇంటి నుంచి బయటపడినందుకు సంతోషిస్తూ మళ్ళీ లోపలికి చేరటానికి ఇష్టపడనట్లు అవి కనిపించాయి. ఒక్కొక్కప్పుడు వానిపై ఆచ్ఛాదన కల్పించి, నేను కూడ వాటి ప్రక్కన కూర్చోవాలని అనిపించేది. ఈ వస్తువులపై సూర్యుడు ప్రకాశిస్తూ స్వతంత్ర పవసం వీస్తూ ఉంటే దర్శనీయంగా ఉండేవి."

వాల్డన్‌లో రమణీయ గ్రీష్మదివసం ప్రాయికంగా అతనికిలా గడిచేది:- ఉదయం 5-30 గంటలకులేచి వెచ్చని సరోవరంలో ఈదేవాడు. తరువాత సామాన్యంగా కలుపుతీతకు కూర్చునేవాడు. ఆ మధ్యలో లఘుభోజనం కావించి శీతల ఝరీజలం త్రాగేవాడు. తన ఒంటిమీద మట్టి పోగొట్టుకోవటం కోసం మధ్యాహ్న భోజనానికి ముందు మరొకసారి ఈతకొట్టేవాడు. కొన్ని సందర్భాలలో కలుపుతీతకు బదులు చదువుతోనో, వ్రాతతోనో ఉదయం గడిపేవాడు. అప్పుడుచేసే రెండో స్నానం "చదువుతో ముఖంమీద ఏర్పడిన తుది ముడుతను పోగొట్టుకొనడం కోసం" ఉద్దిష్టం. మధ్యాహ్న భోజనానంతరం తరచుగా అతడు గంధమూషికాలకు (Musk-rats) మారుగా మానవులను పరిశీలించే నిమిత్తం కంకార్డు గ్రామానికి వెళ్ళేవాడు. ఊరి ముచ్చట్లు హోమియోమందు మోతాదులో తీసుకుంటే పర్ణమర్మరధ్వనులవలె, కప్పల అరుపులవలె హృద్యాలుగా, ఉత్సాహ జనకాలుగా ఉంటవని అతనికి తెలిసివచ్చింది. కాని అతని అపరాహ్ణ సంచారం మెండుగా మరొక దిశకు సాగేది. ఏకాంతములైన అనూపారణ్య ప్రాంతాలకు చేరుకొనేవాడు. అత

ధక్కడ ఉద్భిజ్జాలను, పక్షులను పరిశీలించేవాడు. లేదా ప్రశాంత శీతల స్థలానికి చేరి చదువో, వ్రాతో, ధ్యానమో సాగించేవాడు. "విద్వాంసులను సందర్శించడానికి మారుగా ప్రత్యేక వృక్షాలను దర్శించేవాడను. ఆయా జాతులు ఈ ప్రాంతంలో చాలా అరుదు. అవి ఎక్కడో దూరాన పచ్చికబయలు నడుమనో, అరణ్య మధ్యం లోనో, చిత్తడి నేలలలోనో, కొండ కొమ్ములనో ఉండేవి. నీల భూర్జానికి (Black Birch) మనోహరాలైన ప్రతి రూపాలు మన కున్నవి. దాని వ్యాసం రెండడుగులు. దాని జ్ఞాతి పీతభూర్జం (Yellow Birch). ఇది వదులైన బంగారు వన్నె బెరడుగలిగి మొదటి దానివలె సుగంధం వెదజిమ్ముతుంటుంది. బీచ్ వృక్షం (ఇది భూర్జ జాతీయం) చక్కని బోదె కలిగి ఉంటుంది. ఈ బోదె పుట్టకొక్కులతో అలంకృతమై అందంగా ఉంటుంది. అక్క డక్కడ చెదురు మదురుగా ఉన్న ప్రతిరూపాలు తక్క నాకు తెలిసినంతలో ఇది మరొక చోటలేదు. ఒక పేటలో మాత్రం వీని తోపు ఒకటి ఉన్నది. ఇది ఒకప్పుడు సమీపమందు ఎరగా చల్లబడిన బీచ్ గింజలచేత ఆకృష్టాలైన పావురాళ్ళచే వేయ బడినదని కొందరంటారు. ఈ కర్రను బద్దలు కొట్టినప్పుడు మిల మిల వెండిలా మెరిసిపోయే కర్రతీరు కనుల పండువుగా ఉంటుం ది. బాస్, హారన్‌బీమ్, కెల్టిస్, ఆక్సిడెంటలీస్, లేదా ఫాల్స్ ఎల్మ్, దేవదారు స్తంభం, షింగిల్ వృక్షం లేదా అరణ్యాలలో గోపురంవలె కనిపించే అసామాన్యపు హెమ్లాక్ వృక్షం - వీనిని దర్శించేవాడను."

అడవులలో ఉన్నంత కాలంలోను తొరో ఒక గంట మాత్రమే దుర్భర ఏకాంతతను అనుభవించాడు. ఆ స్వల్పకాలికో న్మాదం గడిచిపోయింది. తిరిగి అలాంటిది ఎన్నడూ అతనికి

కలుగలేదు. తన సర్వేంద్రియాలతో అతడు ప్రకృతిని సందర్శించాడు. తరువాతి కాలమంతా ఆమెను తగిన సహచారిణిగా గుర్తించాడు. ఒంటరిగా ఉండటం అతనికి ప్రియం. ఏకాంతత వంటి సహచారిణి మరొకతె అతనికి కనిపించలేదు. వాల్డన్ ప్రాంతాన గడపిన జీవితంలో అత్యంత సంతోషదాయకమైన అంశం ఒకటి ఉన్నది. అతని కుటీరం ఎందరినో ఆగంతుకులను ఆకర్షించింది. ఒకటి రెండుసార్లు ఇరవైయైదు మందికి పైగా అచటికి చేరారు. అయినా అది అంత ఇరుకు అనిపించలేదు. పారమార్థికవాద మిత్రసంఘం అపరాహ్ణం విహారయాత్రకు బయలుదేరి వచ్చినపుడు ఆ సాహచర్యం ప్రియతరంగా ఉండేది. కుటీర ఉపసంలో ప్రత్యేక సుఖం ఒకటి ఉన్నది. అతిథులను రాత్రికి ఉండమనక్కర లేదు. వారి రాకలు నిలుకడలు అల్పకాలికాలు. స్వల్పకాలం ప్రజలను చూడటంవలన అతనికి అమిత సంతోషం కలిగేది. వారి నిర్గమనంతో ఏకాంత వాస సుఖం మెండయ్యేది. మానవ సహవాసం ఖావాలనుకొంటే జోయి ఒక అరగంటకు కంకార్డులో ఉండేవాడు. చూడాలని వచ్చే మిత్రులు, యాదృచ్ఛికంగా వచ్చే క్రొత్తవారు, తన కుటుంబంవారు శనివారం నాడు వచ్చేవారు. తాత్త్విక దృష్టిగల హాస్మర్ అన్న రైతు ఆదివారాలు వాల్డన్‌డు విచ్చేసేవాడు. హేమంత సాయంకాలాలలో అనల్పైక సాహచర్యాదైఉన్నప్పుడు వేణువాదం సాగించేవాడు. లేదా విగతులైన ఇండియన్లతో తదీయారణ్యాలు పునస్సంపన్నాలైనట్లుగా ఊహించుకొంటూ వినోదించేవాడు.

నిరుపేదలై నిలుకడలేక ఆశ్రయం దొరికిన చోట కొంత కాలం నిలిచిపోయే కుటుంబాలకు వాల్డన్ ఆశ్రయ మిచ్చిందని అతని సమకాలికులు పేర్కొన్నారు. చిక్కుడు పనికి వెనుక

నున్న మార్గాన సమాజ బహిష్కృతులై ఏనాడూ సంపన్నులు కాని ఈ నిరుపేదలు మెండుగా పయనిస్తుండేవారు. సమాజాంచలాలలో బ్రతికే ఈ నిరుపేదలందు అతనికి సానుభూతి ఉన్నది. ముఖ్యంగా స్వతంత్రులుగా విదేశీయ లక్షణలక్షితులుగా గోచరించినపుడు వారియందు అతడెక్కువ సానుభూతి చూపేవాడు. గతించిన నిరుపేద నీగ్రోల సంస్మృతి, ఐరిష్‌వారి స్మృతి సుస్థిరంచేసి వారిని గౌరవించటం అతని కిష్టం. దివంగతులైన బ్యాంకర్లను, నౌకల యజమానులను, ఆచార్యులను, మతబోధకులను, ఇతర గౌరవాస్పద పురుషులను బాస్టన్ నగరవాసులు గౌరవించినట్లే ఇతడు వారిని గౌరవించాడు. కంకార్డులోని ఒక ఉదార హృదయుడు వాల్డన్ అడవులలో కేటాకు కేటాయించిన ఆ చిన్నస్థలం అక్రోట వృక్షాలనడుమ నున్నదని కనిపట్టి అర్ధ భగ్నమైన భూగర్భ కోష్ఠ సురంగం ఇంకా అవశిష్టమై ఉన్నదని అతడు తెలియజేశాడు. దేవదారు వృక్ష సంఛన్నత వలన దాని ఉనికి సామాన్య పథికు లకు తెలియదు. కొలదిమందికి మాత్రమే అది పరిచితం. ఇప్పు డది షూమక్‌తో నిండి ఉన్నది. గోల్డెన్‌రాడ్‌కు చెందిన ప్రాచీన తమ జాతి అక్కడ సమృద్ధిగా పెరుగుతున్నది. అతని పొలం మూల జిల్పా అన్న నీగ్రో వనిత స్వల్పకుటీర చిహ్నాలు కని పించాయి. ఆమె క్షౌమం వడికేది. సమాజ సంపర్కం పరిహరిం చేది. ఆమె సంగీతంతో వాల్డన్ అడవులు ప్రతిధ్వనించేవి. ఆ కుటీరానికి మరికొంత దూరాన మాజీ బానిస అయిన బ్రిష్టర్ ఫ్రీమన్ ఉండేవాడు. అతని వృద్ధవృక్షాలు అల్పరసాలై వన్యాలైన ఆపిల్ పండ్లను ఇంకా కాస్తూనే ఉన్నవి. వాటిని నాటిన యజమా నుని స్మృత్యర్థం ఆ పండ్లను చవిచూచాడు. ఫ్రీమన్ సమాధిని కూడా తొరో సందర్శించాడు. అది ప్రాచీనమైన లింకన్ నగర

శ్మశాన వాటికలో, స్వాతంత్ర్య సంగ్రామ ప్రథమ సంఘర్షణలో కంకార్డ్ నుంచి పశ్చాద్గమనం సాగిస్తూ కూలిన బ్రిటిష్ గ్రెనెడియర్ల అచిహ్నిత సమాధుల దాపున ఉన్నది. వాల్డన్ అడవి లోపలిభాగంలో కుమ్మరి వైమన్ నివసించేవాడు...."ఈఅడవులలో నాకంటె పూర్వం నివసించిన వారిలో కడపటివాడు ఒక ఐర్లెండు దేశీయుడు. పేరు హ్యూ క్వాయిల్. ఇతడు వైమన్ ఇంట నివసించేవాడు. ఇతనిని కర్నల్ క్వాయిల్ అనేవారు. వాటర్లూ యుద్ధంలో సైనికుడై యుద్ధం చేశాడన్న కింవదంతి ఉండేది. అతడు బ్రతికి ఉంటే మరొకసారి అతనిచేత ఆ యుద్ధాలు చేయించి ఉండేవాడను. మురుగు కాలువల త్రవ్వకమే అతనికి వృత్తిగా ఉండేది. నెపోలియన్ సెయింట్ హెలీనాకు పోయాడు. క్వాయిల్ ఇక్కడకు వచ్చాడు. అతనిని గూర్చి నాకు తెలిసినదంతా విషాదమయమే." ఒకసారి నదీ ప్రాంతాన వర్షంలో చిక్కుకొని ఆశ్రయంకోసం పరుగిడి తోరో వట్టిపోయి ఉన్న ఒక దీర్ఘ కుటీరం చేరాడు. అందులో ఐరిష్ దేశీయుడైన జాన్‌ఫీల్డు, అతని భార్య, పెక్కుమంది పిల్లలు కాపురం ఉంటున్నారు. తక్కువగా వెలుస్తున్న భాగంలో వారంతాచేరి కూర్చున్నారు. జాన్‌ఫీల్డు తన నిర్భాగ్య చరిత్రను వినిపించాడు. దానికి ప్రతివచనంగా తోరో నిరాడంబర జీవితాన్ని అభివర్ణించి ఖర్చు తగ్గించుకొనే మార్గాలు సూచించాడు. ఫీల్డు సతీమణి పెద్ద పొయ్యిమీద అన్నిసార్లు వండి వార్చి పెట్టిందంటే ఆమె నిజంగా ధీరురాలై ఉండాలని అతని కనిపించింది. "ఆమె ముఖం గుండ్రంగా ఉండి జిడ్డు కారుతున్నది. చంటిపైకి రవికకూడా లేదు. అయినా ఏ నాటికో ఒక నాటికి తన స్థితిని చక్క బరుచుకో గలనని ఆమె ఆశిస్తున్నది."

వాల్డన్‌లో ఉండగా తోరోకు తుపాకిలేదు. అక్కడక

వెళ్ళక పూర్వమే తదుపయుక్తియందలి మమకారం వదలుకొన్నాడు. తమ జాతికీ జంతుజాలానికీ మానవులు చూపిన భేదం పక్వమనస్కుడైన కొలది అతనికి చాల కృత్రిమంగా కనిపించింది. వాల్డనులో వన్యజీవుల సన్నిహిత సాహచర్యానుభవం పొందిన మీదట మృగయాపరులు, ప్రకృతి శాస్త్రవేత్తలు జీవులకు కలిగిస్తున్న బాధలు, హింసలు చూచి వాటిపై జాలిపడేవాడు. ప్రతి ప్రకృతి శాస్త్రవేత్త తుపాకి పట్టుకొని వెళ్ళే ఆ రోజులలో అతడిలా వ్రాశాడు: "నేను పులుగుల విషయాలు పరిశీలిస్తున్నాను. క్రొత్త పక్షులను, అరుదైన పిట్టలను వెదకుతున్నాను అన్న సాకుతో గత సంవత్సరాలలో తుపాకి పట్టుకొని పోవటం జరిగింది. ఇప్పుడు అలా కాదు. పక్షుల పరిశీలనకు అంతకంటె ఉత్తమ మార్గమున్నదని ఒప్పుకొంటాను. పక్షుల అలవాట్లను ఎక్కువ శ్రద్ధతో పరిశీలించాలంటే తుపాకిని వదలివేయటమే మేలు. ఏ ఒక కారణంకోసమైనా నేను తుపాకిని వదలి వేయటానికి ఇష్టపడుతున్నాను."

వాల్డన్ మడుగులో చేపలు పట్టటమందలి ఆసక్తి గూడా అతనికి సన్నగిల నారంభించింది. ఆత్మగౌరవ భంగకారి కావటం వల్ల దానివలన సుఖం కూడా తగ్గింది. అతడు వ్రాశాడు: "ఒక్కొక్క ఏడు పైబడుతున్న కొలది మానవత్వంకాని జ్ఞానం కాని పెంపొందక పోయినా నా జాలరితనం మాత్రం తగ్గుతున్నది. ప్రకృతం నేను జాలరినే కాను. ప్రాకృతావస్థలో జీవయాత్ర సాగించవలసి వస్తే మత్స్యగ్రహణం, మృగయ తిరిగి నన్ను ప్రలోభపెడుతవి. పైగా మత్స్యాలు, మాంసాహారాలు అనగానే అశుచిత్వం తప్పదు. ఇంటి చాకిరి ఎక్కువౌతుంది. అనుదినం శుభ్రంగా గౌరవప్రదంగా ఉండాలన్నా దుర్గంధం పరిహరించి

ఇంటిని మనోజ్ఞంగా ఉంచాలన్నా ఎంత ప్రయాసపడవలసి వస్తుందో గ్రహించాను."

సహజంగా కలిగే మృగయాసక్తి పెక్కురు యువకులలో ప్రాకృత ప్రదేశాలందూ, ప్రకృతియందు కౌతుకాన్ని కలిగిస్తుందని అతడు గుర్తించాడు. "పుట్టిన తరువాత ఎన్నడూ తుపాకి కాల్చి ఎరుగని బాలునిపై మనం జాలిపడక తప్పదు. మృగయుని కంటె అతనిలో ఎక్కువ కారుణ్యం ఉండదు. అతని విద్యాశిక్షణ కూడ శోచనీయంగా ఉపేక్షితమై పోతుంది....విచార రహితమైన బాల్యదశను దాటిన మానవుడెవడూ కావలెనని తనకువలె జీవనాధికారమున్న జీవినిచంపడు. ....మిక్కిలి తరచుగా యువకునకు అరణ్యంతో ఇట్టి పరిచయమే ఏర్పడుతుంది. ఆదిమ మానవుల నుంచి సంక్రమిస్తూ వచ్చిన యీ మృగయాసక్తి వల్లనే అతడు మొదట వేటకాడుగా జాలరిగా ఉంటాడు. ఉత్తమ జీవిత సంస్కారం అతనిలో ఉంటే కవివలె లేదా ప్రకృతి శాస్త్రజ్ఞునివలె అతడు తన లక్ష్యాలను గుర్తించి తుదకు తుపాకిని, గాలాన్నీ విడిచి పెడతాడు. మానవులలో అత్యధిక సంఖ్యాకులు ఇప్పటికీ ఎప్పటికీ పిల్లలే. కొన్ని దేశాలలో ధర్మోపదేశకుడు వేటకు బయలుదేరటం అరుదుకాదు. అలాంటివాడు ఘాతిక రక్షకుడు కావచ్చును కాని ఆత్మోద్ధారకుడు కాజాలడు."

అయినా ప్రకృతి విషయక గంభీరానుభవం అతనికి వేట వలన ముఖ్యంగా చేపలు పట్టడంవలన కలిగింది. ఆ సందర్భాలే వాల్డన్‌లోని నిశాసమయ మత్స్యగ్రహణ వర్ణనలవంటి ఉత్తమ రచనలకు కొన్నింటికి కారణమైనది. "కొన్ని సందర్భాలలో గ్రామీణ సంలాపశాలలో తత్కుటుంబమంతా నిద్రమించే దాకా నిలిచి తరువాత అడవులకు తిరిగివచ్చాను. కొంతవరకు మరు

నాటి భోజనంకోసం నడిరేయి ప్రొద్దులు మత్స్యగ్రహణ క్రియతో పడవపై గడిపాను. అప్పుడు నిండు వెన్నెల. గూడ్లగూబలు, నక్కలు అరుస్తున్నవి. అప్పుడప్పుడు ఏదో ఎరుగని పులుగుకూత దాపుననుంచి వినవచ్చేది. ఒడ్డునుంచి ముప్పై నలభై గాలాల దూరాన నాలుగడుగుల నీళ్ళలో చిన్న చిన్న మంచినీటిచేపలు మున్నైనవి ఆ వెన్నెల వెలుగునందు తమ తోకలతో ఉపరిభాగాన చిటిపొటి తరంగాలు లేపేవి..........."

ఈ విధంగా వేసంగి అడవులలో తొరో సుఖతర జీవనం సాగించాడు. ఒకసారి తన దినచర్యలో వ్రాశాడు: "ఇది మధుర సాయంకాలం. శరీరమంతా ఒక ఇంద్రియమై ప్రతి రంధ్రంతోనూ ఆనందాన్ని అనుభవిస్తున్నది. ప్రకృతిలో అంతర్భాగమైన నేను విచిత్ర స్వాతంత్ర్యంతో గమనాగమనాలు సాగిస్తున్నాను." తారాడుతున్న న్యూ ఇంగ్లండు హేమంతంలో పగటిపొద్దులు కురుచలై ఉండగా నిరాడంబరైకాంతిక జీవనం అతనికి అలాగే సుఖంగా ఉన్నది. ప్రశాంత హేమంత దివసాలలో సరోవర నిశ్చల సౌందర్యాన్ని విస్మితుడై విలోకించాడు. చక్రాలు కొట్టే వాటర్ బాక్స్, గంతులుపెట్టే వాటర్ స్కేటరు, మునుకలువేసే శ్వాలో పక్షులు, మిడిసిపాటుతో దూకే చేపలు, వీటివల్ల నీటిలో బయలుదేరే చిరు తరంగాలు అవలోకిస్తూ ఆ సుఖమయ ఘటికలు గడిపాడు. సమీపమందలి మడుగుల తీరాన అక్షోటాలకోసం బయలుదేరి వెళ్ళినప్పుడు న్యూ ఇంగ్లండు శీతఋతువులో గూడా తన కుటీర జీవనానుభూతిని కొనసాగించే రోజుకోసం ఎదురు చూచాడు. చీకటిపడ్డ వెనుక సంచారార్థం బయలుదేరటం ఆ ఆరణ్యక గాఢాంధకారంలో దారి తెలుసుకొని ఇల్లుచేరటం అతనికి ఇష్టం. రేయినివలె శీత ఋతువును గూడ అతడు ప్రేమించాడు.

చలి వాన చీకటి ముప్పిరగొన్న కాలాలలో గూడా ప్రసన్న కాలాలలో వలెనే సంచారానికి బయలుదేరే వాడు. చలికాలం పాదం మోపగానే అనుదినం అతడు ఆ సరోవర ఉష్ణోగ్రతను కొలిచేవాడు. లోతు నీటిని శీతల పరచటానికి ఉత్తరపు గాడ్పులకు ఎంతకాలం పట్టేదో గుర్తించి వ్రాసుకొనేవాడు. విభిన్న ఋతువులలో విభిన్న భంగులైన హిమముల విచిత్ర విభిన్న రచనా సౌందర్యాలను అతడు పరిశీలించాడు. రైలురోడ్ల ఇనస్పెక్టర్లు, స్కూళ్ళ ఇనస్పెక్టర్లు, ఈ ఇనస్పెక్టర్లు, ఆ ఇనస్పెక్టర్లు అని ఉద్యోగుల సంఖ్య పెరిగిపోతున్న సమాజంలో తాను మంచుతుపాన్ల ఇనస్పెక్టరునని చెప్పుకొన్నాడు. స్కేటింగ్ చక్కగా చేసేవాడు. తరచు ఒంటరిగా, కొన్ని సమయాలలో ఎమర్సన్‌తోను ఇతర మిత్రులతోను కలసి ఆ క్రీడ సాగించేవాడు. అంగుళం మందాన పేరుకొన్న మంచుపై పండుకొని గ్లాసు క్రింది బొమ్మనువలె మడుగుటడుగును పరిశీలించేవాడు. ప్రతి రేయి వాని వివరాలతోను, వర్ణనలతోను, తేల్చిన సారాంశాలతోను, ఆలోచనలతోను తన దినచర్యా గ్రంథం నింపాడు.

చలికాలం బలిసిన కొలది అతని ఏకాంతత అధికమయింది. "మంచు విపరీతంగా పేరుకొని ఉండగా ఒక్కొక్కప్పుడు వారం పదిహేను రోజులదాకా ఆ ఇంటి ప్రాంతాలకు ఏ సంచారి సాహసించి వచ్చేవాడు కాడు. నేను మాత్రం వెచ్చగా హాయిగా ఉండేవాడను. పెద్ది పెట్టున కురిసే మంచు వినటానికి ఎంతో మనోజ్ఞంగా ఉండేది. ఏ గాలి నా సంచారాలను నిరోధించలేదు. ఎందుకంటే మిక్కిలి లోతైన మంచులోపడి నేను తరచుగా ఏ బీచ్ చెట్టునో, శ్వేతభూర్జాన్నో, దేవదారువులలోని ఏ పరిచిత తరువునో సందర్శించడానికి ఎనిమిది పదిమైళ్లు వెళ్ళేవాడను." పొడి

మంచు ప్రోగులను క్రుమ్మరించే అతి శీతల వాయువులను అతడు ప్రేమించాడు. మంచు ఒక చెంపకొడితే అతడు రెండవ చెంపను అందించేవాడు. ఉలూకధ్వనులు, మంచుపైన నడచివచ్చి తన కిటికీచెంత చేరిన నక్కల ఊలలూ వినేవాడు. వాయుగండంతో దుస్స్వప్నాలతో బాధపడుతూ అశాంతమై ప్రక్కలో పొల్లిగింతలు పెడుతూ మూలుగుతున్నదేమో అన్నట్లుగా హ్రదాంతర హిమం కావించే వివలన ధ్వనులను ఆలకించేవాడు. తన ముంగిట పగలు ఎర్ర ఉడుతలకు, పాలపిట్టలకు, టిట్సుకు తిండి పెట్టేవాడు. స్వీట్ కారన్, రొట్టె ముక్కలు చల్లి రేయి సీమ కుందేళ్ళకు ఆహారం కల్పించేవాడు. అతని కుటీరం క్రిందనే కుందేళ్లు కాపురం చేస్తూ ప్రొద్దు గ్రుంకగానే బంగాళ దుంపల తోళ్ళకోసం వచ్చేవి. ఈ శీత ర్తు జీవుల దార్ఢ్యమూ, పటుత్వమూ అతనిని ఆకర్షించాయి. ఆ ప్రదేశంలో ఉండే జీవులలో అవి యోగ్యతమాలని వాని మనికి రుజువుచేసింది. ఒకనాటి మధాహ్నం రెండు గంటలు ఆ ప్రాంతంలో ప్రపంచపుటిరుసుకందెన లేమిచే కాబోలు నన్నట్లు కిర్రు మనకపోతే అతడు గుడ్లగూబలు, కప్పలు, వుడ్‌చెస్సు నడుమ స్థిరనివాస మేర్పరుచుకొనే వాడే. జీవితం మరొక రీతిగా కనిపించింది. ఏదో కొంత స్తబ్దత ఏర్పడినట్లు తోచింది. దానితో తన కున్న కొలది వస్తువులను పట్టుకొని అతడు కుటీరం వదలి ఇంటికి చేరాడు. ఆ తరువాత మరెన్నడూ ఆ కుటీరంలో నివసించలేదు.

---



# అధ్యాయము 5

"సామాన్యార్థంలో నేను ఇతర జంతువులను జ్ఞానశూన్య పశువులనుగా పరిగణించను. నిస్సంశయంగా వాని సంసర్గం నా కిష్టం. ఎందుకంటే అవి అర్థశూన్యాలాపాలు సాగించవు."

—తొరో దినచర్య.

1847 సెప్టెంబరు 6న తొరో వాల్డన్ శిబిరాన్ని పరిత్యజించాడు. అతని జీవితంలో అది ఒక దశ మాత్రమే. దాని సారమంతా అతడు గ్రహించాడు. పశ్చాత్తాప విరహితంగా ఇప్పుడు నూతనానుభూతి సంపాదనకై బయలుదేరాడు. జీవితమంటే అతని దృష్టిలో సమాజంలో క్రిందిమెట్టు నుంచి పైమెట్టుకు పోవటమూ కాదు; సంపదలు చేకూర్చుకొనడమూ కాదు. జీవితమంటే నిత్యాన్వేషణ, నిత్యపరిశోధన. ఆంతరిక ఆకాంక్షావాప్తిలో అతని మతం ప్రకారం నిశ్చిత ప్రగతి ఏర్పడాలి. ఇలాంటి విధానంలో అదృగ్గోచరావధిని అధిగమించటానికి మానవుడు కొన్ని వస్తువులను విడనాడి తనలో "నూతన విశ్వజనీనోదార సూత్రాలు పెం

పొందించుకోవాలి. వాల్డన్‌లో గాఢానుభవం పొందిన తన వ్యక్తి త్వాన్ని నిరంతరం సారతరం కావించు కొనటమే అభ్యుదయం. తనకై తాను అన్వేషిస్తూ వచ్చిన అర్థం జీవిత పరమార్థ మని ఎమర్సన్ పేర్కొన్న విశేషం అతని కక్కడ లభించింది. తాను పయనించ వలసిన దిక్కు కూడా అతడు తెలుసుకొన్నాడు. రచయితగా తనకున్న సత్తను, ఉపజ్ఞను సాధించాడు. తన శైలిలో భావంలో ఉన్న నిర్జీవ సంప్రదాయాగత విషయాలను చాలవరకు వదల్చుకొన్నాడు. నిసర్గ సన్న్యాసి కాని వానికి రెండు సంవత్సరాల అరణ్యవాసం చాలు. మార్పున కతడు సిద్ధంగా ఉన్నాడు.

ఉపన్యాసాల పర్యటనకై ఎమర్సన్ యూరపు వెళ్లాడు. కుటుంబ వ్యవహారాలు, ఉద్యానపోషణ కొనసాగించటానికి హెన్రీ తోడ్పాటు దుర్బలురాలైన లిడియన్ కృతజ్ఞతతో మరొకసారి స్వీకరిస్తుందన్న వార్త అతనికి దైవిక మనిపించింది. ఎమర్సన్ దంపతుల జీవనపద్ధతి అతని కిష్టం. అతనిని వారి ఇంట మెచ్చుకొనేవారు. తనకున్న వృత్తి నైపుణ్యం అక్కడ పూర్తిగా వినియోగపడుతుంది. అనుకూల సాహచర్యం లభిస్తుంది. అతనికి వేరుగా గది ఉంటుంది. వ్రాత కోతలకు తీరిక దొరుకుతుంది. తన తల్లిదండ్రుల ఇంటి వద్దకంటె అక్కడే ఎక్కువ శాంతి లభిస్తుంది. అవి అలా ఉండగా వాల్డన్‌నుంచి వస్తూ "A Week on the Concord" అన్న గ్రంథం వ్రాతప్రతిని తాను పట్టుకొనివచ్చాడు. దానికి ప్రచురణకర్తను సంపాదించే నిమిత్తం ఎమర్సన్ ప్రయత్నిస్తున్నాడు. ఆ శ్రమకు తగిన ప్రతిఫలం ఇప్పు డతనికి ముట్టజెప్పే అవకాశం లభిస్తున్నది. అందువల్ల తొరో సంతృప్తి పొందాడు.

1847 హేమంతంలో అతడు ఎమర్సన్ దంపతుల ఇంట

నివసించటానికి వెళ్ళాడు. తన కుటీరాన్ని ఎమర్సన్‌కు తోటమాలి, త్రాగుబోతు, ఐరిష్ వ్యక్తి అయిన హ్యూవీలన్ తీసుకొన్నాడు. వీలన్ దానిని మడుగునుంచి చిక్కుడుచేని సమీపానికి చేర్చి పొలంలో కూరగాయ మొక్కలు పెంచాలని సంకల్పించాడు.కాని క్రియమాత్రం జరగలేదు. పూర్వం కుటీరమున్న చోట మొక్కలు విపరీతంగా పెరిగాయి. ఐరిష్ తోటమాలి వెళ్ళిపోయిన తరువాత ఎమర్సన్ కోసం తొరో అక్కడకు వెళ్ళి దేవదారువుల మొక్కలు నాటాడు. ఒక రైతు ఆ కుటీరాన్ని కొని అక్కడనుంచి కదల్చుకొని పోయి పనిముట్ల పాకగా వినియోగించు కొన్నాడు. తన పూర్వ కుటీరమందు అతనికి లేనిపోని మమత రేకెత్తలేదు. క్రొత్త సమాజం నెలకొల్పాలని కానీ, కుటీరవాస మతం స్థాపించాలని కానీ అతడు కోరలేదు.

లిడియన్ ఇంట అతడు తన తొల్లిటి స్థానంలో సంతృప్తుడై కుదురుకొన్నాడు. వారిరువురి స్నేహం గాఢతరమైంది. లిడియన్‌కు అతని సాన్నిధ్యం, హితకర సాహచర్యం అవసరం. హెన్రీకి ఆమె దాపున ఉండటం ఎంతో ఇష్టం. అరణ్యావాసంతో అతనికి ఉత్సాహ ఉద్బోధాలు కలిగాయి. ఆ సంవత్సరం అతని రచన విశేష ఫలప్రదంగా సాగింది. ఎమర్సన్ల ఇంట అతడు వాల్డను గ్రంథంలో ఎక్కువపాలు వ్రాశాడు. అక్కడ ఉన్నప్పుడే 'శాసనోల్లంఘనం' అన్న గ్రంథాన్ని కూడ రచించాడు. ఒక రచయిత రచనల విశిష్టతను ఇతరుల భావాలలో అది కలిగించే మార్పునుబట్టి నిర్ణయించవలసి ఉంటుందంటే, ఈ రెండు రచనలూ అతని ఉత్తమోత్తమ కృతులు.

వాల్డను సరోవర ప్రాంతాన తొరో కుటీరానికి ఎదురుగా ఆవాసం కట్టించాలని ఎమర్సన్ మరికొంత భూమి కొన్నాడు.

కాని ఆ ఉద్దేశం మానుకొని కంకార్డులోని తన స్థలంలోనే వేసంగి భవనం కట్టించుకోవాలనుకొన్నాడు. ఈ భవన నిర్మాణంలో తొరోకు కొంత మేర వినోదం, మెండుగా చిరాకు కలిగాయి. ఈ వేసంగి భవనంయొక్క ఆలేఖ్యం కట్టుబడి పారమార్థికవాది చిర మిత్రుడైన బ్రాన్సన్ ఆల్కాటుకు ఎమర్సన్ అప్పగించాడు. దాని వడ్రంగిపనిలో మాత్రం తొరో అతనికి చేదోడుగా ఉండ టానికి ఒప్పుకొన్నాడు. ఎమర్సన్ కుమారుడు ఆ తరువాత వర్ణించి నట్లు "1847లో ఆల్కాటు దేవదారువుల మెలి కొయ్యలతో, ఓకు కర్ర బుడుపులతో, సీడర్ కర్ర తిన్ననైన ముక్కలతో ఇంటికి కొన్ని వందల అడుగుల దూరాన తన మిత్రుడు చదువుకొనడానికి అహ్లాదకరమైన విడ్డూరపు కట్టడం తయారుచేశాడు. ఈ కట్టడంలో ఆల్కాటుకు తొరో తోడ్పడ్డాడు. నిర్దిష్టమైన ప్రణాళిక లేక వాడు తున్న కర్ర వంకరనుబట్టి పైకిలేస్తూ మళ్ళీ మార్పునకు గురి అవు తున్న ఆ కట్టడంతో తొరో మనస్సు చికాకుపడ్డది. అతడన్నాడు "నేను ఎక్కడా ఉన్నట్లు ఏమీ చేస్తున్నట్లు లేదు........" తొరో మేకులు గట్టిగా కొట్టాడు. కాని ఆల్కాటు అందంకోసం చూరు పైకి త్రిప్పి కప్పుపై మృదుశైవాలం వేస్తూ ఉండగానే ప్రకృతి త్వరలోనే దానిని తనలో చేర్చుకొన్నది. వాస్తవానికి శిల్పి చేతులనుండి క్రొంగ్రొత్తగా ఆవిష్కృతమైనప్పుడే ఆ నివాసానికి శ్రీమతి ఎమర్సన్ 'శిథిలము' అని నిర్వ్యాజంగా పేరు పెట్టింది."

వాస్తు శిల్పి, అతని సహాయకుడు కేవలం విరుద్ధ కోటులని చెప్పవచ్చును. ఆల్కాటు మూర్తీభవించిన పారమార్థికవాది. ఎప్పుడూ అన్యలోక చింతనతో ఉండేవాడు. "ఫ్రూట్ లాండ్స్" అన్న ఉద్యమానికి పూర్వం ఇతర విఫల ప్రయత్నాలు చేశాడు. తొరో ఈ లోకాన్ని అంటి పెట్టుకొని ఉండేవాడు. అతని భావా

లన్నీ నిశ్చితాలు నిర్దిష్టాలు. కుటుంబ కార్యకలాప నిర్వహణం, భూమాపనం, నూతన యంత్రరచన మున్నైనవానిని అతనికి అప్పగించ వచ్చును. ఒక ముక్కలో చెప్పాలంటే ఎమర్సన్ పన్నెండు మాసాలపాటు తన వ్యవహారాలన్నిటినీ నమ్మకంతో అతనికి అప్పగించ గలిగాడు. అయినా మిగిలిన కంకార్డు వాసులకు మాత్రం "అరణ్య దాహకుడే". తల్లిదండ్రులకు తోరో గడ్డు ప్రశ్నగా, కొంతవరకు ఆశాఘాతకుడుగా కనిపించాడు. నొసలు ఎగురవేసే పెద్దమ్మలకూ అత్తలకూ పరిహాస భాజనమయ్యాడు. హెన్రీ ఒక రోజున వేసంగి భవనం కప్పునుండి జారిపడ్డాడు. ఆ పతనం పడటం నేరుగా గడ్డిమేటపై పడటం జరిగింది. "మేఘాల నుంచి జారినప్పుడు కూడా వారందరికి అలాంటి మెత్తలు లభిస్తే బాగుండును" అని పారమార్థికవాద శిల్పులపై మేరియా సూత్రప్రాయంగా ఒక చతురోక్తి విసిరింది.

వాల్డన్‌వద్ద సాగించిన నిర్నిబంధ స్వతంత్ర జీవనంనుంచి అతడు వర్ణించినట్లు "చీపుళ్ళ కడుగులు, పన్నులు, గృహకృత్యాలు కలిగిన ఎమర్సన్ దంపతుల గృహజీవితంలో" వచ్చిపడ్డాడు. ఆడవులతో, పొలాలతో అనుదినం సహవాసం సాగించకపోతే తోరోకు అది పెద్ద మార్పుగా ఉండేది. ఈ సంచారాభ్యాసం అతడు తన అవశిష్ట జీవితమంతా కొనసాగిస్తూ వచ్చాడు. సంవత్సరం అంతటిలోను అతని జీవిత ముఖ్య సంఘటన అపరాహ్ణ విహార యాత్ర. గంటలకొలది అతడు ప్రకృతి పరిశీలన, ఆలోచన కొనసాగించేవాడు. గార్హస్థ్య సంకుచిత జీవితంనుంచి తన మనస్సును చల్లగా తప్పించుకొనటానికి రిచర్డ్ జెఫ్రీ మూడు మైళ్ళ దూరాన ఉన్న ఇష్ట పర్వతం దగ్గరకు వెళ్లినట్లే, తోరో కూడా భవనబాహ్య క్షేత్రాలకు వెళ్ళేవాడు. అలా వెళ్ళినప్పుడే అతనికి మనస్సు మన

స్సులో ఉన్నట్లుండేది. అతడు మొదట త్వర త్వరగా నడిచేవాడు. కొన్ని వేళల రోడ్ల వెంట పోయేవాడు. కాని మిక్కిలి తరచుగా పొలాలకు, చిట్టడవులకు అడ్డంపడి నీడవలె జారి, తోట తోపుల వెంట పోయేవాడు. అతడు అలా పోతున్నప్పుడు ప్రతివారి కనుగప్పి అభీష్టనిర్జన దేశానికి చేరేవాడు.

అతని జీవితానికి, అతని రచనలకు ఈ అపరాహ్ణ బాహ్య దేశ సంచారాలే మూలకందం. అనుదినం దాదాపు ఒకే భాగంలో సంచరిస్తున్నా నూతన దృశ్యాలను, భావాలను కాంచగల శక్తి తోరోకు ఉండేది. అతడు పూనుకొని ఒకనాడు పరిశీలించేటంతవరకు వాకిలి ముందున్న పచ్చిక మైదానం కూడా అతనికి అపరిశోధిత దేశమే. ఒక వారం రోజులలో అదంతా మారిపోవచ్చును. కాబట్టి దానిని తిరిగి పరిశోధించవలసి ఉంటుంది. తరంగభంగి అయిన ఆ దేశంలో ఎక్కడ సంచరిస్తున్నా, ఏ నదీ కుడుంగాలు దర్శించినా, ఏ అనూపభూధరాలు మెట్టినా, శీతర్తు మధ్యమందైనా ఎన్నో అంశాలతో పెక్కు పుటలు నింపుకొని వచ్చేవాడు. వాటిని సాయంకాలం చూచి వ్రాసుకొనేవాడు. తరచుగా మరునాటి ఉదయాన వాటిని వాక్యాలుగా పేరాలుగా విన్యసించేవాడు.

ప్రాతగిలనీయక ఈ అంశాలను అతడు ఏండ్ల తరబడి భద్రపరచి మహాశక్తిమంతాలైన వాక్యాలుగా తీర్చి దిద్దేవాడు. ఇది అతని జీవితం సాధించిన మహత్తర విశేషం. ఇలా వ్రాయటం ప్రకృతి పరిశీలనకంటె ఎంతో విశిష్టం. ఇది ప్రకృతి శాస్త్రజ్ఞులలో చాలమంది యత్నించిన దానికంటె విశాలతరమైన ప్రకృతివిషయక దృష్టిని పొందటానికి చేసిన విస్తృతయత్నం. పెక్కువిధాల అతడు సమగ్ర పారమార్థికవాది. అయినా కంకార్డు

లోని తక్కిన తాత్త్వికుల కంటె అతడెక్కువ స్వతంత్రుడు. అతడు జర్మన్ తాత్త్వికగ్రంథాలు, భారత దార్శనికగ్రంథాలు చదివి మధ్య మధ్య విశ్వాత్మునితో సంవాదం నెరపాలని కాంక్షించినా అతనిలో అమెరికా దేశీయత్వం మెండుగా ఉన్నది. అతడు భక్తిజ్ఞానయోగవైరాగ్యవాదం (Mysticism)లో పూర్తిగా నిమగ్నం కాలేని ప్రకృతిశాస్త్రవేత్త. ప్రకృతిగ్రహణ దృక్పథం నిరంతరం వైయష్టికంగా ఉండేది. పరిశీలనసరళను అతడు స్వయంగా అభ్యసించినా అతనికి దృష్టార్థం ముఖ్యం కాదు. ఆ దృష్టార్థం తన్ను మారుస్తున్న తీరు అతనికి ముఖ్యం. అటు ప్రకృతి, ఇటు మానవుని స్థాయిభావం (Mood) నిరంతరం మారుతున్నవి. కాబట్టి క్షేత్రంలో గడిపిన ప్రతి గడియతోను నూతన ఉపలబ్ధి, నూతన సంతోషం కలిగేవి.

అతనిది భావుకాత్మకదృక్పథమే (Lyrical approach) అయినా అతని భావుకత్వం ఇంద్రియాలకు గోచరించిన అర్థాలను కప్పివేయదు. రాబిన్, బ్లూ బర్డ్, సాంగ్ స్పారో, బోబోలింక్, రష్ స్పారో, కింగ్‌బర్డ్, పైన్ వార్బ్లర్ మున్నగు పక్షుల పాటలతో వసంతం అతని పుటలలో విస్పష్టంగా సాక్షాత్కరిస్తుంది. ప్రషప్ ఓకులపై అతనికున్న ప్రేమతో వాటి బొమ్మ మాటు వడదు. ఈచెట్లు భూమికంటుకొని వ్యాపిస్తాయి. వీని ఆకులు గట్టివై చలికాలంలోగూడ రాలిపోక తోలుడాలులవలె ఒరపిడి ధ్వనులుచేస్తూ, దృఢంగా, ఆరోగ్యవంతంగా, శుభ్రంగా, నున్నగా ఉంటవి. ఈ విశేషాలేవీ సంభవాలు కావు. అతడు వర్ణనాతత్పరుడైన కవి అయినా, చేపలకున్న చారలు (Bars on a pike) లెక్కించడంలోను, తాబేలు కప్పల అలవాట్లు పరిశీలించడంలోను, ప్రాంతీయ ఉద్భిజ్జ పట్టికనుబట్టి ఉద్భిజ్జాలను

గుర్తించడంలోను అతనికి ఆసక్తి ఉన్నది. శాస్త్రకారునకు వస్తువును గుర్తించి పేరు పెట్టటంలో ఉండే కాంక్ష అతనికి పూర్ణంగా ఉన్నది. "ఒకజాతి రెల్లుమొక్కను (Rush) ఇరవై సంవత్సరాల నుంచి చూస్తూనే ఉన్నాను. కాని దాని పేరు తెలియక పోవడం వలన దాని ప్రత్యేక లక్షణాలను కొన్నింటిని వర్ణించలేకపోయాను. పేరు తెలిస్తే ఆ వస్తువుయొక్క అవచ్ఛేధక జ్ఞానం కలుగుతుంది."

ప్రకృతి శాస్త్రవేత్త కాదలుచుకొన్నవారికి ప్రకృతితో సాన్నిహిత్యం ఆవశ్యకమంటూ తోరో ఇలా సలహా ఇచ్చాడు: "కవివైనా, లేదా ప్రకృతి శాస్త్రవేత్తవై నీవు ఒక ప్రత్యేక ప్రదేశం పరిశీలించ దలుచుకొన్నప్పుడు వెళ్ళి అక్కడ నివసించు. అంటే జీవనోపాధి సంపాదించు. అక్కడి వాగులో చేపలు పట్టు. అడవులలో వేటాడు. చిట్టడవులలో చిదుగులేరు. భూమి దున్ను. వన్యఫలాలు సేకరించు." దారిద్ర్యం వల్ల అతనికి కలిగిన ప్రయోజనాలలో ఒకటి ఉన్నది. "నన్ను జన్మస్థానంనుంచి కదలనీక చిరకాలం నిలిపి ఈ ప్రదేశాన్ని అంతంతకూ అధికంగా పరిశీలింపించి నన్ను ప్రేమింప చేసింది." అతడర్థించి కృషిచేసిన సమ్యగ్జ్ఞానం పరిమిత ప్రాంతమందు గాఢశ్రద్ధ వహించినప్పుడు లభిస్తుంది. కవాట ద్వారాల నడుమ ఏమాత్రం ప్రగతి (Progress) సాధించాలన్నా ప్రతిభాశాలి కావాలి. అతడు తన దేశంలో, తన గ్రామంలో సంచరించాలి. మానవు డెక్కడైనా సంపన్నుడూ బలవంతుడూ కావాలంటే ముందతడు వాటిని స్వస్థానంలో సాధించాలి. ప్రయరీ పచ్చిక భూములకుపోయినా, రాకీ పర్వతాలకుపోయినా అందులో అతనికి ప్రయోజనం కనిపించదు. వాటి అవగాసహం అతనికి కొన్ని సంవత్సరాలు పట్టి ఉండేది. కాలిఫోర్నియాలోని మహావృక్షాలకంటె కంకార్డులోని కలుపుమొక్కలు జీవితానికి ఎక్కువ

ప్రాతినిధ్యం వహిస్తున్నవని అతడు భావించాడు. తోరో మతం ప్రకారం జ్ఞానం స్వయంకృషిచే ప్రకృతినుంచి లభించవలసినదే కాని అధ్యయనం వలన, అధ్యాపనం వలన లభించదు. నేర్చినది ఎంత అయినా నిర్దుష్ట స్వయం పరిశీలనప్రాప్త జ్ఞానంతో పాటి గాదు. "ఈ క్షేత్రాలు, నదులు, అరణ్యాలు, ఆ వాసుల నిరాడంబర వృత్తులు కౌతుక ఉద్వేగాలను కలిగించక మానివేస్తే దానివలన కలిగే నష్టాన్ని ఏ సంస్కృతీ, ఏ సంపత్తీ తీర్చజాలదు."

తోరో రచిస్తున్న "ప్రకృతి చరిత్ర" ఒక అసాధారణ కృతి. ఆల్కాటు దానిని "కంకార్డు అట్లాసు" అనీ, దానికి కావలసిన వస్తు పుష్కలత, ప్రతిభ అతనికి ఉన్నవని పేర్కొన్నాడు. ఎందువల్ల నంటే తోరో పుట్టుకచేతనే భౌగోళిక శాస్త్రజ్ఞుడు. చానింగ్ ఇలా వ్రాశాడు:

"తాను పంచాంగం (Calendar) తయారు చేయవచ్చునని కలలు కంటున్నాడు. సంవత్సరం యొక్క సముచిత చిత్రాన్ని చిత్రించవచ్చు ననుకొన్నాడు....ఆ బొమ్మ శీతోష్ణాలను రెండింటినీ సమగ్రంగా చిత్రించింది. నదుల కొలతకు అతనివద్ద యంత్రా లున్నవి. వాటిని అతడు నిరంతరం వాడాడు. వాగుమడుగుల ఉష్ణోగ్రతలను కొలిచి వ్రాసుకొన్నాడు. ప్రతి విచిత్ర ఆకాశ రూపాన్ని చిత్రించాడు. మొక్కలు ఎదిగి మొగ్గలుతొడిగి పూచి కాసేకాలాలనూ, ఆకురాలే తరుణాలనూ, వలసలుపోయే పక్షుల రాకపోకల వేళలనూ, జంతువుల అలవాట్లనూ సేకరించి వ్రాసి పెట్టుకొన్నాడు." స్థానికాలైన ఎల్ల విషయాలను, తన ఇరుగు పొరుగుల జీవిత కార్యకలాపాల అంశాలను, సూచికలను ఉదాహరణాలనూ ప్రోగుచేశాడు. వ్యవసాయం, తత్త్వశాస్త్రం, అలంకార శాస్త్రం, ఒక టేమిటి, సర్వం అతని పరిశీలనలో అంతర్భూతాలై

పోయాయి. ఈ పరిశీలనం కంకార్డు ప్రాంతంలోని జీవితాంశ సమన్వయం కోసమేకాక, ప్రపంచ జీవిత సమన్వయంకోసం ఉద్దిష్టం. తొరోకు పరిమాణం ఎప్పుడూ ముఖ్యంకాదు. ప్రపంచాన్నే న్యూఇంగ్లండు నందలి కొన్ని చదరపు మైళ్ళతో సంగ్రహించవచ్చును. మానవుడు ప్రపంచమంతా తిరిగి వచ్చినా స్వల్ప సంకుచిత భావ ప్రభావాలను అతిక్రమించి పోలేకపోవచ్చును.

రచనా పరిశీలనలే అతని జీవితం. కాలినడక, పడవ ప్రయాణం అతనికి కర్మక్షేత్ర ప్రాపకమార్గాలు. సడ్బరీ నదిపై పడవను నడుపుకొంటూ పోతున్న హెన్రీ కేవలం హొకిల్‌బెర్రీల కోసం పోవటంలేదని ప్రజలు గుర్తించలేదు. "అడవిత్రోవ, పడవ నాకు పరిశీలనాగారాలవీ. ఇక్కడ పవిత్ర ఏకాంతతను పాటిస్తూ నానా గోత్రులను చేరనివ్వజాలనని వారు గ్రహించరు. బెర్రీల కోసం వెళ్ళేటప్పుడు పిల్లలను బడి మానిపించి వారు తమ వెంట కొనిపోరు.... అలాంటప్పుడు నా పాఠశాలనూ, పనిచేసే కాలాన్నీ ఏల గౌరవించరు? కొన్ని డాలర్లు కావాలని అడిగితే అడగండి. కాని అపరాహ్ణకాలం మీతో గడపాలని మాత్రం అడగవద్దు" అని అతడన్నాడు.

సహచరులతో కలిసి ప్రకృతిని పరిశీలించడానికి వీలున్నా దానిని గూర్చి ఆలోచించాలంటే ఏకాంతత అవసరమని అతడు గుర్తించాడు. విప్‌పూర్ విల్స్, తాబేళ్లు, ఇక్నూమోనిడాలు (ichneumonidae), చెట్లుయందుండు కప్పలు వీనియందున్న ఆసక్తి వలన తత్పరిశీలన సమయాలలో ఏకాంతతను అనుభవించవలసి వచ్చింది. అయితే ప్రకృతి సాహచర్యం కోసం మానవుల సాహచర్యం వదలుకోవలసి వచ్చినందులకు విచారపడ్డాడు.

ఉపన్యాసాల పర్యటన ముగించుకొని ఎమర్సన్ ఇంగ్లండు

నుంచి 1848 జులైలో రాగానే తోరో తన కుటుంబంతో కలసి ఉండటానికి వెళ్ళాడు. ఆ కుటుంబం మెయిన్ స్ట్రీట్‌లోని పచ్చని విశాల గృహానికి మారింది. ఇక్కడే అతడు తన జీవితావశేషం గడపవలసి ఉన్నది. ఆ కుటుంబం చేపట్టిన పెన్సిళ్ళ వ్యాపారం ఇంకా సాగుతూనే ఉన్నది. తండ్రికొడుకు లిరువురు తమ సృజనాత్మకశక్తితో ఆ వ్యాపారం పెంపొందించారు. ఈ కాలంలోనే పెన్సిళ్ళ ఉత్పత్తినుంచి విశిష్టమైన గ్రాఫైట్‌పొడి అమ్మకానికి దిగుతున్నారు. ఈ వ్యాపారమే ఎక్కువ లాభకరంగా ఉన్నది. ఆ పొడి కొత్తగా కనిపెట్టబడిన ఎలక్ట్రో-టైపింగ్ విధానంలో వాడబడుతున్నది. ఈ వ్యాపారంతో క్రమంగా కొంత ఆర్థిక స్వాస్థ్యం ఏర్పడింది. అతని జీవితం క్రమబద్ధమార్గం అనుసరింపసాగింది. ఉదయవేళలు గ్రాఫైటు దుకాణంలోనో వ్రాతగదిలోనో ప్రవర్ధమానమైన సర్వేయరు ఉద్యోగంలోనో గడుస్తున్నవి. పది సంవత్సరాలదాక భూమి కొలతలకు పనికివచ్చే ఒక రకపు పరికరాలుండేవి. నెమ్మదిగా స్థానిక కర్షకులు, భూస్వాములు అతనిని కొలతలకు ఎక్కువగా పిలువజొచ్చారు. దానితో ఉద్యోగం పెంపొందుతూ వచ్చింది. ఆ తరువాత అతడు మరీ సునిశిత మానపరికర సామగ్రి సంపాదించాడు. అపరాహ్ణాలందు బహిఃప్రాంతాలలో తరచు ఒంటిగా సంచరించేవాడు. కొన్ని సందర్భాలలో చానింగ్ లేదా ఎమర్సన్ వంటి వ్యక్తులతో అచట ప్రొద్దుపుచ్చేవాడు. లేదా తన కుటుంబంతో గడిపేవాడు. కొన్ని సాయంకాలాలు మిత్రులతో గడచిపోయేవి. అయితే ఎక్కువగా వ్రాతతోనో చదువుతోనో గడచేవి. అతడు హార్వర్డు విశ్వవిద్యాలయ గ్రంథాలయంనుంచి పుస్తకాలు తీసికొంటూనే ఉన్నాడు. అతని అభిరుచులు విస్తరిల్లుతూ వచ్చాయి. తత్త్వశాస్త్రం, మానవజాతులు

మున్నగువానిని గూర్చిన గ్రంథాలు చదువుతూ వచ్చాడు. కడపటి గ్రంథావలోకనానికి కారణం ఉన్నది. రెడ్ ఇండియన్లను గూర్చి పుస్తకం వ్రాయాలని అతని ఉద్దేశం.

ఎన్నటికైనా రచయితను కాగలనా అన్న సందేహం అతనికి కలిగింది. ఎమర్సన్ ఎంత ప్రయత్నించినా "A Week on the Concord" అన్న పుస్తకానికి ప్రచురణకర్తే దొరకలేదు. అతిమితవ్యయనపరుడైన తోరో ఈ నాటికి కొంత డబ్బు నిలువ చేయగలిగాడు. "అయిదేండ్ల నుంచి నా కాయకష్టంతో నన్ను నేను పోషించుకొంటున్నాను." అని అతడు వ్రాశాడు. ఇప్పుడు గూడా హొరేస్ గ్రీలీ ద్వారా కొన్ని వ్యాసాలు అమ్ముకొంటున్నాడు. అందువల్ల ఎమర్సన్‌సలహాపై తన సొంత డబ్బుతో "A Week on the Concord"ను ప్రకటించడానికి ఒప్పుకొన్నాడు. 1849 వసంతంలో ఆ పుస్తకం వెలువడింది. "న్యూయార్క్ ట్రిబ్యూన్" పత్రికకు హొరేస్ గ్రీలీ సంపాదకుడు. అతడు పారమార్థిక వాదాభిమాని. తోరోనుండి ఉత్తమ రచనలు రాగలవని అతని ఆశ. అతని కోరికపై జార్జ్ రిప్లీ తోరోపుస్తకాన్ని 'న్యూయార్క్ ట్రిబ్యూన్'లో సమీక్షించాడు. ఆ పుస్తకంలోని ప్రకృతి వర్ణనలను రిప్లీ ప్రశంసించాడు. కాని అతని జగదీశ్వరవాదం లేదా ప్రకృత్యుపాసన (Pantheism) అతనికి రుచించలేదు! లండను "ఎతినీయమ్"లో వెలువడిన సమీక్ష ఆ పుస్తకాన్ని తెగనాడింది. ఆనాటి అమెరికన్ ప్రముఖ విమర్శకుడైన జేమ్స్ రస్సెల్ లోయల్ "మెసచూసెట్స్ క్వార్టర్లీ రెవ్యూ" అన్న పత్రికయందు హాస్యజనక ప్రశంసకావిస్తూ పుస్తకమందలి మాధుర్యాన్ని, ఉపజ్ఞను, హాస్యాన్ని గుర్తించాడు. అయినా "A Week on the Concord" ప్రజలను అంతగా ఆకర్షించలేదు. ముద్రింపబడిన

వేయి ప్రతులలో 706 ప్రతులు నాలుగు సంవత్సరాల తరువాత రచయితకే విక్రేత తిరిగి పంపించాడు. అవి రచయిత గ్రంథాలయంలో చేరాయి. దీనిని పురస్కరించుకొని అతడు ఒకసారి ఒక ఛలోక్తి విసిరాడు: "నా గ్రంథాలయంలో దాదాపు 900 సంపుటాలున్నవి. అందులో 700కు పైగా నేను వ్రాసినవే."

---

# అధ్యాయము 6

"సమాజంలో.... దేవదారువుల వాసన వంటి ఆరోగ్యప్రదమైన వాసనలేదు. ఉన్నతశ్వాదాల భూములందు గోచరించే పునరుజ్జీవక సుగంధం వంటి సుగంధమూ లేదు."

—తోరో: మెసచూసెట్స్ ప్రకృతి చరిత్ర.

తోరో మొదటి పుస్తకం అమ్ముడుపోక పోవడం వింత కాదు. "కంకార్డు మెర్రీమాక్ నదులపై ఒక వారం" అన్న పేరు వినగానే యాత్రావర్ణన, సాహసకృత్య కథనం ఉండవచ్చునని పాఠకుడు అపోహపడతాడు. శీర్షికలో పేర్కొన్న వారం వాస్తవానికి వారం కాదు. పెక్కు ఏండ్లలో అప్పుడప్పుడు సాగించిన రచనకు, ఆలోచనకు అది సంగ్రహరూపం. కంకార్డు, మెర్రీమాక్ నదులు తరచుగా రచయిత యొక్క తాత్త్వికవిచార ప్రవాహానికీ స్థానిక చరిత్ర కథనానికీ నిమిత్త మాత్రాలు. మార్గరెట్ ఫుల్లర్ ఇల్లినాయ్, విస్కాన్సిన్‌లలో పయనించి అంతకు

ముందే కొన్ని సంవత్సరాల క్రిందట "సమ్మర్ ఆన్ ది లేక్స్" అన్న పుస్తకం వ్రాసింది. ప్రయాణకథను ఆధారం చేసుకొని కలగాపులగపు ఆలోచనలు, పద్యాలు ఆమె కూర్చింది. అతని విహారవర్ణక గ్రంథానికి ఆమె రచన ఒరవడి అయి తోడ్పడి ఉంట వలసింది. కాని అతడు ఇలా వ్రాశాడు:– "ఉత్తమ గ్రంథాలంటే భయసంకుచితాస్వాదం కలిగించేవి కావు. ఏ రచనయందు ప్రతి భావం అసామాన్య సాహసోపేతమై అలసునకు అగ్రాహ్యమై భీరువునకు అనాస్వాద్యమై వ్యవస్థిత సంస్థలకు మనలను అపాయ కారులను చేస్తుందో దానిని నేను ఉత్తమ గ్రంథమంటాను."

నది ప్రతి మలుపులోను తోరో ప్రక్కత్రోవలు పడుతాడు. అనుకొన్నట్లుగా ఏ కూగర్‌నో (Cougar) (ఒకజాతి పులి), ఏ వుల్వరైన్‌నో (Wolverine), ఏ ఏదుపందినో అనుసరించనీక మనలను కవిత్వంవైపో, యోగంవైపో, చరిత్ర సిద్ధాంతంవైపో కొనిపోతాడు. లోవెల్ పేర్కొన్నట్లు "ప్రవాహానికి అనులోమం గానో విలోమంగానో పయనిస్తున్న సమయాలలో ఈ ఉత్క్రమాలు స్వస్థానంనుంచి క్రింద పడేటంత సంక్షోభం కలిగిస్తవి. ఒక్కొక్కప్పుడు ఎండ్రికోసం తెడ్డు వదలి వెళ్లిపోయాడేమో నన్నట్లుగా అతడు ఈ ఉత్క్రమాలలో బాధాకరంగా విలీను డవుతాడు." అదృష్టవశాన తిరిగి నిపుణతతో తేరుకొని అతడు స్వోపజ్ఞాలైన విషయాలు ప్రారంభిస్తాడు. తన ప్రాంతీయ నదుల ప్రకృతి చరిత్రను, ధ్వనులను, సుగంధాలను, పడవ ప్రయాణాలు సాగిస్తున్నప్పుడు కనిపించే మనోహర దృశ్యాలను వర్ణిస్తుంటే మనము తొల్లిటి ఉత్క్రమక్లేశాన్ని మరచిపోయి మన నదీ ప్రయాణాన్ని తిరిగి సాగిస్తాము.

తాత్కాలికంగా రాత్రివిడిదికై దిగి పడవలోని మన

బండారం శిబిరానికి మార్చి నెగడు వెలిగించి భోజనంచేసి మనం రచయిత గుడారంలోని దీపంచెంత కూర్చుండి అతడు భౌగోళిక కోశం చదువుతుంటే మనం ఏ అక్షాంశతులాంశాలవద్ద ఉన్నామో, నదీతీరాన మన శిభిరం ఎక్కడ ఉన్నదో, విశ్వంలో మనం ఎక్కడ ఉన్నామో వింటూ ఉంటాము. లేదా సంజచీకటిలో తుందుడుకు ప్రయాణంచేస్తున్న కాలిందికం కోసం నదీప్రవాహం వెంట పడవను నడుపుకొని పోతాము. మన పెద్ద కాలిందికాలలో ఒక దానిని ముఖద్వారం వద్దనున్న ఆల్డర్ వృక్షాల నడుమ నిశ్చలజలంలో చల్లబడే నిమిత్తం వదలిపెడతాము. కాని గుడారం తయారు చేసుకొని దానికోసం వెళ్ళేటప్పటికి అది ప్రవాహంలో కొట్టుకొని పోయి ఎక్కడా కనిపించదు. ఆ గ్రుడ్డి వెలుగులో మన ఆసక్తి కొలదీ పడవపై బయలుదేరుతాము. సుదీర్ఘకాలం మన కన్నులను బాధించి దూరాన నది దిగువలో దాని పచ్చని అంచును ఎలాగో చూస్తాము. ఆ సాయంకాలం కొండలనుంచి జారివచ్చిన ఆకు రెమ్మల మధ్య అది చక్కగా కుదురుకొని ఎటూ ఒరగదు. చల్లారడంకోసం తొలగించిన కొప్పునుంచి నీరు పోసుకొనక అది సముద్రాభిముఖంగా తేలిపోతూ కనిపిస్తుంది.

"A Week on the Concord" అన్న గ్రంథరచన ఏండ్ల తరబడి సాగింది. వాస్తవంగా ఆ నదీ ప్రయాణం 1839 నాటిది. వాల్డన్‌వద్ద నుండగా 1846లో దినచర్య గ్రంథాలనుండి అతడు కొంచం కొంచం చొప్పున ఆ పుస్తకంలో అధిక భాగం వ్రాశాడు. 1849లో వెలువడేటంతవరకూ అది చేర్పులకు మార్పులకు గురి అవుతూ వచ్చింది. ఈ విధంగా అది రచయిత యొక్క పది సంవత్సరాల మానసిక స్థితిని చాటుతున్నది. అందలి ఉత్సాహం వాల్డన్ జీవితంలోని ఏకాంతవిశ్రాంతియందు గడించిన ఆత్మ

విశ్వాసాన్ని, ఆశాభావాన్ని ప్రదర్శిస్తున్నది. అక్కడ అతడు తన్ను తాను తెలుసుకొన్నాడు. అతనికి ఆత్మవిశ్వాసం నెల కొన్నది. మానవ సంస్థలతో పొందిక లేకపోయినా తన స్వభావం జీవిత యథార్థ గంభీరావస్థానుగుణంగానే ఉన్నదని అతడు సంతృప్తిపొందాడు. ప్రశాంత జీవిత తరంగాలు దుర్దినాస క్షేత్రా లపై మెరిసే సూర్యకిరణాలవలె అతనిపై ప్రవహించాయి. ఈ పుస్తక రచనకు వలసిన తీరికకై అతడు రెండవ వసంతంలో తక్కువ చిక్కుళ్ళు నాటాడు. కాని, చిత్తశుద్ధితో సత్యం, నిరాడంబ రత, భక్తి, అమాయికత అన్న ఫలాలను విశేషంగా పొందాడు. సాహిత్య రచనాతుంగ శృంగం సమీపిస్తూ వచ్చాడు. స్వతంత్ర జీవన పద్ధతిలో అతడు నెలకొన్నాడు. పదాలు ధారావాహికంగా పుటలపై పరిగిడుతున్నప్పుడు తన రచయితృజీవితాన్ని మరె న్నడూ కననంత విస్పష్టంగా అవలోకించాడు. "A Week on the Concord" అన్న పుస్తకం సంతృప్తుని రచన. అది ఆంతరంగిక బలశాంతిసుహృద్భావాల యథార్థస్థితిని ప్రతిబింబిస్తున్నది. అది ప్రపంచ సౌందర్య సమ్మగ్ధుడైన మానవుని కృతి. తాను ప్రేమిం చిన తన ప్రాంతీయనదిని వర్ణిస్తున్నప్పుడు గోచరించే అతని వర్ణనాశక్తి మరెచ్చటా అంత ఉదాత్తంగా గోచరించదు. అత డక్కడ వర్ణించాడు: "క్రమంగా ఊరు సందడి మాటుమణిగింది. మా స్వప్నప్రశాంత ప్రవాహంపై గతంనుంచి బయలుదేరి భవి ష్యానికి తేలిపోతున్నట్లు ఏటి జాలుసబడి నిశ్శబ్దంగా జారిపో తున్నాము. అట్లు పయనిస్తుండగా అప్పుడప్పుడు మంచినీటి చేపలు తామరాకుల నెలవులనుంచి పారిపోతున్నవి. పచ్చభూముల నివసించే బిట్టరన్ అన్న పులుగు (కలికారం?) తీరమందలి ఏ ఆ వాసంనుంచో బయలుదేరి మెల్లగా రెక్కలు ఆర్చుకొంటూ వెళ్ళి

పోయింది. మేము సమీపించగానే పెద్దపులుగు గడ్డిలోనుంచి లేచి తన అమూల్యచరణాలను సురక్షితస్థానం చేర్చటానికన్నట్లు వెళ్ళి పోయింది. చెట్ల ప్రతిబింబాలను చెరుపుకొంటూ విల్లో చెట్లనడుమ ఉపరితల ప్రశాంతతను భగ్నపరుస్తూ పయనిస్తున్న మా పడవ సమీపించగానే తాబేళ్ళు త్వరితంగా నీళ్ళలో దుమికాయి. తీరాలు అంతకుమున్నే తమ సౌందర్యోచ్చస్థితిని అతిక్రమించాయి. స్నిగ్ధ తర వర్ణాలైన కొన్ని పుష్పాలు ఈ షడ్వివర్ణాలై ఋతువు వాటారు తున్నట్లు సూచించాయి....కాని నదీకుసుమాలరాణి అయిన తెల్ల దామర మాకు కనిపించలేదు. దాని పరిపాలన ఆ ఋతువున సమా ప్తమై ఉంటుంది....ఈ ఉపజాతులు పెక్కులు మన కంకార్డు నదీ జలంలో ఉన్నవి. గ్రీష్మప్రభాత కాలంలో సూర్యోదయానికి ముందు ఇంకా నిద్రాముద్రితాలై ఉన్న పద్మ సందోహాల నడుమ నదిపై వాలునవెళ్ళాను. తుదకు ప్రొద్దు వెలుగుల బొత్తికలు ఒడ్డు పైనుంచి నీళ్ళపై బడినప్పుడు ధవళ పుష్పక్షేత్రమంతా వివృత కేతనం వలె ఆకస్మికంగా విరిసిపోతున్నట్లు కనిపించింది. సూర్య కిరణ ప్రభావంతో ఈ పూవులంత వివశత్వ మందేవి."

అయినా పుస్తకమందలి ఈ ప్రశాంతత కాదాచిత్కంగా భగ్నమై న్యూనసహనమై వాల్డన్‌లోని పెక్కుభాగాలను సూచించే నిశితశైలిని సూచిస్తుంది. వాల్డన్‌లోని ప్రధానాంశం నైసర్గిక త్వాకాంక్ష. తోరోకున్న వ్యక్తిత్వాధికారాలను, స్వతంత్ర భావనాధి కారాన్ని సంప్రదాయాగత మతంకాని, ధర్మశాస్త్రంకాని నులిమి వేయజాలదు. యూదుల దైవంనుంచి మరలి అతడు పాన్ దైవా రాధన కుపక్రమించాడు. వాల్డన్ అడవులలో ఆ దైవం పూర్వ ప్రభావంతో ఆరోగ్యాన్ని చాటే ఎర్రని ముఖంతో నిడుదగడ్డంతో కర్కశ శరీరంతో ముఖవీణతో కొంకికర్రతో ఇంకా ఏలుతున్నట్లే

అతనికి కనిపించింది. పాన్ ఆరాధనకు తొరో భారత తత్త్వశాస్త్ర గత నిజగౌరవాన్ని జోడించాడు. పాశ్చాత్య విచారధారకు అందని విస్తృతి గాంభీర్యాలు ఆ శాస్త్రానికి ఉన్నవని అతని తలంపు. "విశాలమైన చరాచర ప్రపంచాన్ని వివరించే భగవద్గీతాప్రోక్త తత్త్వంముందు షేక్స్పియర్ ఒక్కొక్కప్పుడు ముక్కుపచ్చలారని శిశువుగా, కేవల వ్యావహారికుడుగా కనిపిస్తాడు." వృద్ధాచారాలు, ప్రామాణ్యం, సంప్రదాయం వీని నిరాకరణంలో తోరో ఎమర్సన్‌ను అనుకరించాడు. ఎమర్సన్ చర్చిని వదిలివేశాడు. ఎందువల్లనంటే చర్చి "మన పూర్వులాశ్రయించిన నిర్జీవరూపాలను పూజించింది." మరొక కారణం కూడ ఉన్నది. చిరంతనత్వంతో ముదిసి దుర్బలమైన క్రైస్తవమతంకంటె సోక్రటీస్ బోధించిన పాగన్‌మతం (Paganism) మేలని అతడు భావించాడు. తోరో ఇలా వ్రాశాడు: "మిడిల్‌సెక్స్ మతాధికారిని ఆదివారం నాడు తన మతవేదికనుంచి మాటాడటానికి అనుమతి కోరితే అతడు నిరాకరిస్తాడు. కారణమేమిటి? అతడు ప్రార్థించిన తీరున నేను ప్రార్థించను; మతోపదేశనార్హతను ప్రసాదించే దీక్షను నేను పొందలేదు. ఇలాంటి ఈ ప్రార్థనాదీక్షాదికానికి అర్థమేమిటి?"

ఇలాంటి ఉజ్జ్వల విప్లవోత్సాహంతో 1848లో ఎమర్సన్ దంపతుల ఇంటిగదిలో ఉంటూ తోరో తన విఖ్యాత "శాసనోల్లంఘన" గ్రంథ ప్రథమపాఠాన్ని రచించాడు. ఈ వ్యాసమే తరువాత మహాత్మాగాంధీకి ఉద్బోధకమైంది. ఇండియాలో నేమి, ఇతర దేశాలలోనేమి బయలుదేరిన శాంతియుత ప్రతిఘటనోద్యమాలకు ఈ వ్యాసమే మూలమని చెప్పవచ్చును. "ప్రభుత్వంపట్ల వ్యక్తికున్న బాధ్యతలు, అధికారాలు" అన్న ఉపన్యాసరూపంలో మొదట ఈ వ్యాసం బయలుదేరింది. దీనిని అతడు కంకార్డు పరిషత్తులో

ఉపన్యసించాడు. "నవ్యతకు" నిత్యసఖియైన ఎలిజబత్ పీబాడి 1849 మేలో "ఆలంకారిక వ్యాసములు" అన్న పేరుతో ప్రచురించిన పారమార్థికవాదుల రచనా సముచ్చయంలో దీనిని చేర్చి బాస్టన్ నుంచి వెలువరించింది. ఈ వ్యాసం సర్వత్ర "శాసనోల్లంఘన" మన్న పేరుతో ఉటంకింపబడు తుంటుంది. బలాన్ని తదితర శక్తితో ప్రతిఘటించాలని భావించే వారంతా దీనిని మెండుగా స్మరిస్తుం టారు. ఇందలి వాక్యాలు ఉదాహరిస్తుంటారు.

వేసవికాలంలో ఒకనాటి సాయంకాలం రంకార్డుకు వెళ్ళి తన పాదరక్షలను బాగుచేయించుకొని తిరిగి వాల్డన్ మడుగుకు బయలుదేరబోతుండగా తలపన్ను కట్టనందుకు అధికారులు తన్ను గ్రామీణ కారాగారంలో ఎలా నిర్బంధించారో థోరో వాల్డన్‌లో అభివర్ణించాడు. ఆ రేయి అతడా కొట్లో గడిపాడు. మరునాటి ఉదయపు భోజనం ముగిసిన వెనుక అతనిని వదలిపెట్టారు. ఎవరో బహుశః అతని కుటుంబంలోని వారు అతడు చెల్లించవలసిన పన్నును చెల్లించి ఉంటారు. ఇది అతనికి చిరాకు కలిగించింది. స్వల్ప సంఘటనకు మూలభూతాలైన అర్థాలను తదంతర్గత సూత్రాలను గ్రహించి నిర్వచించే ప్రతిభ, స్వభావం అతనికున్నవి. వాల్డన్‌వద్ద ఏకాంతవాసం చేశాడు కాబట్టి తనకు సమాజంతో ఉన్న సంబంధాన్ని అతడు సాకల్యంగా పరిశీలించటం జరిగింది. అయితే భౌతికంగా సమాజం తన పంజాతో రక్కే-టంత వరకూ, చెరసాలలో వాస్తవ స్థితిగతులను గ్రహించేటంత వరకూ వ్యక్తులపై ప్రభుత్వాలకున్న అపార అధికారాన్ని అతడు గుర్తించలేక పోయాడు. తుది కతడు తన అభిప్రాయాలను నిర్దిష్టంగా తేల్చుకొని వ్యవస్థీకరించుకొనవలసి వచ్చినది.

రోడ్ల నిర్మాణం, విద్యాబోధనం మున్నగు సామాజిక కార్య

నిర్వహణకొరకు విధించిన పన్నులు చెల్లింపవచ్చును. అందతనికి అభ్యంతరం లేదు. కాని వ్యక్తులను అణచి సామ్రాజ్య విస్తృతిని కాంక్షించి తత్సిద్ధికై ప్రభుత్వం తలపన్ను విధిస్తున్నదని ఆ పన్ను పట్ల అతడూ, ఉదార భావులైన ఇతరులూ విద్వేషం వహించారు. బానిస తనం దక్షిణ రాష్ట్రాలలోనే ఉన్నా, మెసచూసెట్సులోను ఉత్తర రాష్ట్రాలలోను కాందిశీకపు బానిసల చట్టం అమలలో ఉన్నది. తప్పించుకుని పారిపోయి వచ్చిన బానిసలకు ఆశ్రయం ఇచ్చినా, కెనడా పారిపోవడానికి తోడ్పడినా, ఈ చట్టం శిక్ష విధిస్తున్నది. పట్టువడిన బానిసలను దక్షిణ రాష్ట్రాలలోని యజమానుల కప్పగించాలని శాసిస్తున్నది. దాస్యనిషేధనోద్యమం ఉత్తర రాష్ట్రాలలో త్వరితంగా ప్రబల సాగింది. అనేక గృహాలలో నా నా విధ సంస్కరణలను గూర్చి తీవ్రచర్చలు సాగుతున్నవి. అలాంటి వానిలో తోరో దంపతుల గృహం ఒకటి. తలపన్ను చెల్లించనని పట్టుపట్టి 1843లో ఆల్కాటు చెరసాలకు పోయాడు. అతని శాసనధిక్కారం తోరోనూ, అనేకులను ప్రోత్సహించింది. బానిసతనాన్ని ద్వేషిస్తూ ఈ తిరుగుబాటు దారులు మెక్సికోపై యుద్ధం ప్రకటించిన అమెరికన్ ప్రభుత్వ సామ్రాజ్య కాంక్షను గూడా గర్హించారు. శాసనోల్లంఘనమన్న గ్రంథంలో తోరో అన్యాయ ప్రభుత్వంతో స్పర్ధకు పాల్పడిన వ్యక్తుల అంతరాత్మను సమర్థిస్తూ బానిసతసంపట్ల, సైన్యాలపట్ల, యుద్ధంపట్ల, ప్రభుత్వం పట్ల, రాజకీయాలపట్ల, శాసనసభా సభ్యులపట్ల బహుముఖ ప్రాతికూల్యం ప్రకటించాడు. అసలు ఇది వరకున్న ఏ ప్రభుత్వమైనా అన్యాయవంతగానే ఉన్నదని అతడు శంకించాడు.

అతడిలా వ్రాశాడు: "చట్టమందు అనుచిత గౌరవం ఏర్పడినప్పుడు సామాన్యంగా ఒకటే పర్యవసానం కలుగుతుంది.

సైనికులు, కర్నలు, కెప్టెను, కార్పొరలు, ప్రైవేటు, ఓడ మీద తుపాకి మందు చేరవేసే పిల్లలు, ఒకరేమిటి, అందరూ కూరులు దీరి ప్రసంసాపాత్రమైన క్రమంలో తమ సంకల్ప జ్ఞానాలను, అంతరాత్మలను ఉల్లంఘించి యుద్ధాలకు బయలుదేరుతారు.... వారెవరు? మానవులా? లేక నీతినియమ శూన్యుడైన అధికారి సేవకై తరలే కోటలా? మందు గనులా? ముందే క్షణాన ప్రభుత్వానికీ నీ అంతరాత్మకూ సంఘర్షణ ఏర్పడుతుందో నీకెన్నడూ తెలియదు. నిన్ను ముందుకు తరలిపోవడానికి పురికొల్పుతూ అతడిలా ఉపదేశించాడు:—"నీలో నీవు జీవించాలి. నీపై నీవు ఆధారపడాలి. బయలుదేరడానికి నడుము బిగించి సర్వదాసిద్ధమై ఉండాలి." కోమలాంకురం మానవాంగుళుల కోర్వక ముడిగి పోతున్నట్లు తోరో అన్యాయపు చట్టాల కోర్వక సంచరించేవాడు. నిర్బద్ధతా వ్యాప్తికై నేను జన్మించలేదు. నా నైజం చొప్పున నేను బ్రతుకుతాను. స్వభావానుగుణంగా బ్రతకడానికి వీలులేనప్పుడు ఉద్భిజ్జం నశిస్తుంది. మానవుడుకూడా అంతే." శాసనోల్లంఘన మన్న వ్యాససారమంతా ఈ మాటలలోనే ఉన్నది. వాదనలో తోరో ఇక్కడే పరాకోటి కందుకొన్నాడు. అతడు ఉపదేశించడు. పటాటోపం నెరపడు. తృణప్రాయులైన మానవుల పరిపాలనకు ఆ మతంబే సమాజం యొక్క వివేక శూన్య అనుకరణాన్ని ఖండిస్తూ దివ్యవాణివలె మాటాడుతాడు.

1849 మేలో "ఎ వీక్ ఆన్ ది కంకార్డ్", "సివిల్ డిస్‌బబీడియన్స్" అన్న రెండు గ్రంథాలు ప్రకటించబడ్డాయి. ఆ నెలలోనే తన్నెంతో ప్రేమిస్తూ హార్వర్డులో తానుండగా తన వ్యయమంతా భరించిన అక్కయ్య క్షయరోగ గ్రస్తయై 36వ ఏట మరణించింది. ఆ సంవత్సరంలోనే మెసచూసెట్సులోని ఊస్టర్ నివాసి

యైన హారిసన్ బ్లాక్‌తో స్నేహం ప్రారంభమైంది. తదాది జీవితాంతం వరకు తోరో అతనితో ఉత్తరప్రత్యుత్తరాలు నడిపాడు. ఎల్లరీ చానింగ్‌తో కలిసి కాడ్ అగ్రానికి తన మొదటి పర్యటన సాగించాడు. ఆ అగ్రం అతనిని విస్మయ చరితుణ్ణి చేసింది. రచయిత దృష్టిలో అతడా ప్రదేశాన్ని పరిశీలించాడు. "ఎ వీక్ ఆన్ ది కంకార్డు" అన్న గ్రంథాన్ని ప్రకటించిన ప్రకటన కర్తలు వాల్డన్‌ను వెలువరిస్తామని ప్రకటించారు. అది అతని రెండవ రచన. అతడా పుస్తకం అంతిమ భాగంలోని కొన్ని ఘట్టాలలో నిమగ్నుడై ఉన్నాడు.

ఫలోపేత గ్రంథ కర్తృత్వ మాశించిన అతని ఆశలు అడియాసలు కాబోతున్నవి. ఆ తరువాత విపత్కరమైన అయిదేండ్లు గడిచాయి. తోరో పేర్కొన్నట్లు అపార్థులైన అతని ప్రచురణ కర్తలు వాల్డన్‌ను "ఇదిగో ప్రకటిస్తున్నాము, అదిగో ప్రకటిస్తున్నాము" అని జాగుచేసి తుదకు ప్రకటించలేక పోయారు.నిరుత్సాహ కీటం క్రమంగా అతని వాల్డన్ ఉత్తరకాలిక చిత్తశాంతిని మింగివేసి నిఃస్పృహను కలిగించింది. 1851 నాటికి తనదినచర్యలో "నాకిప్పుడు 34 ఏండ్లు. అయినా నా జీవితం అవిస్తారితంగానే ఉన్నది" అని వ్రాశాడు. ఆత్మసంశయం ఏర్పడిన ఈ కాలంలో తనలో ఏదో అసహ్యత, నీచత్వం ఏర్పడినట్లు భావించాడు. పశ్చాత్తాపంతో తన బాల్యాన్ని సింహావలోకనం చేసుకొన్నాడు. "ఆనాడు నేను సజీవుడను. అనిర్వచనీయమైన సంతృప్తితో ఈ శరీరంలో నివసించాను," అని అన్నాడు. అతని ఆరోగ్యంగూడ సరిగాలేదు. తేలికగా రొమ్ము పడిసం పడుతుండేది. సహజంగా భావనాశీలు రనేకులు పొందే ఆనంద పారవశ్య నిరుత్సాహాలతో ఆందోళితు డయ్యాడు.

1852 నాటికి ఈ విచారం నుంచి, అంతర్ముఖత్వం నుంచి తేరుకొన్నాడు. అన్యాయంపై తిరిగి దాడి సాగించాడు. తన మిత్రులతో సన్నిహితత్వం పొందినట్లు భావించాడు. మెండుగా వ్రాస్తూ వచ్చాడు. కంకార్డుపల్లె పట్టులలో మునుటివలెనే సుఖంగా ఉంటున్నాడు. "అపరాహ్ణ సంచారార్థం నాకు తోట ఉన్నది.... మైళ్ళ తరబడి పూబొదలు కలిగిన త్రోవలున్నవి. ఏ రాజన్యుని భూములో తమకిలాంటి పూబొదలున్నవని మిడిసిపడజాలవు. అందు జంతువులు స్వచ్ఛంద సంచారం సాగిస్తవి. ఒక ప్రక్క భూమి వేరొకప్రక్క జలమయ మనోజ్ఞ దృశ్యాలున్నవి. వీట న్నిటి కంటె ముఖ్యమైనది అక్కడి ప్రశాంతత. చిక్కురు బొక్కురుగా ఉన్న ఆ దారులలో ఒక సంచారికూడా కనిపించడు. అలా కనిపించటం అరుదు."

ఇప్పుడతడు తన ముప్పయిదవపడి మధ్యలో ఉన్నాడు. పది పదిహేను సంవత్సరాల క్రిందటి కంటె ఇప్పుడతడు అధికతర శాస్త్రీయ దృష్టితో పరిశీలిస్తూ శ్రమపడి కంకార్డు ప్రాంతంలోని ఉద్భిజ్జ ప్రతి రూపాలను సేకరిస్తూ తన్ను వృక్ష శాస్త్రజ్ఞునిగా పేర్కొన్నాడు. అయినా తోరో ఇంకా హార్దికంగా కవి. యోగి (Mystic). ప్రకృతిగత విశ్వజనీన సూత్రాలను సందర్శించిన క్షణాలు అతని జీవితంలో అమూల్య భాగాలు. శాస్త్రం కోసం కంటె సౌందర్యార్థి అయి అతడు వస్తువర్ణనలకు ఇంకా ఉత్సాహిస్తూనే ఉన్నాడు. న్యూ ఇంగ్లండులోని దృశ్య శ్రవ్యఘ్రాతవ్య రుచులతో అతని సృజనాత్మక శక్తి పరాంకోటి కందుకొనేది. బెర్రీల సుగంధంవలె గాని, సురభిళోతుషారవాసిత వాయుపథము నిత్యోజశ్శాంతి కలితము, అశ్రాంతా కలంకిత ప్రభాటోత్కంఠా కము అయిన నితంబము నందంతట దివసావసానాన మారు

మ్రోగుతున్నట్లు వినిపించే ఆవు అంబారవంవలె గాని రమణీయ కం ఏ రూపంతో ఇంద్రియ గోచరమైనా కలిగే నిరామయోన్మత్తత యందు తనకుగల కాంక్షను అతడు 1852 జులైలో వివరించాడు. పాదుకాశూన్య పాదాలతో వాగువాలున నడిచి ఇలా వ్రాస్తున్నాడు. "మృదుసికతామయ భూమిపై నీ పాదాలు వికోచమందుతవి. గులకరాళ్లు తగులగనే భీరువులై సంకోచమందుతవి. తామరాకుల నడుమ జిట్టయిన జారుడు బురదలో దిగబడి పోతవి. ఎండవేడి కోడి ఆ ఆకుల నడుమదాగిన బ్రీయు, పెర్చి పికరెల్ మున్నైన మత్స సంఘాలకు బెదురు కలిగిస్తావు.........లేదా ప్రవాహానికి ఎదురై తీరికగా పెండ్లి నడకలు సాగించే తాబేలు తటస్థపడుతుంది.........తీరాన లోతులేని నీళ్ళల్లో నీ కాళ్ళకు ఒడ్డునుంచి జారే నీటి బుగ్గలు తగులుతవి. చలువనుబట్టి వాటిని గ్రహిస్తావు. అక్కడ దాహం కలిగితే ఇసుకలో చేతులతో గుంట తీస్తావు. అందు నీరు కుదిరి తేరుకున్న తరువాత నీకు నిర్మల శీతలజలం గ్రుక్కెడు లభిస్తుంది."

ఆందోళనకు అంత స్సంఘర్షణలకూ గురియైన క్షణాలున్నా అతనికి రోజులు హాయిగా గడిచాయి. తన అపరాహ్ణ కాలాన్ని అతడు సమాజానికి అమ్ముకోలేదు. అతడా పనిని ఎన్నడూ చేయడు. అతని జీవితమందలి విశ్రాంతి సమయాలలో అధిక భాగం సావకాశమైన ప్రకృతి పర్యాలోకనకు వినియోగించాడు. అతడనుదినం సేకరించిన అంశాలను ఉపన్యాస నిబద్ధం గావించి కంకార్డులో, క్లింటన్, వొర్‌స్టర్, మెడ్‌ఫర్డు, లింకన్, ప్లిమత్ మున్నగు స్థానిక పల్లీపట్టణ పరిషత్తులలో ఉపన్యసించేవాడు. వీనిలో చాలావరకు సెలవులలో తన కావించిన విహారయాత్రల వర్ణనలే. అతని 25-35 సంవత్సరాల నడుమ కంకార్డుకు పడమర

ఉన్న వచూసెట్స్, హూసక్స్, కాట్‌స్కిల్స్ పర్వతాలకూ, మెయిన్, కటడిన్ పర్వతారణ్యాలకు కాడ్ అగ్రానికి, కెనడాకు పరిశీలక యాత్రలు పెక్కులు చేశాడు. అతని ఉపన్యాసాల నుంచి తయారైన పెక్కువ్యాసాలు గ్రహామ్స్ పత్రికలో, పుట్నమ్స్ మాస పత్రికలో, ది యూనియన్ అన్న పత్రిక వంటి పత్రికలలో ప్రకటించబడ్డవి. యాత్రావర్ణిగా, సాహిత్య జీవితాలను గూర్చి కొన్ని భావాలున్న వ్యక్తిగా అతడు పేరు సంపాదింప సాగాడు. కొంత మంది శాస్త్రవేత్తలు ప్రకృతి శాస్త్రవేత్తగా అతనిని గౌరవింప సాగారు. అతడు వాల్డన్‌వద్ద ఉండగా యూరప్‌నుంచి హార్వర్డుకు వచ్చి మొట్టమొదటిసారిగా అమెరికా వన్య జీవితాన్ని వర్ణిస్తున్న మహావ్యక్తి లూయీ అగసీజ్‌తో అతడు పరిచయం కల్పించుకొన్నాడు. "ఇంటనుండి మానవుడు ప్రకృతిని పరిశీలిస్తాడు. ఇల్లు విడిచి వెళ్ళినపుడు ఆ ప్రకృతిని కనుగొనలేడు" అని చెప్పిన అగసీజ్‌కు తోరో ఉపజ్ఞ గోచరించింది. అతని యందు ఎంతో గౌరవం ఏర్పడింది. తోరో నుంచి మత్స్య, కూర్మ జాతుల ప్రతిరూపాలు లభించినందుకు మిక్కిలి సంతోషించాడు. 1850లో తోరో బాస్టన్ ప్రకృతి శాస్త్రసంఘ సభ్యుడుగా ఎన్నికయ్యాడు. ఆ తరువాత మూడు సంవత్సరాలకు శాస్త్రాభివృద్ధికై ఏర్పడిన అమెరికను పరిషత్తులో సభ్యుడయ్యాడు.

---

87


శ్రీ గ్రంథాలయం
శేలప్రోలు

అధ్యాయము 7

"కుసుమోన్మీలన దర్శనంకంటె మరొక వ్యాపారం లేనివాడనై రెండు సంవత్సరాలపాటు పువ్వులతో గడిపాను."

—తోరో దినచర్య.

1856లో తీసిన తోరో ఛాయా చిత్రం ఒకటి ఉన్నది. 1855లో అతడు చిరకాలం అస్వస్థతకు గురి అయ్యాడు. దానివలన ఆ కాలంలో అతని మొగం కవళికలు దుర్బలత పొంది ఉండ వచ్చును. అయినా 1856 నాటి ఛాయాచిత్రమే మనకు లభించి నంతలో అతని రూపానికి సన్నిహిత కావచ్చును. అతని పార్శ్వ గత రూపంకంటె ఎదురై నిల్చినప్పటి రూపం మిక్కిలి ముచ్చట గూర్చేదని అతని మిత్రులు భావించేవారు. అభిముఖుడై ఉన్న ప్పుడు ప్రముఖ నీలభ్రూవుల క్రింద కర్బురిత నీలినేత్రాలు స్పష్టంగా కనిపించేవి. ప్రక్క మొగంపెట్టి నిలిచినపుడు అతని గ్రద్ద ముక్కు కొంచెం పొడవుగా గోచరించేది. చిబుకం నిండుగా

దృఢంగా కనిపించేది కాదు. అతని వాలకాన్ని వర్ణించిన రచనలు పరస్పర విరుద్ధాలుగా ఉన్నవి. కొంతమంది కతడు కేవలం వికృతంగా కనిపించాడు. ఆ ముఖానికి ప్రశాంతత, విచారశీలం, దృఢసంకల్పం జీవకళను ప్రసాదించి ఉన్న లోటును తీర్చినదని పెక్కుమంది భావించారు. అతని ఒడ్డు పొడుగులు మధ్యస్థాల కంటె తక్కువ. 34వ ఏట అతని బరువు 127 పౌనులు. బాహ్యదేశ సంచారకుని శరీర సంస్థానం లేకపోయినా కార్య తత్పరత యందు అతనిని చూచినవారి కంటి కతడు ఆని ఉండేవాడు. అనుదినం ప్రకృతి పరిశీలనార్థమై బయలుదేరి నపుడు బలిష్ఠమైన తూగు, పిడికిలించిన చేతి విసురుకలిగి తోరో ఉన్నదానికంటె ఎక్కువ బలవంతుడుగా కనిపించేవాడు. కాని అతని శరీరతత్త్వం నిరామయం కాదు.

తోరో మిత్రుడైన యఫ్. బి. సాన్‌బరన్ అంగీకరించినట్లు ఎల్లరీ చానింగ్ వర్ణించిన తోరో రూపవర్ణనకంటె యదార్థతర వర్ణన లేదు. ఇదే మనకు లభిస్తున్న ఉత్తమ వర్ణనా చిత్రం. చానింగ్ ఇలా వర్ణించాడు. "అతని లక్షణాలు విస్పష్టాలు. ముక్కు గ్రద్ద ముక్కువలె ఉండేది. లేదా బొమ్మలలో కనిపించే సీజరు ముక్కు వంటి రోమన్ ముక్కు.........లలాటం అంత విశాలం కాదు, ఉన్నతమూ కాదు. కాని అందు కేంద్రీకృత శక్తి, లక్ష్యదృష్టి గోచరించేవి. వదనంలో ప్రముఖంగా కనిపించే అధరాలు అర్థవంతంగా సాలోచనగా బిగించుకొని ఉండేవి. క్షణం కూడా రిక్తపుచ్చరావన్న కార్యతీవ్రత మూర్తిలో గోచరించేది." అతని జీవిత చరిత్రను వ్రాసిన హెన్రీ సాల్టు అన్న ఆంగ్లేయుడు అతన్ని సంగ్రహంగా ఇలా వర్ణించాడు. "తోరో సుదీర్ఘ సహనం, విస్తృత పర్యటనం, హిమోపరితల ఖేలనం, వృక్షారోహణం, వృక్షచ్ఛేదనం,

పర్వతారోహణం లోతైన మంచులోని ప్రయాణం అతని అప్రతిహత సంకల్ప బలంచే సాధింపబడినవే కాని సహజ శారీరక శక్తిచే మాత్రంగాదు. అతడు ఆధ్యాత్మికవాది. ఆత్మాను ప్రవృత్తికై శరీరాన్ని ఎల్లవేళల నిర్బంధించటాని కతడు సంసిద్ధంగా ఉండేవాడు. దీనికి సమర్థకంగా డాక్టరు ఇ. డబ్లియు. ఎమర్సన్ వ్రాసిన ఈ వాక్యాలను సొట్లు ఉదాహరించాడు: "జన్మంతో అతనికి ప్రాప్తించిన శరీరం అత్యంత స్వల్పం అతని దిగుబుజాల వంటి బుజాలుగల వ్యక్తిని నేను చూడలేదు. ఆ రొమ్ముకంటె సన్నని రొమ్ముకూడ అరుదు. అయినా ఆ శరీరాన్ని వీలయిసంతగా దృఢపరిచాడు."

తోరోను సందర్శించక ముందు అతని రచనలు చదివిన పెక్కురు ఆశాభంగం పొందారు. వారికి దూరారణ్యాలలో సాధారణంగా కనిపించే కఠినకాయుడు కనిపించలేదు. అతని మిత్రుడు డేనియల్ రికెట్సన్ తోరో తన ఇంటికి మొదటిసారి వచ్చినప్పటి స్థితిని ఇలా వర్ణించాడు. "తోరో నన్ను సమీపిస్తూ ఆగి నన్ను మీరెరుగరు" అని అన్నాడు. నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపుతున్న వ్యక్తి ఇతడేనని మెరుపు మెరిసినట్లు తోచింది. అయితే అతడు స్థూలంగా అనామయుడుగా ఉంటాడని నా ఊహ. కాని ఈ అల్పవిగ్రహమే చూపునకు ఆనని ఈ వ్యక్తియే అతడని అనుకోలేదు. అయినా విగ్రహ దర్శనంతో ఏర్పడిన ఆశాభంగం భోజనవేళ జరిగిన ప్రసంగంతోను, ఆ సాయంకాలం సాగించిన సల్లాపంతోనూ తొలగిపోయింది. ఆ తరువాత ఏండ్ల తరబడి మా స్నేహం కొనసాగింది. ఆ కాలంలో అతని ఉదాత్త మానసిక శక్తులు, సారతర సంభాషణ, విస్తృతపాండిత్యం అతని శారీరక స్థితిలో విరోధించిన పట్లు అరుదు."

తన ఉపజాతిభేదాలను తోరో స్వయంగా వర్ణించుకొన్నాడు. దానితో ఈ రూపవర్ణన ముగించవచ్చును. "తూర్పుకంటె తరచు పడమరకు తిరిగి ఉంటాడు. అతని గృహ ఆగమనంకంటె గృహ నిర్గమంలో ఎక్కువ సొగసు కనిపిస్తుంది. శీతర్తువు వలెనే గ్రీష్మం అరణ్యంవలెనే సస్యక్షేత్రం చీకటివలెనే వెలుగులు అతనికి ప్రేమాస్పదాలు. సాంఘిక జీవనంకంటె ఐకాంతిక జీవనం ఎంతో ఇష్టం. వలస పోవాలనీ ఉండదు. ఒక చోటికి అంటి పెట్టుకొని ఉండాలనీ ఉండదు. ఏ ఋతువునందైనా రేయింబవళ్ళలో ఎప్పుడూ మేల్కొల్పాలన్నా గంట మ్రోగించ నక్కర లేదు. కంకార్డ్ అడవులలోని ఏ దేవదారు తరువుపై తట్టి అయినా అతనిని లేపవచ్చును."

ఒకనాటి రేయి పరిషత్తులో (The Lyceum) ఉపన్యసించిన తరువాత అతడు నిరుత్సాహంతో ఇంటికి వచ్చాడు. సాధారణంగా ఉపన్యాసానంతరం అతడు అలానే ఉండటం పరిపాటి. అదృష్ట వశాన అతని మానసిక స్థితిగతు లన్నింటినీ విశ్వాసనీయంగా రానున్న తరాలకు చాటగల అతని దినచర్య ఉన్నది. అందు తన రాగ రంజిత భావాలను పరిప్లావితాలు గావించి వైక్లబ్యం నుంచి తేరుకొనేవాడు. ఈ ప్రత్యేక సందర్భంలో అతడిలా వ్రాశాడు. "ఈ శీత ఋతువులో రెండుసార్లు ఉపన్యసించిన తరువాత భయమేర్పడు తున్నది. సదస్సు రంజకంగా ఉపన్యసించడానికి ప్రయత్నించి నన్ను నేను చౌకపరచు కొంటున్నానన్న భీతి కలుగుతున్నది. నాలో ఏ అర్థంమెండో, ఏ అర్థంకోసం నన్ను నేను గౌరవించు కొంటున్నానో ఆ అర్థం శ్రోతలందు వ్యర్థమై పోయిందని నిరుత్సాహ పడ్డాను." తన సిద్ధాంతాలనుంచి వసం తొలగటానికి ఆమోదించని తోరో, లొంగిపోయి నిజసిద్ధాంతా

లను రుచిరం కావించి తనకు ఆసక్తి కలిగించ యత్నిస్తాడని ఏ శ్రోత అనుకొంటాడు? అయినా ఉపన్యసిస్తూనే వచ్చాడు. అతని ఉపన్యాసాలు సముజ్జ్వలాలు కాని మాట వాస్తవమే. అయినా ధారావాహికంగా రుచిరంగా ఉపన్యసించే ఎమర్సన్‌తో తన్నతడు తన శ్రోతలవలనే పోల్చుకొన్నాడని గుర్తుంచుకోవాలి. తన సమ్మోహక ప్రత్యక్షతతో, రుచిరవాచకంతో ఎమర్సన్ లౌకికార్థాభి నివిష్టులైన శ్రోతలనైనా దుర్బోధాలైన పారమర్థికవాద భావాలను విన్యసించి ఆకట్టగలడు. వక్తగా ఎమర్సన్‌కున్న గుణాలు తనకు లేకపోయినా జీవిత ప్రగతులతో తనకున్న వ్యక్తిగత గంభీర భావాలను శ్రోతలకు బోధించడానికి ప్రయత్నించాడు. దూరంగా ఉన్నప్పుడు తనకూరట గొల్పిన లలిత భావాలను తన చెప్పినదెల్ల వినవలసిన నానా గోత్రులగు శ్రోతలకు వినిపించటం కష్టమని గుర్తించాడు.

అయినా అత డుపన్యసించిన అసాధారణ విషయం శ్రోతలను ఆకర్షించింది. దాని ఫలంగా కంకార్డు, ఊష్టరు పరిషత్తులలో ఏఏటేట కొన్ని సంవత్సరాల పాటు ఉపన్యసించాడు. ఇతర పల్లీ పట్టణాలు గూడ ఉపన్యసనార్థం అతనిని మరల మరల ఆహ్వానించాయి. తన ఉపన్యాసాలలో అతడు ప్రాసంగికంగా వినోదనీయార్థాలను ప్రస్తావించిన సందర్భాలున్నవి. కాడ్ అగ్రంవద్ద తన చేసిన సాహసకృత్యాలను హాస్యాజనకంగా వర్ణిస్తుంటే విన్న శ్రోతలు అశ్రుపాత పర్యంతం నవ్వారు. అడవి యాపిల్‌పండ్లను గూర్చి కావించిన ప్రసంగంవంటి అతని ప్రకృతి శాస్త్రప్రసంగాలు బాగా ఆకర్షించాయి. అతని కంఠం మధురం. కాని దాని నతడు సరిగా వినియోగించుకొనే వాడుకాదు. శ్రోతనుచూస్తూ ప్రసంగించక తన వ్రాత ప్రతియందు చూపులు గ్రుచ్చి చదివేవాడు.

యావజ్జీవం అతడు ఉపన్యసిస్తూనే వచ్చాడు. కాని దాని వలన పొందిన ఆర్థికలాభం స్వల్పం. ఎమర్సన్ వంటి వాడయితే డబ్బు సంపాదించ వచ్చునన్న మాట వాస్తవమే. కాని గ్రామీణ పరిష దుపన్యాసాలతో కాదు. అక్కడ ఏ కొలది ధనమో ముడు తుంది. తరచు అది కూడ ఉండదు. అభిప్రాయాలను వ్యక్తం చేసుకోవాలంటే పరిషత్తులలో ఉపన్యసించాలి. జ్ఞాత సముపార్జ నకు ఆరాటపడుతున్న ఆ కాలంలో శ్రోతలు లభించేవారు. పరిష దుద్యమం (The Lyceum Movement) ఇటీవల బయలుదేరినదే. అయినా న్యూ ఇంగ్లండు విజ్ఞానమయ జీవితానికి అదే పోషకం. నూతన భావాలలో ఏ మాత్రం ఆసక్తి ఉన్నవాడైనా ఆ ఉద్య మాన్ని బలపరిచారు. వేదికలెక్కి మహోపన్యాసాలు సాగించే యుగం. అంతకుముందే గడచిపోయింది. న్యూ ఇంగ్లండులోని సాహిత్యాత్మక పునర్వికాసం రచనకు యోగ్యమైన స్థితిగతులను కల్పించజొచ్చింది. ప్రాచీన అర్వాచీన రచనా రూపాలకు సమ న్వయం కల్పిస్తూ వందలకొలది పరిష దుపన్యాసాలు పెక్కు రాష్ట్రాలలో పల్లీ పట్టణాలయందు సాగిపోతున్నవి. అది ఉత్తమ ఉద్యమం. దానికి తుల్యమైనది ఈ నాడులేదు. చెప్పవలసిన విషయం ఎవరికేమి ఉన్నా దానికి ఉపన్యాసరూపం కల్పించ కలిగితే చాలు. దానిని వినిపించటానికి కనీసం తన గ్రామంలోనైనా అవకాశం ఉండేది. ఆ ఉపన్యాసం నచ్చితే దూరస్థలాలకు కూడా అతనిని పిలిచే అవకాశం కలిగేది. కంకార్డులో రచయితలు, తత్త్వవేత్తలు అధికంగా ఉన్నారు. అందువల్ల అచట ఉత్తమ పరిషత్తు ఏర్పడింది. అక్కడ కూడా అరాజక మత విరోధక మేధావులకు సుదీర్ఘకాలం ప్రాతికూలం ఉండేది. అలాంటివారి ఉపన్యాసాలకు అవకాశ మిచ్చే వారుకారు. 1845లో ఎమర్సన్ అతని మిత్రులూ ఆ పరి

షత్తును సంపూర్ణ ఉపన్యాస స్వాతంత్ర్య సూత్రానికి ఒప్పించే టంతవరకు ఆ పద్ధతే సాగింది. స్వచ్ఛంద సేవకులు క్రమంగా పరిషద్వ్యవస్థీకరణకు పూనుకొన్నారు. కంకార్డ్ పరిషత్తు 1842-43 ఉపన్యాస కార్యక్రమాన్ని తోరో ఏర్పాటుచేశాడు.

ఉపన్యాసానికి వలసిన వస్తువును ప్రసాదించే అమూల్య ఖని తోరోకు కాడ్ అగ్రంలో లభించింది. నైసర్గిక ప్రాంతాల యందలి ఉత్సుకత అతనిని అక్కడకు మూడుసార్లు కొనిపోయింది. మెసచూసెట్సు విశేషాలు చిరకాలంనుంచి భాషింపబడుతున్న అట్లాంటిక్ మహాసముద్ర ఝంఝామారుతానికి అడ్డుగా నిలిచిన నన్న వక్రితకరం నున్న కాడ్ అగ్రం అతని గాఢ వాంఛను తీర్చింది. కంకార్డుకు 60 మైళ్ళ దూరంలో నగ్నమై సముద్రంలోనికి చొచ్చుకొని ఉన్న ఆసికతామయ భూమి పొడుగునా అతనికి నిర్జన సముద్రతీరం కనిపించింది. 30 మైళ్ళ పొడవున్న, ఆ తీరం వెంట ఉత్తుంగతరంగ ఘోషలనడుమ తరచు ఝంఝామారుత చోదిత వర్షంలో శీతలమైన సముద్రపు పొగమంచులో అతడు నడచి వెళ్ళాడు. ఈ పర్యటన సందర్భంలో తాను కనుగొన్న విశేషాలన్నీ అతడు తన దినచర్యలో వ్రాశాడు. భగ్ననౌకల నుంచి తీరానికి కొట్టుకొని వచ్చిన ఐరిష్‌వలస గాంత్ర శవాలు, ఎరువుగా బండ్లపై చేరవేయబడుతున్న సముద్రపు కలుపు మొక్కలు, దేశాంతర్భాగ వాసులకు అపరిచితాలైన జోస్టరా, శాంఫైర్, రోజ్‌మేరీ మున్నైనన సముద్ర ప్రాంతీయ ఉద్భిజ్జాలు, గల్, వేడర్, విల్సన్, పెట్రెల్‌మున్నైనన సముద్రపు పక్షులు గాలివలన గిడసబారిన ఆపిల్‌చెట్లు, పిచ్‌పైనులు, ఇసుక దిబ్బలు జారిపోకుండుటకై నాటిన ముర్రమ్-గ్రాస్ (Murram grass) దేవదారువులు, స్థానిక ధాన్యాలు పిండివట్టే వాయుచోదిత యంత్రాలు, ఇండియన్ల

జాణపు ములుకులు, జెల్లీచేపలు కొట్టుకొనివచ్చి భూమిపై పడిన తిమింగిలాలు, నానావిధాలైన గవ్వచేపలు వెళ్ళిపోతూ భారం తగ్గించుకొనడానికి ఓడలు సముద్రంలో త్రోసివేసిన సరకులు, ప్రాచీన భగ్నవస్తువులు, తీరాన బయటపడ్డ పీట్, అత్యంత ప్రాచీన వృక్షాల మోళ్ళు, సముద్ర దీపస్తంభము, దానికి కొట్టుకొని చనిపోయిన (వలస వచ్చే) రెక్కల పురుగులు, పక్షులు—వీటి నన్నిటినీ దానియందు ఉల్లేఖించాడు.

సముద్రపు అంచుననే పడి పెద్ద తరంగాలు వచ్చినప్పుడు వెనుకకు తప్పించుకొంటూ సముద్ర సాన్నిధ్యానికి సంతోషిస్తూ మైళ్ళ తరబడి నడిచాడు. అతని పాదరక్షలనిండా ఇసుకే స్నిగ్ధ తీరకాంతితో అతని కన్నులు మిరుమిట్లు గొనేవి. ఒక్కొక్కప్పుడా నీటిలో ఈదేవాడు. ఆ జలం హిమశీతలంగా ఉండేది. నీరు లోపలికి లాగుతూ కంకార్డు నదీ మందప్రవాహ మట్లు భీతి కొలి పేది. ఒక్కొక్కప్పుడు తీరంవదలి భూభాగంలోనికి వెళ్లి ఇసుక తప్ప మరొకటి ఉండదనుకొన్న ప్రాంతంలో నిండుపైర్లు చూచి విస్మయ పడేవాడు. అటవీ ప్రియుడైన ఈ శిశువు బీచ్-ప్లమ్ అడవి గులాబీ, వుడ్ బైన్, పూ బాదలు చూచి సంతోషపడేవాడు. "గులాబులు పూచి ఉన్నప్పుడు బేబెర్రీ గంధంతో సమ్మిశ్రితాలై సికతామయ భూముల నడుమనున్న ఈ క్షేత్రాలు పుష్ప సమృద్ధితో భాసించాయి. ఈ సమృద్ధియందు వీనికి ఏ ఇటాలియన్ తోటలుగాని, ఇతరమైన ఏ కృత్రిమపు గులాబి తోటలుగాని సాటి వచ్చేవిగావు."

సమాజ బహిష్కృతులైనా స్వతంత్రులై ఏకాంతంగా కంకార్డు అరణ్యాలలో ఉండేవారు అతనికి అభిమాన పాత్రులు. సముద్ర ప్రాంతీయులలో తత్సదృశులైన వారిని అతడు సంద

ర్శించ గోరాడు. అలాంటివారు ఏకాంతంగా గవ్వ చేపలను, ప్రవాహంలో కొట్టుకవచ్చిన కట్టెలను, భగ్న నౌకాగత వస్తువులను సేకరించుకొంటూ ఉండేవారు. లేదా సముద్రతీరంలో బాస్ చేపలను పడుతూ ఉండేవారు. అందువల్ల అతడు గ్రామాలను పరిహరించి వెళ్ళేవాడు. అన్నిటికంటె సముద్రమూ, అద్దాని గంభీర వర్ణమూ, శక్తి అతనిని మిక్కిలిగా ఆకర్షించాయి. ఆ సముద్ర తరంగాలను అవలోకిస్తూ దేశాలను క్రొత్తగా కనుగొన్నవారు, దేశచిత్రాలు వ్రాసినవారు అయిన కొలంబస్, హంఫ్రీ, గిల్బర్ట్, చాంప్లేన్‌లను స్మరించాడు. ఇంగ్లండు నుంచి న్యూ ఇంగ్లండుకు బయలుదేరి రెండు మాసాలు పయనించి మొదటిసారిగా కాడ్ అగ్రంవద్ద దేశంలో దిగిన ఫాదర్లను సంస్మరించాడు.

తోరో మొదటిసారి 1849 అక్టోబరులో ఎల్లరీ చానింగ్‌తో కలిసి కాడ్ అగ్రానికి వెళ్ళాడు. అప్పుడు హేమంతపు గాలి దుమారాలు నౌకాభంగాలు తటస్థపడ్డాయి. ఆ మరు సంవత్సరం జూన్‌లో అక్కడికి వచ్చినప్పుడు ప్రశాంతగ్రీష్మం రాజ్యం చేస్తున్నది. ఆ తరువాత మాసంలోనే మార్గరెట్ ఫుల్లర్ అవశేషాలను అన్వేషించ వలసినదని ఎమర్సన్ తన్ను కోరగా అతడు మరొకసారి అ తీరానికి వెళ్ళాడు. ఆమెను, ఆమె భర్త అయిన కౌంట్ అసోలినీని, వారి పసిపిల్ల వానిని యూరప్‌నుంచి కొనివస్తున్న నౌక వారు న్యూయార్క్‌కు చేరవలసిన క్రిందటి రోజుననే తుపానులో చిక్కి బ్రద్దలయింది.

మేజినీ నాయకత్వాన జరిగిన రోమను విప్లవం చరిత్రను మార్గరెట్ పూర్తిచేసి ప్రకటనార్థం అమెరికాకు కొనివస్తున్నదని తెలిసింది. సముద్ర తీరానికి కొట్టుకొని వచ్చిన శిథిలాలలో మార్గరెట్ శరీరాన్ని, ఆమె వ్రాతప్రతిని అన్వేషించటానికీ అతడక్కడ

వచ్చాడు. కాని ప్రయోజనం లేకపోయింది. మరణించిన వారిని సముద్రం తన గర్భంలోనే దాచుకొన్నది. ఆ వ్రాతప్రతి కూడా లభించలేదు.

కంకార్డ్ పల్లెపట్టునకు తోరో పరిచిత వ్యక్తి అయ్యాడు. ప్రకృతిశాస్త్ర పరిశీలనకు గాని, హకిల్ బెర్రీలకోసం గాని బయలు దేరనపుడు పొలాలు అడవులు సర్వే చేసేవాడు. లేదా మిత్రుల తోను కుటుంబ సభ్యులతోనూ కలిసి పడవ ప్రయాణం చేస్తుండే వాడు. సంప్రదాయబద్ధం కాని అతని అలవాట్లు దుస్తులూ చూచి అపరిచితులు అతనిని మాట్లు వేసేవాడనో, గ్రామాలు తిరిగి చిన్న చిన్న వస్తువు లమ్ముకొనే చిల్లర వర్తకుడనో, శిల్పి అనో, కాదా చిత్కంగా తిరుగుబోతనో భ్రాంతిపడేవారు. ఒకసారి పోలీసులు బ్యాంకు దొంగతనమందు అనుమానించి అతడు కాడ్ అగ్రంవద్ద ఉండగా కొన్ని రోజులపాటు అతనిని వెన్నాడారు. ఒకసారి అతడు చెట్టుకు ఆనుకొని ఉండగా త్రాగుడుమత్తుతో నిలబడ్డ రైతని అనుమానించటం సంభవించింది. అతని దుస్తులు గట్టివి. ఏ కాలానికైనా చాలినవి. బూడిదరంగు గలిగి అందం ఆకారం లేనివై తన జీవికకు అజ్ఞాతవాస వాంఛకు అనుగుణంగా ఉండేవి. అతని యిట్లు ఎన్నడూ మెరుగును జూచిన పాపానపోలేదు. కాలి నడకే అతనికి ప్రియం. రైలుపెట్టెలో నిరర్థకంగా కాళ్లు వ్రేల వేసుకొని బల్లమీద కూర్చొన్నప్పుడు అతని మనస్సు మూఢంగా ఉండేది. శిభిరావాసంతో గూడిన ప్రయాణాలకు బయలుదేరవలసి వచ్చినప్పుడు, వీలైనంత తక్కువ సామగ్రితో బయలుదేరేవాడు. రైలులో కెనడాకు వెళ్ళినప్పుడు అతడు వెంట పట్టుకొని వెళ్ళిన సామానులు రెండే రెండు. ఒకటి రాగిరంగు కాగితపు సంచి. రెండవది తాటాకుల టోపి. స్వల్పవ్యయంతో ప్రయాణం చేయా

లన్నా, అల్పదూర ప్రయాణమట్లు దూరప్రయాణం సాధించాలన్నా పొడుగు గరిటె, గంటె, గాలం, మొక్కజొన్న నూక, పంచదార ఉప్పు వెంట తీసుకొని కాలినడకన బయలుదేరాలి. ఏ వాగు దగ్గరకో మడుగు దగ్గరకో వచ్చినప్పుడు. అందలి చేవలుపట్టి వండుకో వచ్చును. లేదా సంకటి (పుడ్డింగ్) తయారు చేసుకోవచ్చును. లేదా నాలుగు పెన్నీలుపెట్టి ఏ రైతు ఇంటివద్దనో రొట్టెనుకొని ఆ తరువాత తగిలే వాగునీటితో తడిపి పంచదారలో అద్దుకొని తినవచ్చు. ఈ తిండి రోజంతకూ సరిపోతుంది." అతని ప్రయాణ పరికరాలలో పేర్కొనదగిన వస్తువులు రెండున్నవి. మొదటిది పెద్ద హాటు, రెండవది గొడుగు. వానివల్ల కావలసిన పనులున్నవి. హాటులోపలి మడుపులో వృక్షశాస్త్రానికి సంబంధించిన ప్రతి రూపాలు దాచుకొనేవాడు. దానివల్ల విలక్షణాంకురాలను కొని పోయే లోహనాళం చేతిలో పట్టుకొన వలసిన పని ఉండదు. అదనంగా వానకోటు మోసికొని పోవడంకంటె గొడుగు తీసుకొని పోవడం తేలిక.

తోరో జీవితకాలంలోనే దక్షిణ రాష్ట్రాంతరదాస్య నిర్మూలనకై బయలుదేరిన ఉద్యమం తీవ్రించి అంతర్యుద్ధంలో ముఖ్య సమస్యగా తయారయింది. తప్పించుకొని వచ్చే బానిసలు దక్షిణ రాష్ట్రాలనుంచి ఉత్తర రాష్ట్రాల ద్వారా కొలది కొలదిగా వెళ్ళి పోసాగారు. వారిలో పెక్కు మందికి సానుభూతిపరులు ఉత్తర రాష్ట్రాలలో స్థిరనివాసం కల్పించుకొనడానికో కెనడాకు పారిపోవడానికో తోడ్పడ్డారు. కంకార్డు, పారిపోతున్న బానిసల ప్రధాన మార్గంలో లేదు. అందువల్ల కాందిశీకులు అక్కడ కాదాచిత్కంగా తగిలేవారు. ఆ నిర్భాగ్యులకు తోరో కుటుంబమూ వారి మిత్రులు యథాశక్తిని తోడ్పడ్డారు. వాల్డనులో ఉండగా కెనడాకుపోయే

రైలెక్కించి "ఉత్తరాభి ముఖ" ప్రయాణమందు ఒక నీగ్రోకు తానెలా తోడ్పడ్డాడో అతడు పేర్కొన్నాడు. "సంస్కరణాభి లాషులగు తన కుటుంబ సభ్యులద్వారా అతడు దాస్య నిర్మూల నోద్యమంతో సన్నిహిత సంబంధం పెట్టుకొన్నాడు. అతడు ఎమ ర్సన్‌ను అనుసరిస్తూ ప్రధానతరమైన ఆత్మదాస్యాన్ని గూర్చి లెస్సగా ఆలోచించగోరి ఆ ఉద్యమం పట్ల బహుకాలం నిర్లిప్తత వహించాడు. అయినా 1850లో కాందిశీకపు బానిసల చట్టాన్ని ప్రభుత్వం ప్రవేశపెట్టిన తరువాత ఈ నిర్లిప్తత అతనికి దుస్సహమై పోయింది. దాస్యం నిర్మూలనం కోరే మెసచూసెట్సు వాసులు, ఇతర రాష్ట్రీయులు, ఎక్కడో ఉన్న దక్షిణ రాష్ట్రాలతోనే కాక స్వరాష్ట్ర ప్రభుత్వంతో కూడా ప్రాతికూల్యం వహించవలసి వచ్చింది. దాస్య నిర్మూలన ప్రాధాన్యం ఆకస్మికంగా ప్రతివానికి గోచరించింది.

కాందిశీకపు బానిసల చట్టం రాకమున్నే తోరో తన "శాస నోల్లంఘనం" అన్న గ్రంథంలో, ఒక ప్రక్కన బానిసతనం క్షంత వ్యమే నంటూ మరొక ప్రక్కన స్వాతంత్ర్యానికి తానాశ్రయమని చెప్పుకొంటున్నందుకు మెసచూసెట్సు ప్రభుత్వాన్ని నిశితంగా విమర్శించాడు. అంతరాత్మ చెప్పినట్లు నడచుకొనే వారికి ఏ గతి పడుతుందో కారాగారానుభవ పూర్వకంగా గ్రహించాడు. ఆ నాటి నుండి పారిపోయి వచ్చిన బానిసలను పట్టుకొని అప్పగించా లన డమే గాక ఏ నాడో తప్పించుకొని వచ్చి ఉత్తర రాష్ట్రాలలో సుస్థిరావాసం కల్పించుకొన్న వారిని గూడా తన కప్పగించాలని శాసించి రాష్ట్ర ప్రభుత్వం తొల్లటికంటె మెండుగా అంతరాత్మ స్వాతంత్ర్యానికి అవరోధం కల్పించింది. 1851 ఏప్రిల్‌లో సిమ్సు అన్న నీగ్రోను తమ రాష్ట్ర ప్రభుత్వం తిరిగి దాస్యం అనుభవించ

వలసిందేనని స్వరాష్ట్రానికి పంపివేసింది. దానితో మెసచూసెట్సు లోని దాస్య నిర్మూలనోద్యమయవరులు ఆ చర్యపై తీవ్ర ప్రాతి కూల్యం ప్రకటించారు. ప్రభుత్వాధికారంపై క్రొత్త దాడి సాగించ టానికి వలసిన వస్తువును తోరో తన దినచర్యలో సేకరించ మొదలు పెట్టాడు.

1850 నుండి 1854 వరకు క్రమంగా అన్యాయ్య ప్రభు త్వంతో అతనికున్న వైరం పెరిగిపోయింది. సిద్ధాంతాన్ని పుర స్కరించుకొని ఒకసారి తల పన్ను చెల్లించటానికి నిరాకరించాడు. దానిని పురస్కరించుకొని కాందిశీకపు బానిసల చట్టాన్ని ఇకమీద వీలుపడినప్పుడెల్ల ఉల్లంఘించాలని అతడు ఆయత్తుడయ్యాడు. ఒకనాటి ఉదయం ఇంచుమించు మూర్ఛావస్థలో తన గుమ్మంలో వచ్చిపడిన నీగ్రోకు అతడు కావించిన పరిచర్యలను వర్ణించి అతని మిత్రుడు మాన్‌క్యూర్ కాన్వే మనకు చక్కని బొమ్మను ఇచ్చి పోయాడు. "ఆ పండితుడు వినమ్రుడై బానిసకు కోమలోప చారాలు చేస్తుండగా, కూర్చొని చూచాను. ఆ బానిసకు ఆహారం ఇవ్వాలి. వాచిపోయిన అతని కాళ్ళకు వేనీటి కాపుకాయాలి. అతడు విచారం దిగమ్రింగి సంపూర్ణ విశ్రాంతి పొందాలి. మాటి మాటికి ఆ ప్రశాంత తమ మానవుడు వణికిపోతున్న నీగ్రోను సమీపించి ఇంట ఉన్నట్లే నిశ్చింతగా ఉండవలసినదని అభయ మిచ్చాడు. ఏ ప్రభుత్వమైనా తిరిగి హాని కావిస్తుందేమోనని భయపడవలదని ఉద్బోధించాడు. ఇంకా ఆ రోజులలో బానిసలను వేటాడేవారు అంతరించ లేదు. అందువల్ల నాడు తన విహారం కూడా మానుకొని అతడా బానిసకు కాపలా ఉండవలసి వచ్చింది."

1854 వసంత ఋతువున బాస్టను నగరంలో తీవ్ర ఆందో ళనం వ్యవస్థా రాహిత్యం బయలుదేరినా, తప్పించుకొని వచ్చిన

యంటొనీ బరన్స్ అన్న నీగ్రోను మెసచూసెట్సు ప్రభుత్వం తిరిగి బానిసతనం చేయడానికి పంపివేసింది. ప్రజానీకం నిరసన సభలు జరిపింది. అతని విడుదలకు ప్రయత్నాలు కావించింది. కాని లాభం లేకపోయింది. ఈ సంఘటనతో రాష్ట్రమెల్లా అట్టుడికి నట్లుడికింది. తోరోకు అప్పుడప్పుడు వచ్చే కోపోద్రేకం దానితో ప్రజ్వరిల్లింది. జులై 4వ తేదీన కంకార్డుకు 18 మైళ్ళ దూరంలో ఉన్న ఫ్రేమింగ్‌హామ్‌వద్ద మహాసభలో అతడు ఉపన్యసించాడు. ఆ ఉపన్యాసానికి "మెసచూసెట్సులోని బానిస తన"మని సార్థకమైన పేరు పెట్టాడు. శాసనోల్లంఘనం వలెనే ఆ ఉపన్యాసం కూడా అన్యాయాన్ని నిశితంగా ఖండించింది. పరమ నిరపరాధులైన మానవుల హింసన క్రియతో భాగస్వామ్యము వహించినందుకు రాష్ట్ర ప్రభుత్వమందు తనకు కలిగిన అసహ్యాతను అతడు అందు వ్యక్తం చేశాడు. అలాంటి అన్యాయ చర్యకు ఒడిగట్టిన రాష్ట్ర ప్రభుత్వం అర్థరహితమై పోయిందని, తన దృష్టిలో ఆ ప్రభుత్యమే నశించిందనీ ఉద్ఘాటించాడు. "గత మాసం నుంచి అపార నష్టానికి గురి అయినట్లు బాధపడుతూ వచ్చాను. ఎందుకు నాకీ బాధ కలుగుతున్నదో మొదట బోధ పడలేదు. తుట్టతుదకు బోధపడింది. నేను నా దేశాన్ని కోల్పోయానని తెలుసుకొన్నాను."

దాస్య ఖండనంనుంచి మరలి అతడు ధన సంపాదన వ్యసనాన్ని ఎదుర్కొన మొదలుపెట్టాడు. జీవికా సంపాదనను గూర్చి (నియమరహిత జీవితం అన్న పేరుతో ఇది ప్రకటింపబడింది) న్యూబెడ్‌ఫర్డ్, నాన్టకిట్, ఫిలడెల్ఫియా అన్న చోట్ల ప్రసంగించాడు. ఉద్యోగ ద్రవ్యసంపాదనలు మాత్రమే పరమలక్ష్యాలైన సమాజంలో బ్రతుకవలసిన మానవులకు ఎలాంటి నైచ్యం నిర్భం

ధంగా దాపరిస్తుందో అతడు వివరించాడు. అలాంటి సమాజం దృష్టిలో ఈశ్వరుడంటే దమ్మిడీల కొరకు పోరాడు కొందని గుప్పెడు చిల్లర మానవజాతి నడుమ వెదజల్లే శ్రీమంతుడనీ, అంతకంటె విశిష్టుడు కాడనీ అతడన్నాడు. జీవితం పట్ల కొంత నిర్లిప్తత వహించి గంటలతరబడిగా పనిచేయడం మాని పత్రికాపఠనం నిగ్రహించుకొని ఆంతరిక జీవనం కొనసాగించి కాలిఫోర్నియా, ఆస్ట్రేలియాలలో నిసువర్ణం కొసం పాకులాడక తమ హృదయాలలో ఉన్న బంగారం చేకొన నారంభిస్తే ఎంత బాగుండును!" అరణ్య ప్రణయమై మానవుడు అర్ధదివసం వనసంచారం చేస్తే అతనిని సోమరిపోతుగా పరిగణిస్తారు. అలాగాక రోజంతా ధనవ్యాపారం సాగిస్తూ అడవులను ఛేదించి భూమికి అకారిక మౌండ్యం కల్పిస్తే అతడు ఘనకార్యం చేస్తున్నాడని శ్లాఘిస్తారు."

అంతకు కొన్ని మాసాలకు ముందే ప్రచురణ కర్తలవద్ద నుంచి "**A Week on the Concord**" అన్న తన పుస్తకం ప్రతులు అమ్ముడుపోనివి. 700 అతనికి తిరిగి వచ్చాయి. బహుశః ఈ వైఫల్య బాధ వలననే అతడిలా వ్రాశాడు. "నీ ధన సంపాదక మార్గాలన్నీ అధఃపతనానికి మార్గాలు........రచయితవై, ఉపన్యాసకుడవై తన్మూలాన ధనం సంపాదించాలంటే నీవు ప్రజామోదం పొందాలి. అలా పొందటమంటే అధఃపతనం పొందడమే...... మానవునికంటె ఏదో న్యూనత పొందినందు వల్లనే ప్రజలు నీకు డబ్బిస్తున్నారు........"

చుట్టుపట్ల కొన్ని మైళ్ళవరకూ భూమాపనంలో సమర్థుడని అతడు ప్రఖ్యాతి గడిస్తున్నప్పటికీ ఆ నైపుణ్యాన్ని ఎవరూ అర్థించలేదు. భూస్వాములకు సరియైన కొలతలు అక్కరలేదు.

లేని కొన్ని ఎకరాల భూమిని తమ స్థిరాస్తులకు కలిపే ఉరామరి కపు కొలతలే వారికి కావాలి. ఆ మషాయిదా లెక్కగాడు తన జీవితం ఒక్కసారిగా అనిష్ట నూతనమార్గం పడుతున్నదని గ్రహించాడు. "తొందరపాటుతో గూడిన, ఈ మోటుపని వల్ల మొరకు జీవితం సాగించవలసి వస్తున్నది. లేదా నా ఆహారంపట్ల అశ్రద్ధ వహించవలసి వస్తున్నది. ఇది మరీ శోచనీయం. పని కను రూపంగానే తిండి కూడ ఉంటున్నదని సూత్రాన్ని గ్రహించాను. నా కిష్టమైన వృత్తులు చేపట్టటానికి వీలుపడితే టీగాని కాఫీగాని త్రాగను. మాంసం ముట్టను."

తిండి సరిలేక ఆ సంవత్సరం అతడు చిరాపుగా ఉన్నా 1854 ఆగష్టు 9వ తేదీన అతని ఉత్తమోత్తమ కృతి "వాల్డన్" వెలువడింది. దానికే అరణ్య జీవనమని మరొక పేరు. అతని మొదటి కృతిని వెలువరించిన ప్రచురణకర్తలు ఈ రెండవకృతిని ప్రకటనకు సందేహించారు. దీనివల్ల ఆ ప్రకటన చిరకాలం ఆగిపోయింది. ఈ రెండవ కృతి ప్రకటనతో, మొదటి కృతి ప్రకటన వల్ల రచయితకు సంప్రాప్తించిన వైఫల్యం తీరిపోయింది. వాల్డన్‌కు వేరు ప్రచురణకర్తలు లభించారు. టిక్నర్ అండ్ ఫీల్డ్సు అన్న క్రొత్త కంపెనీ దానిని వెలువరించింది.

తోరో వాల్డన్ సరోవరంవద్ద 1845-46 సంవత్సరాలలో నివసించినా 1838 నుంచి 1854 వరకూ తన దినచర్యలో వ్రాసి ఉంచిన వస్తువును అతడు "వాల్డన్" అన్న గ్రంథంలో వాడుకొన్నాడు. ప్రపంచాన్ని అందు తనకున్న స్థానాన్ని చక్కగా గుర్తించి కృషిచేస్తూ తన విషయాన్ని చిత్తశుద్ధితో వివరించే మహా వ్యక్తియొక్క పదునారు సంవత్సరాల మానసిక వికాసాన్ని ఈ పుస్తకం చిత్రించింది. అతని లక్ష్యం గంభీరమే అయినా

దానిని అతడు ఉల్లాసకరమైన సుబోధక వ్యాస సముదాయంతో వర్ణిస్తూ ఉన్మీలితం చేస్తాడు. మంచి కథను, తనకున్న జీవిత దృక్పథాలతో మేళవించి చక్కగా పాఠకులకు ఎలా చెప్పాలో ఇప్పటి కతడు నేర్చుకొన్నాడు.' తాను కష్టపడి సంగ్రహించిన శిల్పంతో ఆ రెండు అంశాలను అతడు వాల్డన్‌లో మేళవించాడు.



# అధ్యాయము 8

"విచారగ్రస్తుడవైతే చిత్తడి నేలకుపోయి నూతన సంవత్సరాను గుణంగా అప్పటికే వికసించిన స్కంక్ కాబేజి కాడలను అవలోకించు, స్కంక్ కాబేజితనానికి నిరుత్సాహ పడి చనిపోదామని పండుకొన్నట్లు అవి కనిపిస్తవా?"

—తోరో దినచర్య

న్యూ ఇంగ్లండు వాసులని చెప్పబడుతున్న తోరో సమకాలికులకు "వాల్డన్" కృతి ఒక సందేశం. ఆ సందేశం విస్పష్టమే. పారిశ్రామికమైన 19వ శతాబ్దిలో జీవితం అంతకంతకూ క్లిష్టమై, క్షుద్రమై, తపస్సదృశంకాసాగింది. "నా ఇరుగు పొరుగులు పూనుకొన్న పనులతో పోల్చిచూస్తే హెర్క్యులిస్ కృత్యాలు ఒక లెక్కగాదు. అతని సాహసకృత్యాల సంఖ్య పన్నెండే. వానికి ఒక లక్ష్యం అంటూ ఉన్నది. మరి ఈ మహాపురుషులో! ఏ ఘోర జంతువును చంపలేదు. పట్టుకొనలేదు. ఏ సాహసకృత్యమూ

తుదముట్ట చేయనూలేదు. "అతని దృష్టిలో నిరంతర శ్రమాందోళన పూర్ణాలైన ఇరుగు పొరుగుల జీవితాలు ఆనంద శూన్యాలు, నీచాలు, స్తబ్దాలు. అందు ఉత్తమ గుణాలని పేర్కొనబడినవి గూడా ప్రాత పంచారాలు. వాటినుంచి బయటపడాలంటే సంపూర్ణ కేవలీకృత ఒక్కటే మార్గమని అతడు సూచించాడు.

అతని ఇరుగు పొరుగులలో జాన్ ఫీల్డు అనే ఐరిష్ రైతు ఉండేవాడు. అతడు ఒడలు దాచుకొనక కష్టపడి పనిచేసినా దారిద్ర్యంతో బాధపడుతుండే వాడు. అతనికి సలహా ఇచ్చిన పిమ్మట తోరో ఇలా వ్రాశాడు. "నా అనుభవం చెప్పి అతనికి తోడ్పడ యత్నించాను. నీవు నాకు ఆప్తులైన ఇరుగు పొరుగులలో ఒకడవు. నీ వలె నేను చేపలు పట్టడానికి ఇక్కడకు వచ్చాను. సోమరిపోతు వలె కనిపిస్తున్నాను. నీ వలె నేను నా జీవనోపాధి సంపాదించు కొంటున్నాను. వెలవక, వెలుతురు కలిగి శుభ్రంగా ఉండే చిన్న ఇంట్లో ఉంటున్నాను. నీ శిధిలగృహానికి సాలుసరి నీ విచ్చే అద్దె మాత్రపు ఖరీదు కూడ నా యిల్లు చేయదు. కావాలనుకొంటే ఒకటి రెండు నెలలో నీ మహాభవనాన్ని నీవు కట్టుకో వచ్చునని చెప్పాను. నేను టీ, కాఫీ, వెన్న, పాలు, మాంసం వాడటం లేదు. కాబట్టి వాని సంపాదన కోసం పనిచేయ నక్కర లేదు. కాయకష్టం అంతగా చేయను కనుక తిండిగూడ అంత అవసరం లేదు. ఏ కొంచమో ఉంటే నా తిండి వెళ్ళి మారి పోతుంది.........అనుదినం టీ, కాఫీ, మాంసం లభిస్తవి కాబట్టి అమెరికాకు తాను రావటం లాభదాయకమని అతడనుకొన్నాడు. కాని వాస్తవమైన అమెరికా అది కాదు. ఆ వస్తువులు ముట్టక జీవించటానికి స్వాతంత్ర్య మిస్తూ వాని సేవనంవల్ల ప్రత్యక్షంగా గాని దాపరించే దాస్యం, యుద్ధం అనావశ్యకవ్యయం పోషించ

వలసినదేనని నిర్బంధనానికి పూనని ప్రభుత్వం కలిగిన దేశమే నిజమైన అమెరికా దేశం.

తోరో సందేశం సారతర సమగ్ర జీవితం సాగిస్తున్న వారికోసం ఉద్దిష్టం కాదు. అనుచిత కార్యకలాపాసకులై శక్తి సామర్థ్యాలను రిత్తపుచ్చుతూ ఫల శూన్యతా విషాద దిగ్ధజీవితాలు గడుపుతున్నోళ్ళ వారికై అతడు సందేశించాడు. కార్యమదిరాపాన వివశులై వారు తమ చుట్టుపట్ల నున్న నిర్జీవతను గమనించ జాలక హతాశులై జీవయాత్ర సాగిస్తున్నారు. అలాంటి నీచ ప్రపంచానికి అతడు విముఖుడయ్యాడు. "కంకార్డు మెసచూసెట్సు అమెరికా అన్న భావాలను మనస్సునుంచి బహిష్కరించి అను దినం ఏకాంత సేపైన అవికలంగా మెలగాలనుకొన్నాను........ అందువలన జీవనాన్ని అక్లిష్టం కావించే ఈ ఏకాంత ప్రదేశాలకు వస్తుంటాను" అని అతడన్నాడు. జీవితం ఆటోపవర్జితమైనప్పుడు వ్యవస్థీకృతమై సారవంత మవుతుంది. మానవుల ధనతృష్ణ అతనిని విస్మితుని చేసింది. పొలాలలో కూర్చొండి వ్రాసుకొంటూ ఉండగా చూచిన ఒక ఐరిష్ వ్యక్తి అతడు తనకు రావలసిన వేతనం లెక్క గట్టుకొంటున్నాడనుకొన్నాడు. తన జీవిత కర్తవ్య నిర్ణయానికి వలసిన విరామం సంపాదించే నిమిత్తం తోరో ప్రక్కగా నిలబడి, అభ్యుదయ సమర్థకులు పేర్కొన్న "నిశ్చిత విధికి" అభిముఖమై పోతున్న 19వ శతాబ్దిని అవలోకించాడు."ఇది ఊర్ధ్వాభిముఖయాత్ర కాదు.ఆరిగాన్, కాలిఫోర్నియా, జపాను మున్నగు దేశాలనుగూర్చి ఈ జాతి పశ్చిమాభిముఖ యాత్ర సాగించ యత్నిస్తున్నది. ఇందు నాకే మాత్రం ఆసక్తిలేదు........ఇది భావశోభితం కాదు. అను రాగ స్నిగ్ధమూకాదు. ఇందు ప్రాణపరిత్యాగార్హమైనది ఏమిలేదు. తుదికి చేతి తొడుగులు కూడా విడిచి పెట్టవలసిన పనిలేదు........

లాభంలేదు. ఆ నిశ్చిత విధికి అభిముఖులై వారుపోతే పోవచ్చును. అది నా గమ్యం కాదని నా విశ్వాసం."

తోరో వాదం స్వానుభవ పూర్వకం. ప్రజలకు వెల్లడించక ముందు అతడు తన భావాలను ఆచరించి చూచాడు. అతని మాటలు అర్థశూన్యాలు కావు. తాననుసరించి సుఖం పొందిన నిరాడంబర జీవనపద్ధతి ప్రజలకు చూపించాడు. భారత తాత్త్విక గ్రంథాలు ప్రతిపాదించిన కర్మయోగంనుంచి ఆచరణ యోగ్యమైన సిద్ధాంతాన్ని స్వీకరించాడు. ఏ పనికి వాడు అత్మోచితమైన మార్గం తెలిసికొని ఇరుగు పొరుగులు దానిని నిరుపయోగమని భావించినా వెరవక అనుసరించాలి. అలాంటి మార్గం అనుసరించా లంటే స్వతంత్ర బుద్ధి కావాలి. మరి ఇది సామాన్యమా! "భావనలోనైనా స్వతంత్రుడైన మానవుడు నాకు ఎంతో అరుదుగా తటస్థపడుతున్నాడు. మనం నియమాలనుబట్టి జీవిస్తుంటాము. కొందరు మంచమెక్కి కదలలేరు. అయితే అందరూ ప్రపంచమెక్కి కదలలేరు. వివేకవంతుడైన నా పొరుగువానిని అడవులకు కొనిపోయి వస్తువులను పారమార్థిక దృష్టితో చూడు. మానవుల సంస్థలనన్నిటినీ మరచిపోయి నీ భావాలను పరిశుద్ధక కావించుకొని మరొకసారి ఆలోచించుకొమ్మని చెబితే అతడట్లు చేయలేడు. తన సంప్రదాయాలను విశేషాలను వదలిపెట్టలేడు. ప్రభుత్వాలు, కళాశాలలు, వార్తాపత్రికలు మున్నైనవి అనాదులనీ అనంతాలనీ భావిస్తాడు."

వార్తా పత్రికల భీరుత్వం తోరోకు విసుగెత్తించింది. టైమ్సు పత్రికను కొనక నిత్యార్థాలను చదువవలసిందని అతడు ప్రజలకు సిఫార్సు చేశాడు. "తానెంతో ఉదారంగా ధీరంగా ఉన్నానని ఆ పత్రిక భావిస్తున్నది. జీవన మరణాలు, పుస్తకాలు

మున్నైన ఉత్తమ విషయాలలో ఒక అల్ప భావం ప్రకటించే సాహసం కూడా దానికి లేదు. తతిమ్మా సామాన్యపు పత్రికలకు వలనే దానికీ మతాధికారుల ఆమోదముద్ర కావాలి. క్రీస్తువకు పండితులకు వివాదం జరిగిన కాలంలో అది వెలువడివుంటే నాడది ఆ పండితుల అభిప్రాయాలను ప్రకటించి ఉండేది కాని క్రీస్తు అభిప్రాయాలను ప్రకటించి ఉండేది కాదు. వాస్తవానికి అతని అభిప్రాయాలను తోచివేసి ఉండేది."

మానవుడు ఎలా జీవించాలి? తన జీవితను ఎలా సంపాదించుకోవాలి? ఋజువర్తనుడైన వ్యక్తి అన్యాయ్య ప్రభుత్వం పట్లు ఎలా ప్రవర్తించాలి? ఈ ప్రశ్నలను గూర్చి ఆలోచిస్తూ వచ్చిన తోరో ఆ కాలంలో సంఘసంపురణలో పూర్తిగా నిమగ్నుడై ఉన్నా అతనిలో ప్రకృతి శాస్త్రవేత్త అయిన తోరో కూడా మాటువడక స్పష్టంగా గోచరిస్తున్నాడు. అతని నైతిక వ్యాసాలు, ఉపన్యాసాలు కొన్ని నిజంగా స్మరణీయాలు. వీని రచనలకు ఎంతో కాలం పట్టలేదు. పరిశీలనతోను, గృహీత విషయ గ్రథనంతోను రోజులు గడపాడని అతని ఉత్తర కాలిక దినచర్య చాటుతున్నది. కంకార్డు పరిసరవిహారాలు సాగిపోతూనే ఉన్నవి. ఆ క్షేత్రం దాటి అవతలి దేశానికి ఒకటి రెండు యాత్రలు చేయగలిగాడు. 1853-1857 సంవత్సరాలలో మేన్ అడవులకు వెళ్లాడు. 1856లో బ్రాటిల్‌బొరో సమీపంలో ఉన్న ఫాల్ మౌంటెన్‌పై వృక్షశాస్త్ర పరిశోధనలు జరిపాడు. 1857లో కాడ్ అగ్రానికి మరొకసారి వెళ్లివచ్చాడు. 1858లో పర్వతారోహణ యాత్రలు రెండు జరిపాడు. బ్లేకుతో కలిసి మొనడ్నాక్‌వద్ద రెండు రాత్రాలు గడపివచ్చాడు. ఎడ్విన్ హోర్‌తో కలిసి వైట్‌మౌంటెన్లను పరిశీలించాడు. 1860లో చానింగ్‌తో గూడి మొనడ్నాక్‌కు

కడపటి యాత్ర కావించి వచ్చాడు. ఈ యాత్రా సందర్భంలో అతడక్కడ అయిదు రాత్రులున్నాడు.

తోరో కాలంలో జంతుశాస్త్రం ఇంకా ప్రత్యభిజ్ఞాన వర్గకరణ సమస్యలతోనే సతమత మౌతున్నది. ఆనాడు ప్రకృతి శాస్త్రవేత్తలకు ఆయా చోట్లకుపోయి ప్రతి రూపాలను సేకరించడమే ప్రధాన కర్తవ్యంగా ఉండేది. అంతేగాని నేడువలె నాడు జంతు ప్రవృత్తి పరిశీలనకు ప్రాముఖ్యం ఏర్పడలేదు. ప్రకృతి శాస్త్రవేత్తల కోరికపై అతడు కొలది నమూనాలను సేకరించాడే కాని ఆ పని అతనికి నచ్చలేదు. ఈ సేకరణ ఎంత వరకు ధర్మసమ్మతమా అని పరిశీలిస్తూ 1854 ఆగష్టులో ఒక తాబేలును చంపినప్పుడు ఇలా వ్రాశాడు. "శాస్త్రం కోసమని ఒక ప్రాణిని చంపాను. మారణంకావించినందుకు నన్ను నేను క్షమించుకోలేను. ఇలాంటి పనులు శాస్త్రానికి ఎంత ఉపయోగపడినా, కవితా దృష్టికి విరుద్ధాలు. ఇవి పరిశీలనలను కలుషితం చేస్తవి. ఇంతకంటె నిరాపరాధినై ప్రశాంతంగా ప్రకృతిలో సంచరించే భాగ్యం లభించాలని ప్రార్థిస్తాను. ఈ మారణం సముచితమని ఏ హేతువు నన్ను నమ్మించలేదు. దీనితో ఈ దినం దూషితమై పోయింది. ఆత్మగౌరవం కొంత కోల్పోయాను. కొంతవరకు హంతకుని అనుభవం పొందాను."

బలవంతాన ఎలాగో కొన్ని చేపలను, సరీసృపాలను చంపిన తరువాత ఉష్ణరక్త ప్రాణులను చంపటం మరీ కష్టమని భావించి అతడెన్నడూ పక్షిని చంపలేదు. చనిపోయిన పులుగును చేత పట్టుకొనటంకంటె, అనురాగంతో సజీవశకుంతాన్ని తిలకించటం అతనికిష్టం. ఏది ఎలావున్నా పక్షులను గుర్తించడం కష్టం. అతనివద్ద నున్న దూరదర్శిని చాలా దుర్బలం. కాలం

గడిచిన కొలదీ అతడు అంతకంతకూ అధికంగా వృక్షశాస్త్రం వైపు మళ్ళి స్థానిక ఉద్భిజ్జా సంగ్రహణంలో నిమగ్నుడయ్యాడు. ప్రకృతి శాస్త్ర వేత్తగా కొంత ఖ్యాతి సంపాదించినా శాస్త్రవేత్తల మధ్య నున్నప్పుడు అతనికి కొంత బెరుకుగా ఉండేది. వారు ప్రత్యేక శాఖలో కృషి సాగిస్తూ విషయాన్ని నిర్లిప్తంగా పరిశీలించాలని దృష్టిని కేంద్రీకరించిన కొలది ఆధ్యాత్మికంగా వారు నిష్ప్రచ్చరం వరిస్తున్నారని అతడు భావించాడు. మానవుడు ఎంత వరకు చైతన్యవంతుడన్న విషయం ముఖ్యం కాని ప్రకృతిని సాంకేతిక పదాలపట్టికగా మార్చడంలో ఎంత నేర్పు ఉన్నదన్న విషయం ముఖ్యం కాదు. నిపుణుల ప్రత్యేక సాంకేతిక పదాలను అతడు నిరాకరించాడు. "ఏ సజీవపదార్థమైనా ప్రజాసామాన్య భాషలో తేలికగా చక్కగా వ్యక్తమౌతుం"దని అతడు వ్రాశాడు.

ప్రకృతిని సమగ్రంగా గ్రహించాలని తోరో కోరిక. మానవజీవితార్థం గ్రహించాలన్న తాత్పర్యంతో తత్పరిసరతత్త్వం గ్రహించాలని అతడు వాంఛించాడు. దానికై ప్రకృతిని వ్యక్తిగత దృష్టితో పరిశీలించాలనుకొన్నాడు. ప్రకృతి తన రహస్యాలను బోధించాలంటే కొంత వరకు దానితోటిడి వాస్తవ సంసర్గం ఆవశ్యకం. శాస్త్రకారులు నిరంతరం విశేషాలు సంగ్రహిస్తూ ఉండవచ్చును. కాని జీవితాన్ని గూర్చి తెలుసుకొనవలసినదేమో, పరమావధులను గుర్తించి పూర్ణంగా ఆనందమయంగా ఎలా జీవించాలో వారు చెప్పలేరని అతని సిద్ధాంతం. కీకార్యారణ్యాలలో పెరుగుతూ ఆకులు మాత్రమే వేస్తూ ఎన్నడూ పూయని మొక్కలతో అతడు ఈ శాస్త్రకారులను పోల్చాడు. అతని ఇరుగు పొరుగులు కలలో గూడ ఊహించి ఎరుగని గంభీర సారతర జీవితమార్గాన్ని అతడు ప్రకృతితో అన్వేషించాడు. నిజ పరిసర

గత చేతన వస్తువులను ఏకతానతాయుతంగా పరిశీలించి నేరుగా వాని జ్ఞానం పొందాలని అతని లక్ష్యం. అంతేగాని వాని భాగాలను శతథా ఛేధించి పరిశీలించి దాని మూలాన ఆ జ్ఞానం సంపాదించాలని అతడు తలపెట్టలేదు. మరి రెండు సంవత్సరాలకు మరణిస్తాడనగా అతడిలా వ్రాశాడు. "తమ నెత్తిపై ఏ రెండు మూడు వందల అడుగుల ఎత్తుననో ఎరిగే డేగ సుందరాకారాన్ని కాంచి సమీపించి తమ చేతులతో పట్టుకోవాలని కొందరు కోరుతారు. ఆ యెత్తున ఉన్నప్పుడే తాము దానిని చక్కగా చూడవచ్చుననీ అలాంటి అవకాశం మరొక సారి లభించక పోవచ్చుననీ వారు గుర్తించరు. పంజరబద్ధమై ప్రాంగణంలో కీచుకీచు మని అరిచే డేగ డేగేనా? దానిని చూచినందువల్ల నాకు వచ్చే విశేషజ్ఞానం లేదు. దాని ప్రేగుల పొడవు ఎంత ఉంటుందో నా కక్కరలేదు."

ప్రయోజనైకాగ్రతామూర్తియై అతడు పక్షి సందర్శనం, ఉద్భిజ్జ సంగ్రహణం అర్థించి బయలుదేరి పిడికిళ్లు బిగించిన చేతు లూపుకొంటూ గ్రామం వెలుపలికి వెళ్లేవాడు. లేదా నది వాలున బడి వేగంగా పడవను నడుపుకొంటూ వెళ్లేవాడు. ప్రతి విహార యాత్రకు పునరుద్దీప్త పారవశ్యంతో తనకు ప్రకృతితో సంతనకట్టుగా యావజ్జీవం సాగించవలసిన వ్యాపారం ఏదో ఉన్నట్లు బయలుదేరేవాడు. ఎర్మె వృక్షఛ్ఛాయా కలితాలైన కంకార్డు వీధులు గడచి పొలాలలో అంతర్ధానమై పోయే ఆ వ్యక్తి ఇరుగు పొరుగులకు ఒక అనామకుడుగా గోచరించేవాడు. వన వాహినీ కచ్ఛభూములతో సంక్లిష్టతరులతా గుల్మాలతో, నిర్జన పర్వత ప్రదేశాలతో, అతనికి అనన్య సాధర్మ్యమేదో ఉన్నది. ఆ ప్రాంతాలలో సమాజ బాహ్యాంచలాల యందు సగం ఇండియన్ పద్ధతిని నివసించగోరిన మానవులు మాత్రం తటస్థపడేవారు.

ఇండియన్ అన్నా, ఇండియన్ వలె కనిపించేవాడన్నా అతనికి ఎంతో కుతూహలం. కంకార్డులోని కొలదిమంది రైతుల లక్షణాలలో కనిపించే ఇండియన్ జాతి జాడలను అతడు వ్రాసి పెట్టాడు. వీటి అన్నిటికంటె స్వచ్ఛమైన ఇండియన్ కాదా చిత్కంగా దేవదారువుల నడుమ నైసర్గికాకృతితో కనిపిస్తే ఆ దృశ్యానికి ఎక్కువ విలువ ఇచ్చేవాడు. సమాజానికి దూరమై, పిల్లల పరిహాసానికి భాజనమై గతించిన తన పూర్వులకు మరణానంతర క్రియలు జరుపుతూ వసించిన అమెరికన్ ఇండియన్ స్త్రీని మిక్కిలి జాలితో చూచాడు. తిరిగి పంచ భూతాలలో విలీనం కానిదనీ, భూదేవి కూతురనీ, దేశీయకులీన అనీ, ఆమెను వర్ణించాడు. మెయిన్ అడవులలో తాను కలుసుకొని పయనించిన మార్గదర్శకులను గూర్చి, వేటకాండ్రను గూర్చి వ్రాయడం అతనికిష్టం. అతని యాత్రావర్ణన లన్నిటిలోనూ, మెయిన్, మౌంట్ కటడిన్ ఆటవీ సంచార వర్ణన ఉత్తమం. అది అతని ఉదాత్త శక్తిని చాటుతున్నది. రెడ్ ఇండియన్ల స్మృత్యర్థం బాణపు ములుకులు గల కంకార్డు ఇసుకలను ఇక గాలించవలసిన అవసరం అతనికి తీరిపోయింది. వారిని సందర్శించాడు. మెయిన్ ప్రాంతాన విగ్వాంనాయక శిబిరకలిత గ్రామాలలో నివసిస్తూ చిన్న చిన్న పడవలను నడుపుకొని పోతూ ఆదిమదాసుల గీతాలను పాడుకొంటూ ప్రాచీన ఇండియన్ జాతి కుక్కలచే తమ మకాములకు కాపలా కాయించుకొంటూ రెడ్ఇండియన్లు జీవయాత్ర సాగిస్తూ ఉన్నారు. అజ్ఞాత మానవ సంచారభీకరాలు, జీవత్పతిత జీర్యద్వృక్షాంతర జటిలాధ్వగ వృకభల్లూక కారిబూ మృగనిత్య విహారాలు, అనపహృతదారువులు, అయిన సుదూరారణ్యాలు ప్రవేశించి ఆనందవివశు డయ్యాడు. ఒక నివేశంనుంచి మరొక నివేశానికి

ప్రాచీన నదీ మార్గాలనుసరించి అతి విశాలాలైన స్ప్రూస్, సీడర్, హెమ్లక్, బర్చి అడవుల గుండా వెళ్లాడు.

క్రొత్తగా నెలకొన్నవారి బాహ్య స్థావరాలలో నిలిచి, అతడు వేగవంతాలైన ప్రవాహాలలో పడవులను చక్కగా నడపటం నేర్చుకొన్నాడు. జలపాతాలను దాటటానికి వస్తువులను కష్టపడి సుదూరం చేరవేశాడు. వెన్నెల వెలుగులో సరస్సులపై మైళ్ళ కొలది దూరం పడవను నడపుకొంటూ వెళ్లాడు. ఆరుబయట దుంగమంటల ప్రక్కన నిద్రించాడు. పగలు చేపలను వేటాడే అస్ప్రిల అరపులూ, బోడితల గ్రద్దల ఎలుగులూ ఆలకించాడు. రాత్రులందు వృకోలూక ధ్వనులు విన్నాడు. అతనిలోని వేటకాడు విజృంభించాడు. తాను మున్నెన్నడూ చూచి ఎరుగనంత పెద్ద చేపలను (ట్రౌట్, రోచ్ జాతిమత్స్యాలను) పట్టుకొన్నాడు. గాలం వేయడమే తడవుగా అవి ఎరలను మ్రింగివేసేవి. ఆ అనుభవం విచిత్రం. ఆ మత్స్యాలు మనోజ్ఞాలు. ఆ దృశ్యం స్వప్నసదృశం. ఆరవృక్షశాఖాయనంపై పరుండి వానిని చూచినపుడు అవి స్వప్నాలు, కథలు కావని నమ్మలేక పోయాడు. అందువల్ల సత్య మెరుగగోరి నా సహచరులింకా నిద్రిస్తుండగానే నేను వేకువనే లేచాను. వెన్నెలలో విస్పష్టంగా అనాచ్ఛాదిబహిర్లేఖతో కటడిన్ కనిపించింది. ఆ ప్రశాంతతను ఝరీనాదం మాత్రమే భగ్నం చేస్తున్నది. ఆ సెలయేటితీరాన నిలబడి నేను మరొకసారి గాలం ప్రవాహంలో వేశాను. ఆ స్వప్నం యథార్థం. ఆ కథ సత్యం. మచ్చలుగల ట్రౌట్‌చేప వెండివలె మెరసే రోచ్ చేప, చంద్రికా రుచిరవాయువులో కటడిన్ వార్శ్వాన దీప్త చాపాలు కల్పిస్తూ అతివేగంతో ఎగిరిపడుతున్నవి.

వీరు చిట్టచివరకు తమ బృందంలో ఎవరికీ తెలియని

క్రొత్త ప్రదేశం దాటి వారు వెళ్లారు. నదిని వదిలి నిమ్నోన్నత ప్రదేశం మీదుగా పర్వతానగాభి ముఖులై పయనించారు. పర్వతారోహణాలో విశేషానుభవమున్న తోరో అక్కడ నాయకత్వం వహించవలసి వచ్చింది. దిక్సూచియంత్రం పట్టుకొని తన జట్టును సాంద్రమైన భూర్జవామన సింధూరారణ్యాలలో స్ప్రూస్ అడవులలో ఎక్కడా ఆగక పెక్కు మైళ్ళదూరం నడిపించుకొనిపోయి తుదకు ప్రదోషవేళకు పర్వత శిలామయపార్శ్వానికి చేరాడు. మరునాడు తోరో ఒంటరిగా మబ్బు లావరించిన నెత్తం అధిరోహించాడు. "నేను అస్థిరంగా ఉన్న పెనుబండల మీదుగా ఒంటరినై మైలుకు పైగా మేఘాలవైపు పైకెక్కి పోసాగాను. ఆ పగటివేళ క్రింది ప్రదేశం నిర్మలంగానే ఉన్నది. కాని నెత్తం మాత్రం పొగమంచుతో సంఛన్నం. ఆ పర్వతం విభిన్న మహాశిలా సముచ్చయంవలె కనిపించింది. ఎప్పుడో రాళ్ళవాన కురిసినట్లుగా తోచింది. ఆ పడినరాళ్లు పడినట్లే పాదుకొనక ఒండొండిపై ఒరిగి ఉన్నవి. వాని నడుమ మహా రంధ్రాలలో ఎక్కడా మట్టిగాని స్నిగ్ధకటకం కాని లేదు. అవి గ్రహాంతరం శిలాఖనిప్రపాతితాలైన ముడిసరకులవలె ఉన్నవి. అపార ప్రకృతి రసాయనిక కర్మాగారం త్వరలోనే వాటిని పేరుస్తుంది. లేదా శిథిలం కావించి భూతలమందలి పచ్చని మైదానాలుగా, లోయలుగా మారుస్తుంది.

మెయిన్ ప్రధాన యాత్రనుంచి తోరో తిరిగి కుటీరానికి వెళ్లి "కటడిన్" అన్న శీర్షికతో వ్యాసం వ్రాశాడు. దీనిని హొరేస్ గ్రీలీ ప్రకటింపించాడు. ఆ తరువాత మరి రెండుసార్లు ఆ అడవులందలి ఆదిమద్వీపులైన శంబరానికి, ఇండియన్లకు సంబంధించిన ఇతర విశేషాలను తెలిసికొనే నిమిత్తం మెయిన్‌కు వెళ్లివచ్చాడు. అతడు జో పోలిస్ అన్న ఇండియన్ మార్గదర్శకుని కలుసు

కొన్నాడు. తోరోకు అతడెంతో నచ్చాడు. ఇండియన్లకుండవలసిన లక్షణాలన్నీ దాదాపు జోలో ఉన్నవి. అతడు మౌనముద్ర ధారమై దృఢంగా యుక్తిశాలిగా గోచిరించాడు. వేటాడటంతో, దారి కనుగొనటంలో దొన్నెను నడపడంలో అతడు నిపుణుడు. ఇండియన్ ప్రాచీన కథలకూ గాథలకూగని. సహజావబోధంతో వన్య జీవుల పద్ధతులెరిగిన అనుభవశాలి. అయినా అతడు శిక్షణపొంది నాగరీకుడయ్యాడు. తన మనస్సులో మెదిలే విభ్రాంతి కరప్రాకృత ఆదిమవాసి రూపానికి సదృశమైన రూపం కలవాడు అతడేనని తోరో అంగీకరించాడు. “స్ప్రూస్ వేళ్ళతో కుట్టిన దొన్నె ఎక్కి-హారన్‌బీమ్ తెడ్లతో నడుపుకొంటూ అతడు తన మార్గాన పయనిస్తాడు. బెరడు దొన్నెకూ తుపాకివేటకూ నడుమ గడచినయుగలచేసి నద్ధుడై అతడు నాకు అస్పష్టమూర్తిగా గోచరిస్తాడు.దుంగలతో ఇల్లు కట్టుకోడు. తోళ్ళశిబిరం వేసుకొంటాడు. వేడిరొట్టెగాని తియ్యని కేక్‌గాని తినడు. కేవలం గంధమూషిన శంబర మృగాల మాంసము, ఎలుగుబంట్ల క్రొవ్వుమాత్రం భుజిస్తాడు. మిలియోనాకెట్ మీదుగా బడి నా దృష్టి పథంనుండి జారిపోతాడు.... ఈవిధంగా ఆ అరుణవర్ణాలంకృతముఖుడు నిజకర్మానుసారియై వెళ్ళిపోతాడు.”

రచనా విషయంలో తోరో చెప్పగలది ఎంతో ఉన్నది. గురికాడు తుపాకీని లక్ష్యాభిముఖం కావిస్తున్నట్లే తాను తన వాక్యాలను సూటిగా సావకాశంగా లక్ష్యాభిముఖాలను కావించాలని అతడు కాంక్షించాడు. మంచి వాక్యం వ్రాయడమంటే అతి భగీరథ ప్రయత్నం కావాలి. దుష్కరమే అయినా అలాంటిది యత్నార్హం. గత్యంతరం లేదన్నట్లుగా వ్రాయాలి. అయితే శ్రమపడ్డ చిహ్నె లెక్కడా కనిపించరాదు. నేరుగా తన అనుభవంలో నుంచి మాటలు

ఉప్పొంగి రానప్పుడు రచయిత తన కాలాన్ని వ్యర్థం చేసు కొంటున్నాడు. యధార్థ సంవేదనా శూన్యాలైన పదాలు నిర్జీవాలు. "నిర్దిష్ట వస్తువుల నధికరించి వ్రాయటం వ్యర్థం. వస్తువు మనసులో ప్రజ్వలేరిటంతవరకు వేచివుండాలి. చరితార్థమైన ప్రతి రచనకూ వెనుక సృజనాత్మక హృదయం ఉండాలి." తన పౌరుగురైతయిన జార్జి మైనాట్ వర్ణనాశక్తిని తోరో మిక్కిలి ప్రశంసించాడు. "మైనాట్‌వి చక్కని ప్రాచీనాంగ్ల పదాలు. నా జీవితంలో వాటిని మున్నెన్నడూ నేను వినకపోయినా నిఘంటువులో అవి తప్పక దొరుకుతాయనుకొంటాను....వాల్డన్ మడుగును గూర్చి సామాన్యుడు నాతో ప్రస్తావించగానే నాకు నిమ్నతాశూన్యమూ, ప్రతిబింబరహితమూ, నిర్జీవవర్ణమూ అయిన జలం స్ఫురిస్తుంది. దానినే మైనాట్ ప్రస్తావిస్తే మరకతమణి స్పర్ధి జలాలు ప్రతిబింబిత పర్వతాలు వెంటనే నాకు ప్రత్యక్షమౌతాయి. ఎందుకంటే అతడక్కడకు వెళ్లాడు. అతడు సంచరించే అడవుల నుంచి పర్ణ మర్మరధ్వనులు నాకు వినిపిస్తవి. మేడిపట్టి చక్కగా దున్నిన చాలేమో అన్నట్లు రచయిత వాక్యం తుదివరకూ తిన్నగా పోవాలని చెప్పినప్పుడు మైనాటువంటివారు అతని మనస్సులో మెదులుతుండాలి. వాక్యం, ఓ జస్వంతంగా ఉండాలంటే రసావేశంతో వ్రాయాలి. శరీరం ఇంద్రియాలు మనస్సుతో సమ్మిళితం కావాలి. అభివ్యక్తి అన్నదిపూర్ణ పురుషుని క్రియ. "వాల్డన్ రచనకు కొన్ని సంవత్సరాలకు ముందే తనకే శైలిలక్ష్యమో తోరోకు తెలుసు. రసోచిత గుణకలితాలై కేవల ప్రాచీన భావకథన కాలుకాక నవ నవోన్మేష భావశైలులై బహుళార్థవ్యం జకాలై రోమన్ అక్కలేళ్ళవలె చిరస్థాయులైన వాక్యాలు కావాలి." అలాంటి వాక్యాలు వ్రాయడమే రచనా శిల్పం. కాలవ్యయ ప్రయాసల కోర్చి వ్రాసిన

వాక్యాలు కావాలి. అమూల్యార్థ కలితాలు, బహుళ గ్రంథావలోకన ఫలాలు, విస్తృత జీవితానుభూతి సంజాతాలు....గర్భితసస్య బీజాలు త్యక్త పునరుక్తులు, సృజనాత్మకాలు దుర్గక్షేత్ర క్రేయ నిర్మాణాలు అయిన వాక్యాలు కావాలి. తోరో మతంలో శైలిమే మానవుడు. "నీలోని ఉత్తమత్వమే నీవు వ్రాయగలిగిన ఉత్తమ రచన. ప్రతి వాక్యం చిరతర సమీక్షాఫలం ముఖపత్రం మొదలుకొని అంతం వరకు రచయిత స్వభావం గోచరిస్తునే ఉంటుంది. అతడు దీని నెన్నడు దిద్దివేయలేడు."

* * * *

ప్రకృతిశాస్త్ర వేత్తగా. భూమాపకుడుగా, వ్యవసాయ వక్తుడుగా కంకార్డు ముఖ్య పరిశీలకుడుగా తోరో సమీపవాసులైన రైతులకు వారి పొలాలను గూర్చి ఎంతైనా నేర్పగలడు. తమ పొలాలు త్రొక్కుకొని వచ్చే తిరుగుబోతువలె అతడు పెక్కురకు మొదట కనిపించాడు. కాని చివరకు రచనికి మిత్రుల అయి విస్మయపడతారు. అతని యందు వారికెంతో గౌరవ మేర్పడ్డది. విద్యాబుద్ధులు విశేషంగా లేకపోయినా కాయకష్టం చేసి జీవించే వారున్నారు. న్యూ ఇంగ్లండుకు వారే వెన్నుముక. అలాంటి వారికి గూడా అతనికి ఎడతెరిపిలేని మృగణకు ప్రయోజనం కని పించసాగింది. దేగలను బాతులకొని వచ్చి వాని జాతిని చెప్ప మనేవారు. వింతైన ఉద్భిజ్జాలవద్దకు అతనిని కొనిపోయి చూపే వారు. తమకు తెలిసిన స్వల్పస్థానిక జ్ఞానంతమకు తెలియకుండానే వాతరనికి అందజేసేవారు. వారిలో ఒకరు అతనిని గూర్చి ఇలా అన్నారు. "అతడెల్లప్పుడూ ముక్కుకు సూటిగా పోయేవాడు. ప్రియకరంగా ఉండాలని సర్వదా యత్నించేవాడు....నా పొలం మీదుగా పోతున్నప్పుడెల్లా వెళ్లి అతనితో మాటాడాలనిపించేది.

నీ ఇచ్ఛ వచ్చినంతసేపు మాటాడేవాడు. ఆ మాటాడినదంతా నూతనమే.” తనకు పరిచితులైన సంస్కార సంపన్నులలో పెక్కు మందికంటె తమకే అతడు ఎక్కువ గౌరవ మిచ్చేవాడనీ, తాము చెప్పిన సంఘటనలు వ్రాసి పెట్టుకొన్నాడనీ తెలుసుకొంటే ఆ గ్రామీణులు ఎంత విస్మితులయ్యేవారో!

తోరో వ్రాసిపెట్టుకొన్న దినచర్య సంపుటులు నిజంగా గనులు. విరామ విరహితంగా వాటిని పరిశీలించడం జరిగింది. పరిశోధకుడు పూని పని చేస్తే వానినుంచి ఇంకా ఒకటి రెండు నుంచి పుస్తకాలు సేకరించవచ్చును. ఫ్రాన్సిస్ హెచ్ యాలెన్ సేకరించిన 'Men of Concord' అన్న పుస్తకం కంటె మరొకటి ఆనందదాయకం కాకపోవచ్చును. ఇరుగు పొరుగులను గూర్చి తోరో వ్రాసిన విషయాలు అందు సంగ్రహింప బడ్డాయి. వారి యందు తోరో ఎంత శ్రద్ధ వహించేవాడో విద్వాంసులు, మృగ యాపరులు, తిరుగుబోతులు, వలసవచ్చిన వారు సంకరులు, రైతులు, చెట్లుకొట్టేవారు, దేశద్రిమ్మరులు మున్నైనవారియందు అతనికెంత అనురాగ ముందో 'Men of Concord' వ్యక్తీకరిస్తున్నది. బ్రూక్స్ క్లార్కు వంటి వృద్ధులైన అమాయికులతోటి సంపర్కమంటే అతడు మక్కువ పడేవాడు. గొడ్డలిచేత బట్టు కొని త్వరితంగా దారిన పోతుండగా అతనిని కలుసుకొన్నాడు. అతని “వేగిరపాటుకు అతని నగ్నపాదాలపై వీచే ఛలిగాలి హేతువుకావచ్చును.” తన పాదరక్షలలో చచ్చిన రాబిన్, అడవి యాపిల్‌పండ్లు తీసుకవెళ్లాడు. “పాదాలవద్ద లాగు చినిగి వ్రేలాడు తున్నట్లే కోటు గూడ చినిగి అంచులవద్ద వ్రేలుతున్నది. విప రీతపు గాలి రేగుతున్న ఈ అపరాహ్ణ వేళ ఏమి కనిపిస్తుందో చూడాలని బయలుదేరిన చిన్నపిల్ల వానివలె అతడు పర్యవేక్షణకు

బయలుదేరాడు. దుర్బలజీవనుడై వంగిన నడుముతో జీవితపు మలిసంజ అనుభవిస్తూ ఉత్సాహంగా ఉన్న ఈ వృద్ధుని సందర్శనం నాకు సంతృప్తి కలిగించింది."

అలెక్ తేరిన్ విచిత్రయువ. అతడు వాల్డన్ అడవులలో ఒంటరిగా చెట్లు కొట్టేవాడు. అతనిది ప్రాకృత విగ్రహం. శరీరం స్థూలమై అలసంగా ఉండేది. ఎండపోకి ఎర్రబారిన మెడతో నల్లని దట్టమైన వెండ్రుకలతో నిద్రమత్తు లొలికే నీలికన్నులతో అందంగా నడిచేవాడు. తరువాత మొలిచే పిలకలు బలీయంగా ఉండాలనీ, హిమచరశకటిక (Sled) మ్రోళ్ళపై జారిపోవటానికి వీలుగా ఉండాలనీ అతడు చెట్లను నేలకంట ఛేదించేవాడు. అందువల్ల అతనిలో నాకు ఆసక్తి కలిగింది. సంతృప్తి మంచితనం అతని కన్నుల నుంచి ఉబుకుతుండేవి. అతని సంతోషం నిర్మలం. ప్రకృతి అతనిని నిర్మిస్తూ ధృఢశరీర సంతృప్తులను భాగధేయంగా ప్రసాదించి నిండు డెబ్బదేండ్లు శిశువువలె బ్రతకమని భక్తి విశ్వాసాలను అతనికి ఎల్లప్రక్కలా పోటీపెట్టింది. "ప్రపంచం మారిపోవడం నీకు సమ్మతం కాదా" అని ప్రజ్ఞాశాలియైన ఒక సుప్రసిద్ధ సంఘసంస్కర్త అతనికి ప్రశ్నించాడని విన్నాను. దానికి ఆశ్చర్య సూచకంగా నవ్వుతూ అట్టి ప్రశ్న మున్నెన్నడూ కలుగనట్లు కెనడా యాసతో "లేదు, యథాతథంగా ఉంటేనే బాగుంటుంద"ని అతడన్నాడు.

రూబెన్ రైస్ అనే వ్యక్తి ఉన్నాడు. స్వయం సంపూర్ణత కలిగి పొదుపరియై జీవితసారం అనుభవిస్తున్నాడు. అతడు నెమ్మదిగా పూర్తి అవుతుందన్న విశ్వాసంతో పనిచేస్తూ ఆ పనితో ఆనందం పొందేవాడు......జార్జి మెల్విన్ అనే వ్యక్తిచేత తుపాకి పట్టుకొని వేటకుక్కను వెంట తీసుకొని పొలాలుచుట్టూ తిరుగుతూ తోరోకు తరచుగా తగిలేవాడు. అతనిని గూర్చి తోరో

ఇలా వ్రాశాడు. "తన తల్లికి అగ్నిపరీక్ష అయిన మెల్విన్‌ను ప్రసాదించిన 'నా' అదృష్టానికి కృతజ్ఞుణ్ణి. పర్వత పార్శ్వమందలి యాపిల్‌పండు రంగువలె నాకు అతడు ఇష్టుడు........అతడు నాకు సమకాలికుడు. పొరుగువాడు. అతనిది ఒక తెగ. నాది మరొక తెగ. మా ఇద్దరకూ స్పర్ధలేదు." దేశదిమ్మరి బిల్ వీలర్ ఉన్నాడు. అతడు ధాన్యపు కొట్లలో నిద్రించేవాడు. ఏకాంత సంచారం చేసేవాడు. పనిలో వేలు పెట్టేవాడు కాడు. అతనికి "నా" అనేవారు లేరు....ఏ ఆశలులేవు....ఇతరుల సదభిప్రాయం అతనికి అవసరం లేదు. గోదురు కప్ప తోటమాలిని వలె అతడు పక్షపాత శూన్యదృష్టితో నిర్లిప్తంగా వస్తువులను తిలకించి ఉండడా?" ఒంటికంటి వాడైన జాన్ గుడ్విన్ ఉన్నాడు. చేపలు పట్టి ఏటిలో కొట్టికొని వచ్చిన కట్టెలు ప్రోగుచేసి యథాప్రాప్తంగా పనిచేసి ఏదో విధంగా బ్రతుకు వెళ్ళ మార్చుకొనేవాడు. అతనిది కష్టపు బ్రతుకే, అయినా అతడు సుఖంగానే ఉన్నట్లు కనిపించేవాడు." కంకార్డు బెస్తలను తోరో మెచ్చుకొనేవాడు. గార్‌ఫీల్డు, మైనర్, పఫ్ఫర్, హెన్జ్‌నుంచి విసుగులేక పికరల్, పర్చ్, టర్టిల్ కథలు వినేవాడు. వారందరూ తత్త్వవేత్తలని గ్రహించాడు. "నిరాడంబరులై పలుకరిస్తేనేగాని పలుకని ఈ పొరుగు వారంటే నాకు ఎంతో మక్కువ. తమ పనియేమో తామేమో. నన్ను నా దారిని పోనిస్తారు. వేయస్, హోమర్, క్రీస్తు, షేక్స్పియర్లకే గాదు మైనాట్, రైస్, మెల్విన్ గుడ్విన్, పఫ్ఫర్లు గూడ జీవించి నందుకు నేను భగవంతునికి కృతజ్ఞుణ్ణి."

కంకార్డులోని ఒక రైతులో విశాలదృష్టి, బుద్ధి అతనికి కనిపించాయి. ఎమర్సన్ కూడ అతని వద్దకు లౌకిక వ్యవహారాలలో సలహా పొందే నిమిత్తం వెళ్ళేవాడు. అతని దృఢమైన

ప్రకృతి ప్రజ్ఞను హాతారన్ మెచ్చుకొనేవాడు. ఎడ్మండ్ ఆజ్మర్ కు, ఋజువృత్తితోడి చర్చలంటే ప్రీతి. అతనికీ తోరోకు ప్రకృతిసిద్ధ సాజాత్యం ఉన్నది. ఆ వివేకియైన కర్షకుని ఇలా వర్ణించాడు. "దూరంనుంచి అడవులు దాటి సాంఘిక సల్లాపంకోసం వచ్చేవాడు. పశువుల దొడ్లోనుంచి పెంటప్రోగును గ్రహించడానికి ఆయత్త పడుతున్నట్లే అతడు చర్చనుంచి రాజ్యంనుంచి నీతిని గ్రహించ డానికి ఆయత్తపడేవాడు. ఉల్లాసకరమైన చలిగాలిలో గన గన మండే పెనునెగళ్ళ ప్రక్కన నిర్మలమనస్కులై మానవులు కూర్చున్న అనాగరిక కాలాన్ని గూర్చి మేము మచ్చుడించు కొన్నాము."

---

122

# అధ్యాయము 9

"నేను బ్రతికివుంటే ప్రకృతి శాస్త్రాన్ని గూర్చి చెప్ప వలసినది చాలా ఉంటుంది. అయినా వృక్షశాస్త్రంలో నేను ఏ ప్రత్యేక అంశంలోగాని, తత్సదృశ విషయంలోగాని నియుక్తుడను కాను."

—తోరో (మార్చి 1862 నాటి ఒక లేఖలో)

హాతారన్, తోరో లిద్దరూ వేసవిలో పెక్కు సుఖతర సంచారాలు చేశారు. చలికాలంలో హిమతలో పరిశీలనం కావించారు. హాతారన్ తరచు ఓల్డు మాన్సు (Old Manse)వద్ద హెన్రీకి ఆతిధ్యమిచ్చేవాడు. చిన్న పడవను ఎలా నడపాలో తోరో అతనికి నేర్పాడు. కంకార్డు మెర్రీమాక్ నదులపై జాన్ ఆతడూ పడవ ప్రయాణంచేశారు. "తోరోకు వినయ విధేయతలున్నా సంస్కారం తక్కువ. కొంత వరకు అనాగరీకుడుగా కనిపిస్తాడు," అని

హాతారన్ దినచర్య పేర్కొన్నది. "హాతారన్ అమాయికుడు. పిల్లవానివలె ఉంటాడు," అని తోరో దినచర్య చెబుతున్నది.

1854 "వాల్డన్" అన్న గ్రంథం వెలువడిన తరువాత సంస్కృతి సంపన్నులందు అతని స్నేహం విస్తరిల్లింది.... న్యూ బెడ్‌ఫర్డ్ క్వేకర్ అయిన డేనియల్ రికెట్సన్ ఆ పుస్తక పాఠకులలో ఒకడు. పెక్కుసార్లు అతడు తోరోకు ఆతిథ్య మిచ్చాడు. కంకార్డుకు గూడ అతడు వస్తుండేవాడు. క్వేకర్ మతశాఖా సహజాలైన నిష్ఠలు, నియమాలు తోరోకు నచ్చివుంటవి. వారిద్దరూ ఆప్తమిత్రులై విడువక ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపుకొంటూ వచ్చారు. తోరో ఉత్తరార్ధ జీవిత విశేషాలు అతనికి బాగా తెలుసు. యాత్రికుడు రచయిత తత్త్వవేత్త "ష్రాప్‌షైరు" నివాసి న్యూజీలెండుపై గ్రంథం వ్రాసినవాడు అయిన థామస్ చమ్లీ అన్న ఆంగ్లేయుడు కూడా ఈ పుస్తకంవల్ల తోరోకు మిత్రుడయ్యాడు. తోరోకు వలెనే అతనికే ప్రాచ్యమైన భక్తివిజ్ఞాన యోగవైరాగ్య వాదంలోను (Mysticism) పాశ్చాత్యవిజ్ఞాన శాస్త్రంలోను ఆశక్తి ఉన్నది. ఎమర్సన్ సందర్శనార్థం అతడు కంకార్డుకు వచ్చాడు. కాని అతనికి తోరోయే ఎక్కువ నచ్చాడు. మరుసటి సంవత్సరమే అతడు తోరోకు 44 సంపుటాల భారత రచనలు ఇంగ్లండు నుంచి పంపాడు. "వాల్డన్" వెలువడిన సంవత్సరానికి యువోపాధ్యాయుడైన ఫ్రాంక్లిన్ బి. శాన్‌బర్న్ కంకార్డుకు వచ్చాడు. అతడు ఎమర్సన్‌కు శిష్యుడు. తోరోలో అతనికి భక్తి గౌరవాలు ఏర్పడ్డవి. ప్రజల భోజన సదుపాయ కల్పనకు సర్వదా సన్నద్ధురాలుగా ఉన్న హెన్రీ జనని అతనికి మూడు సంవత్సరాలుపాటు అనుదినం భోజనం తయారుచేసి పెట్టింది. ఈ విధంగా అతడు తోరో కుటుంబంలో సభ్యుడై అద్దాని పారమార్థిక విశ్వాసాలలోను

సంఘ సంస్కరణాలలోను సానుభూతి గలిగి తోరోకు సన్నిహితుడై అతని గుణగణాలను తెలిసికొనడానికి మహత్తరావకాశం పొందాడు. దానిని వినియోగించుకొని ఆ తరువాత అమూల్యమైన అతని జీవిత చరిత్ర వ్రాశాడు.

మొట్టమొదటగా తోరో జీవిత చరిత్ర వ్రాసినవాడు ఎల్లరీ చానింగ్. ఆవేగపరుడు అతి పారమార్థిక వాది అయిన చానింగ్ తోరోకు సన్నిహిత సహచరుడు. అయినా తోరో తన దినచర్యలో పేర్కొన్న అనుమానాలు, సంశయాలు అతనికి గూడా చెప్ప లేదు. ఎంతో దూరం నుంచి లోతైన మంచులో పడి భయంకర మైన గాలివానకు కూడ వెరవక మడుగు ప్రక్కన ఉన్న అతని కుటీరానికి వచ్చిన కవి చానింగ్. అతనిని గూర్చి పరిహాస పూర్వ కంగా తోరో ఇలా వ్రాశాడు. "కర్షకునినైనా, వేటకానినైనా, సైనికునినైనా పత్రికావిలేఖరినైనా, తత్త్వవేత్తనయినా భయం నివారించ వచ్చునేమోకాని కవిని మాత్రం ప్రపంచంలో ఏదీ నివారించలేదు. ఎందుకంటె అతడు నిర్మల ప్రణయి." తత్త్వ శాస్త్రానికి వలసిన బుద్ధినైర్మల్యంతోపాటు భోజన సంప్రీతిని యవల అంబిలి సమకూర్పగా వాల్డన్‌వద్ద హేమంత సాయంతన సమయాలు పెద్దపెట్టు నవ్వులతో గంభీరమైన చర్చలతో గడచి పోయాయి. ఉత్తర దశలో లభించిన మరొక ముఖ్య మిత్రుడు, హారిసన్ బ్లేక్. ఇతడు మెసచూసెట్సులోని వార్‌స్టర్ నివాసి. హార్వర్డులో ఉండగా ఇతనికి తోరోతో స్వల్ప పరిచయం ఉండేది. "డయల్" పత్రికలో తోరో వ్యాసాలు చదివాడు. పెక్కు సంవత్సరాలు నీతులు బోధించే సుదీర్ఘ లేఖలు తోరో నుంచి ఇతనికి వస్తుండేవి. ఈ లేఖలలో రచయిత ఉత్తమ శైలి కనిపించదు. కాని జీవిత చరిత్రకారునకు ఉపయోగపడే విషయాలు పెక్కులున్నవి.

ఈ లేఖలలో తోరో తన హృదయాన్ని విప్పి చూపాడు. బ్లేక్ ఆహ్వానాన్ని పురస్కరించుకొని తోరో ఇంచుమించు ప్రతి సంవత్సరం వార్స్టరులో ఉపన్యసించేవాడు.

"న్యూయార్కు ట్రిబ్యూన్" పత్రికా సంపాదకుడైన హారేస్ గ్రీలీ తుదివరకు తోరోకు సాహిత్య వ్యాపార ప్రతినిధిగా పని చేసాడు. ఒక్కొక్కప్పుడు చేతిడబ్బు వదల్చుకొనేవాడు. (ఒక సారి అతడు తోరోకు 75 డాలర్లు బయాణాగా ఇచ్చాడు.) ఇక ఆల్కాటు ఉన్నాడు.అతని కుమార్తెలు పెరిగి పెద్దవారవుతున్నారు. అయినా కుటుంబపు ఆర్థికభారం పూర్వంవలెనే ఆధ్యాత్మికవాదులైన వారి భుజస్కంధాలపై అంతగా పడేదికాదు. ఆల్కాట్ అనాచరణీయ సామాజిక ప్రారంభాలలో తోరోకు విశ్వాసం లేకపోయినా అతని ఋజుపద్ధతి, భయవిరహితమైన ఆలోచన అతడు మెచ్చుకున్నాడు. వేసంగిభవనాలను ఆల్కాట్ సమర్థతతో నిర్మించలేకపోవచ్చును. "అయినా మా ఇరువురి కలయికకు అవరోధాలు లేవు." అతనికి నిర్దిష్ట సిద్ధాంతం లేదు. ఏ సంస్థకు అతడు బద్ధుడుకాడు. నాకు తెలిసినంతలో అంత బుద్ధిమంతుడు మరొకడు కనిపించలేదు," అని తోరో వ్రాశాడు.

అతని జీవితంలో స్త్రీల తోడిచెలిమికి లోటులేదు. కాని అందమైన యువతులనుమాత్రం అతడు పరిహరించేవాడు. దానిని తనవి లక్షణతగా అంగీకరిస్తూ అతడిలా వ్రాశాడు. "ఈ విషయాలలో నాయందొక శక్తి లోపించిందంటే ఒప్పుకొంటాను. కాని ఒక యువతికి ముక్కు మొగం తిన్నగా ఉన్నంతమాత్రాన ఆమెతో ఒక అరగంట ముచ్చటించినందువల్ల నా కెలాంటి సంతోషమూ లేదు. నా అనుభవంలో యువతీ సాహచర్యం ఏ మాత్రం లాభదాయకంగా కనిపించలేదు."బహుశః ఆ అభిప్రాయానికి ఆ బ్రహ్మ

చారి భగ్నహృదయం కారణం కావచ్చు. ఎలెన్ స్యూయల్ స్మృతి బహుశః ఇంకా అతని మనసులో మెదలుతుండవచ్చును. కారణమేదైనా ఎలెన్ అనంతరం లిడియన్ ఎమర్సన్, ఆమె సోదరి లూసీ జాక్సన్, బ్రౌన్ వంటి మహిళలతోటి నిర్లిప్త స్నేహంతో సంతృప్తి పొందాడు. మొదటి యాపె కాలం గడిచిన కొలదీ బెట్టుగా ఉండేది. ఇంక రెండవ యాపె విషయం. తోరో ఇరువది ఏండ్లవాడై ఉండగా కిటికీగుండా వయరేట్ పూలతో (Violets) పాటు ఒక గేయం ఆమె గదిలోకి విసిరివేశాడు. కంకార్డు ఉత్తమ వృద్ధాంగన, ఎమర్సన్ బంధువు అయిన మేరీ ఉండేది. ఆమెకు మంచి తెలివితేట లున్నవి. తరచుగా తోరో ఆమె ఇంటికి వెళ్లి మాటాడుతుండేవాడు. పర్యుత్సుకత గొలిపే అతని సల్లాపం విని అమె సంతోషించేది. మత విషయంలో అతనికున్న అభి ప్రాయాలు విని భయపడేది. "నా చిన్నతనంలో ఇలాంటి ఉపజ్ఞా పూర్వక ప్రవృత్తి ఆచారంగా ఉండేది కాదు" అని ఆమె అతనితో అన్నది. అయినా ఎనభై యేండ్ల ఆ వృద్ధాంగన బుద్ధి సుగ్రాహి. అతని దృక్పథాన్ని సానుభూతితో ఆమెవలె అర్థం చేసుకోవడానికి కంకార్డులో మరి ఏ యువ సిద్ధపడలేదు.

ఇక ఎమర్సన్ విషయమేమిటి? బయటికి మాత్రం కాల క్రమానవారు సన్నిహితులవలె కనిపించారు. అతని ఇంటికి తోరో వెళ్లుతూనే ఉన్నాడు. పూర్వంకంటె ఎక్కువ తరచుగా ఆ మిత్రు లిరువురు కలిసి ఉద్భిజ్జ పరిశీలనార్థం బయటికి వెళ్లేవారు. అపరాహ్ణ విహారాలలో పరస్పర సాహచర్యంతో వారు సుఖంగా ఉన్నట్లు కనిపించేవారు. కాని వాస్తవానికి వేరయ్యారు. ఎమర్సన్ దంపతుల ఇంట జరిగిన సాయంతన చర్చలలో వారి వేరిమి విస్తరిల్ల సాగింది. ఇంక వారు సుమన్వితంగా సత్యాన్వేషణ సాగించే

సమరసాత్మలుకా లేకపోయారు. ఆ తత్త్వవేత్త లిరువురు వాద ప్రతివాదాలు సాగిస్తూ పరస్పర సహనభావం కోల్పోవసాగారు. తమ దినచర్య గ్రంథాలలో ఒండొరులపై దోషారోపణ కావించు కొన్నారు. 1853 మేలో తోరో ఇలా వ్రాశాడు. "ఎమర్సన్‌తో మాటాడాను....లేదు....మాటాడ యత్నించాను. నాకు కాల హరణం అయింది. దాదాపు నా వ్యక్తిత్వాన్ని నేను కోలుపోయాను. అభిప్రాయభేదం లేనప్పుడు అసత్యప్రాతి కూల్యం వహించి ఆయన గాలితో మాటాడాడు. నాకు తెలిసిందే చెప్పాడు. అతనిని ప్రతిఘటించడానికై నన్ను మరొకనిగా ఊహించుకొన యత్నిస్తూ కాలాన్ని రిక్తపుచ్చాను." ఈ అభిప్రాయభేదాలను ఎమర్సన్ తన దినచర్యలో ఎక్కువసార్లు పేర్కొన్నాడు. అయితే ఆ సూచనలు కోపనిష్ఠురాలు కావు. పశ్చాత్తాప సానుభూతి పూర్ణాలు 1856 లో అతడిలా వ్రాశాడు: "నాకు తోరో మాత్రమే తెలిసివుంటే సత్పురుషులకు పరస్పర సహకారం అసంభవం అనుకోవలసి వచ్చేది. సత్యంకోసం, సంతృప్తి సంతోషాలకోసం కాక ఎల్లప్పుడూ మేము విజయార్థులమై మాటాడుకోవాలా ? అతనికి కేంద్రీకరణం, నిశితబుద్ధి, ప్రబలగ్రహణం, యథార్థ్య సందర్శ జ్ఞానం, నైతిక ఋజుత్వం ఉన్నవి. అతని వాక్చాతుర్య సృజన సంపదలను గ్రహించలేక పోయాను. అతని మనస్సుతో సంపర్కం అభిలషించి సంవత్సరాల తరబడిగా నేను చేసిన ప్రతి ప్రయత్నం విఫలమై పోయింది. ఎప్పుడూ ఏదో ఒక దోషారోపణం ప్రతిఘటనం, దానితో కాలహరణం శాంతశూన్యత సంభవించేవి." వీరిద్దరూ సమయానుగుణంగా కావించిన సుదీర్ఘ మధురమైత్రీ శ్లాఘనాన్ని వీక్షించినపుడు వీరి వైమనస్యం విచారం కలిగించక మానదు. వారిద్దరూ స్నేహానికి అత్యున్నత స్థానమిచ్చారు.

ఇప్పుడు ఆ ఆదర్శవాదానికి తమ ఆశాభంగాన్ని పణంగా చెల్లించ వలసి వచ్చిందని గ్రహిస్తూవచ్చారు. న్యూయార్కు దాపున ఉన్న పెర్త్ యాంబోయ్‌కి 1856లో ఆల్కాటు, తాను అనక్తి వహించిన నూతన సమాజ సంస్థాపనకోసమై భూమికొలిచే నిమిత్తం హెన్రీని తీసుకొనివెళ్లాడు. ఒక మాసం వారు అటు వెళ్ళిపోయారు. నూతన సమాజంలో కంటె స్థానిక ఉద్భిజ్జాలలో హెన్రీ ఎక్కువ ఆసక్తి చూపించాడు. న్యూయార్క్‌లో మిక్కిలిగా స్తులింపబడుతున్న వాల్ట్ విట్మన్ అన్న కవిని కలుసుకోవటానికి ఒకనాడు వెళ్లాడు. "లీవ్స్ ఆఫ్ గ్రాస్ ("Leaves of Grass") అన్న అతని కృతి ప్రకటనతో సనాతన దృష్టిపరులను అందలి బాహాటమైన ఇంద్రియ లాలనత సంచలనం కలిగించింది. నైతిక నిషాభిమాని అయిన తోరోకు ఆ పుస్తకాస్వాదనం కష్టమయింది. ఏకాంతాభిమానికీ, నగరాభిమానికీ పోటీపెట్టి ఆనందించ వచ్చునని ఆల్కాటు ఆశ పడ్డాడు. కాని ఆ ఇద్దరూ అతిసంయమనంతో సంభాషించారు. అందువల్ల వారి భావ సంఘర్షణతో విస్ఫులింగాలు రాలేదు. సామాన్య వ్యక్తులందు తోరోకున్న ఏవగింపు విట్మనుకు రుచించ లేదు. తోరోకు విట్మన్ వింత మానిసిగా కనిపించాడు. ఎందు కంటె పగలంతా ప్రయాణీకుల బండిలో చోదకుని ప్రక్కన గూర్చుండి ప్రయాణంచేస్తూ బండ్ల రణ గుణ ధ్వనులు వినటం తనకు సమ్మతమనీ ఆ సందర్భాలలో ఆంగికవాచికాభినయ పూర్వ కంగా హోమరును చదవడం ప్రియమనీ అతడు తోరోకు చెప్పాడు. అట్టి విసదృశ వ్యక్తి మరొకడు తోరోకు తటస్థపడ లేదు. విట్‌మన్‌లో మొదట అనుభవ పరిష్కృతం కాని అజ్ఞాత బలం అతనికి కనిపించింది. దానితో అతడు మొదట విముఖు డయ్యాడు. కాని ఆ బలమే ఆ తరువాత అతనికి ఉద్బోధక

మయింది. "లీవ్స్ ఆఫ్ గ్రాస్"ను మరొకసారి చదివి, "చాలా కాలం నుంచి చదువుతూ వచ్చిన పుస్తకాలలో ఏదీ నాకు ఇంత మేలు కావించలేదని వ్రాశాడు. ఆ కావ్యంలోని ప్రధాన ప్రాచీన తను, చిత్తశుద్ధిని ఆనందించ గలిగాడు. తన వలెనే విట్మన్ కూడా స్వచ్ఛమైన మూలశక్తుల వలన ఉద్బోధం పొందుతున్నాడని గ్రహించాడు.

తాత్కాలికంగా ప్రకృతి పరిశీలనను మాన్పి సమకాలిక ప్రపంచ సంఘటనలను మరిపించి తోరోకు 1856లో న్యూయార్కు నగరమూ, విట్మన్ విరామం కల్పించారు. 1850 సంవత్సరపు కాందిశీకపు బానిసల చట్టంతో బయలుదేరిన అతని ఆందోళన "మెసచూసెట్సులోని బానిసతనం" అన్న రచనకు దారితీసి ఉపశమిల్లింది. నేరుగా అనుభూతమైనపుడు దాస్య ప్రతికూలోద్యమాన్ని అతడు సమర్థిస్తూ వచ్చాడు. సంగ్రహంగా, ఉత్తేజకంగా తన అసమ్మతిని ప్రకటించాడు. వ్యవస్థీకృత ఉద్యమ నిర్వహణం మాత్రం తన మిత్రుడు యఫ్. బి. శాన్‌బరన్ వంటి ఉత్సాహులకు వదిలివేశాడు. "మెసచూసెట్సులోని బానిసతనం" అన్న రచన వ్రాసిన తరువాత మూడు సంవత్సరాలకు తోరో ఇంటికి ఒక వ్యక్తి వచ్చాడు. ఆ అగంతుకుని భావాలు, వ్యక్తిత్వం దౌర్భాగ్యం తోరోలో ఆవేశోత్సాహాలను రేకెత్తించాయి. అతడే వృద్ధుడూ సుప్రసిద్ధుడూ అయిన జాన్ బ్రౌన్. అతని నివాసస్థానం కన్సాస్ లోని ఓసావాటమీ. కన్సాస్ మిసోరీలసరి హద్దులలో ఉభయపక్షాలు విశేషంగా రక్తపాతం కావించుకొన్న క్రూరయుద్ధంలో పాల్గొని దాస్య ప్రతికూలోద్యమానికి మద్దతు సంపాదించే నిమిత్తం అతడు 1857లో మెసచూసెట్సుకు వచ్చాడు. అచటి మితవాదులు అతన్ని రక్తపిపాసులైన దురావేశపరుడని భావించినా శాన్‌బరన్, అతని

మిత్రులూ అత్యుత్సాహంతో ఆహ్వానించారు. సహచరులను సంపాదించటానికై అతనిని శాన్‌బరన్ కంకార్డుకు తోడ్కొనివచ్చాడు. బానిసలను అట్టి పెట్టుకొంటున్న రాష్ట్రాలపై వ్యవస్థీకృత ప్రతిఘటన సాగించే విషయంలో తోరో ఉపేక్ష వహించాడు. కానీ జాన్ బ్రౌన్ వ్యక్తిత్వం తోరోను ఎమర్సన్‌ను ఆకర్షించింది. బ్రౌన్ నిశ్చలకార్యదీక్ష ఒకరినుంచి మరొకరికి అలముకొన్నది. ఉత్తర దేశమంతా బ్రౌన్‌ను శ్లాఘించి ఉంటే బహుశః తోరో అంత ఉత్సాహం చూపి ఉండేవాడు కాడేమో! బానిసతనం రద్దు కావాలని కోరేవారిలో కూడా పెక్కు మంది బ్రౌన్‌పట్ల ఉపేక్ష వహించారు. ఈ ప్రవర్తనతో అన్యాయ్య అసమర్థనీయ సంస్థలను ప్రతిఘటించి ఏకాకి అయి ఆదర్శాలకోసం బ్రౌన్ పోరాడుతున్నట్లు తోరోకు కనిపించాడు. బ్రౌన్ తాను సంగ్రహింపగలిగిన ఆర్థిక సంపత్తిలో ఎక్కువ భాగం బాస్టన్‌లోనే సమకూరింది. దీనితో అతడు వర్జీనియాకు వెళ్ళి దాస్య ప్రతికూలదవాలనం అన్ని రాష్ట్రాలలోనూ దరికొల్పటానికి ఏకాకియై యత్నించినప్పుడు ధర్మవంతమైన శాసనోల్లంఘన చిహ్నంగా అతడు తోరోకు కనిపించాడు. బ్రౌన్‌ను పట్టుకొని నిర్బంధంలో ఉంచారన్న వార్త వినగానే తోరో ఉద్వేజితుడై "కెప్టెన్ బ్రౌన్ పక్షాన ఒక విజ్ఞప్తి" అన్న వ్యాసం వ్రాశాడు. అన్యాయ సంస్థపై న్యాయవంతుని కర్తవ్యాన్ని వీరావేశపూరితమైన ఈ వ్యాసంలో తిరిగి ఉద్ఘాటించాడు. బ్రౌన్‌ను విచారించి విద్రోహం హత్య కావించాడన్న నేరం మోపి మరణశిక్ష విధించారు. దాస్య ప్రతికూలోద్యమానికి కోటగా ఉన్న మెసచూసెట్సు రాష్ట్రంలో బ్రౌన్ చర్యను సమర్థిస్తూ ఒక్క మాట గూడ ఏ పత్రికా ప్రకటించలేదు. తన కెంత ప్రజాప్రాతి

కూల్యం ఏర్పడినా, ఏ ప్రమాదం సంభవించినా సరే బ్రౌన్‌కు అను కూలంగా మాట్లాడి తీరవలసినదేనని తోరో సంకల్పించుకొన్నాడు.

ఆ ఉద్యమంనుంచి అతనిని మాన్పించాలని మిత్రులు ప్రయ త్నించారు. కాని అతడు కృతనిశ్చయుడు. జాన్‌బ్రౌన్‌ను పట్టు కొన్న కొలది కాలంలోనే బహిరంగ సభ జరుగుతుందని ప్రక టింపించి ఆ సభలో అతనిని సమర్థిస్తూ అచంచల విశ్వాసంతో ఆవే శంతో తోరో ప్రసంగించాడు. ఆ ఉపన్యాసం విన్న ఎమర్సన్ తన దిన చర్యలో ఇలా వ్రాశాడు. "తోరో ఉపన్యాసం అందరు సగౌరవ బుద్ధితో విన్నారు. పెక్కురు తమకే ఆశ్చర్యం గొలిపే సానుభూ తితో ఆలకించారు." బ్రౌన్‌ను సమర్థిస్తూ బహిరంగ సభలో తొలు దొల్త ప్రసంగించిన అమెరికా దేశీయుడు తోరో. వ్యక్తి స్వాతం త్ర్యం కోసం బ్రౌన్ ప్రశువరింప బడ్డాడని అన్యాయ్య ప్రభుత్వం ఒక సిద్ధాంతంకోసం పోరాడే ఒక వ్యక్తినిబలి గొండున్నదని అత డన్నాడు. "1800 సంవత్సరాల క్రిందట క్రీస్తును సిలువకాహుతి చేశారు. బహుశః నేటి ఉదయాన కెప్టెన్ బ్రౌన్‌ను ఉరిదీసి ఉంటారు. ఈ రెండు సంఘటనలూ ఏకైక శృంఖలాగ్రాలు. ఈ శృంఖల లంకెలులేనిది కాదు." కనీసం ఒక అంశంలోనైనా అతని ఉపన్యాసం యదార్థం భవిష్యాన్ని సూచించింది. "బానిసతసపు దుష్టశక్తులపై సాగించిన ఈ తీవ్ర దండయాత్ర అగేతమై సా స్తుందా?" అని అత డందు ప్రశ్నించాడు. అవును, అది సఫించలేదు. ఆ తరువాత రెండు సంవత్సరాలకు ఉత్తర రాష్ట్రాల సైన్యాలు జాన్‌బ్రౌన్ దండెత్తిన దక్షిణ రాష్ట్రాలపై యుద్ధానికి సన్నద్ధా లవుతూ

"John Brown's body lies a-mould, ring in the grave.
But his soul goes marching on."

అని పాడారు. తోరోకు ముఖ్యం ఆ మానవుని ఆత్మ. ఆ ఉపన్యా

సమే తిరిగి బాస్టన్, వోస్టరులలో ఇచ్చాడు. ఆ తరువాత ఒక మాసానికి అతడు కంకార్డులో ప్రసంగించాడు.

ఆ ఉద్వేగం చల్లారిపోయిన వెనుక అతడు తిరిగి ప్రకృతి వైపు మళ్ళి ఆ తరువాతి సంఘటనలలో జోక్యం కల్పించుకోలేదు. హార్పర్స్ ఫెర్రీవద్ద బ్రౌన్ సాగించిన కార్యకలాపాల వలన గలిగిన రాజకీయ పర్యవసానాలు అతని కంతగా పట్టలేదు.

ఆ తరువాత రెండు సంవత్సరాలకు ఉత్తరదేశం బ్రౌన్‌ను వీరునిగా భావించి తొల్లి విఫలీకృతాలైన అతని బోధనలనే తిరిగి ఆచరించ సాగింది. అయినా దానితో తోరో ఏ మాత్రం కదల లేదు. దక్షిణ రాష్ట్రాల యావచ్ఛక్తిని బ్రౌన్ ఏకాకియై ఎదుర్కొన్నాడు. ఈ దృశ్యంతో పోల్చుకొంటే ఉత్తర రాష్ట్రాలు దక్షిణ రాష్ట్రాలపై సాగించిన యుద్ధదృశ్యం అతనికి నిరుత్సాహం కలిగించింది.

తోరో ఎన్నడూ ఆరోగ్య సంపన్నుడు కాడు. హార్వర్డులో చదువుకొంటున్న రోజులలో మూడు మాసాలు శ్వాసకాస పీడితుడై ఇంటివద్దనే నిలిచిపోయాడు. ఆ తరువాత అప్పుడప్పుడు అతని రొమ్ము బాధ పెడుతూనే వచ్చింది. తరచు పడిసెం పట్టేది. అయినా శారీరక దౌర్బల్యాన్ని అతడు అంతగా సరకుచేయనక్కర లేదనుకునే వాడు. తన ఒంట్లో ఎలా ఉన్నా, వెలుపల వాతావరణం ఎంత ఘోరంగా ఉన్నా విధిగా అతడు బయటకు వెళ్లుతూనే ఉండేవాడు. కాని 1855లో వచ్చిన జబ్బు అతనిని రెండు సంవత్సరాలపాటు దుర్బలునిచేసి ఆందోళన పరచింది. ఎలాగో దాని నుంచి తేరుకొని అతడు 1857 నుంచి 1860 వరకు తిరుగుతూనే ఉన్నాడు. పర్వతారోహణం జరిగిపోతూనే ఉన్నది. తరుగని ఉత్సాహబలంతో భూమి కొలతలు, రచనలు, ఉపన్యాసాలు సాగి

స్తునే ఉన్నాడు. 1860లో అంటే అతని 43వ యేట ముఖ్యంగా జాన్ బ్రౌన్ సమర్థనలో ప్రముఖ పాత్రని నిర్వహించిన వెనుక అతడు గొప్పతనం మెట్టాడని అతని మిత్రులు భావించారు. రచయితగా, ఉపన్యాసకుడుగా అతని ఖ్యాతి పెంపొందుతున్నది. ప్రకృతిని పరిశీలించి వ్రాసికొన్న అతని సంపుటాలు సంగతి తెలిసినవారు ప్రకృతిశాస్త్రంలో అతడు అత్యంత ముఖ్య గ్రంథం వ్రాస్తాడని భావించారు. 1860 ప్రారంభంలో అతడిలా వ్రాశాడు. "ఒక విషయాన్ని ఎక్కువ ఆలోచించిన కొలది నీవు ఇంక అధికంగా వ్రాయగలవు. ఆలోచనవల్ల ఆలోచన ఉద్భవిస్తుంది. అది నీ చేతులలో వర్ధిల్లుతుంది." ప్రతిభా విరహితుని ప్రపంచ చరిత్ర కంటె ప్రతిభావంతుడు తన పేట చరిత్రను ఎక్కువ కుతూహల జనకంగా వ్రాస్తాడని అతడు వ్రాశాడు. అలాంటి ప్రతిభ తన కున్నదని అతడు నమ్మి ఉండవచ్చును. స్థానిక ప్రకృతి చరిత్రకై సంపాదించిన విషయానికి తోడు, ఇండియన్లను గూర్చి దశలక్ష పద పరిమితమైన వస్తువు సమకూర్చుకొన్నాడు. ఒకనాటికి దీనికి గూడ పుస్తకరూపం కల్పించాలనీ అతని సంకల్పం. అయితే తొందర లేదనుకొన్నాడు. నిజశరీరస్థితి అతనికి ఎప్పటి వలనే సంతృప్తికరంగానే ఉన్నది. ఇంకా మరొక 40 సంవత్సరాల మనిషికి ఇబ్బందిలేదని అతడొక మిత్రునికి చెప్పాడు.

1860 నవంబరులోని చలి నెమ్ములతో తోరోకు తీవ్రమైన శైత్యంచేసి రొమ్ముకు ప్రాకింది. ఆ శీత ఋతువంతా అతడు గ్రామందాటి బయటికి వెళ్ళినది అరుదు. 1861 వసంతకాలం నాటికి చాల దుర్బలుడయ్యాడు. మేలో తన వృక్షశాస్త్రమిత్రుడైన హొరేస్ మేన్‌తో కలిసి వాయవ్యంగా మినిసోటా పొడి వాతావరణంలో ఆరోగ్యం చేకూర్చుకొందామని వెళ్ళాడు. అక్కడ ఆదిమ

వాసులైన ఇండియన్లను గూర్చి తెలుసుకోవాలని ఆశించాడు. అచట సియో అనే ఇండియన్లు తెగల జీవితం గడుతున్నారు. రోగగ్రస్తునకు అది కఠోర ప్రయాణమే. ఎనిమిది వారాలపాటు రైళ్ళమీద, బండ్లమీద, స్టీమర్లపైన పయనింప వలసివచ్చింది. కంకార్డు మహాపాదచారికి అంతకంటె నీచప్రయాణం మరొకటి ఉండదు. అతడు ఇండియన్లను, నయాగరాను, ఎగువ మిసిసిపీని, నూతన ఉద్భిజ్జాలను విచిత్ర పక్షులను సందర్శించాడు. యువశక్తి నశించింది. బయలుదేరిన నాడు ఉన్నంత అనారోగ్య స్థితిలోనే అతడు ఇంటికి తిరిగివచ్చాడు. అతని తండ్రి అంతకు మూడేండ్ల క్రితమే మరణించాడు. కాని అతని ఉపచారాలకు జననీ సోదరులు ఉన్నారు. శీతర్తువు నాటికి రోగం తన్ను బ్రతకనీయదని గుర్తించి దానికి ఆయత్తుడయ్యాడు. ధీరచిత్తుడై జీవితంనుంచి తాను పొంద వలసిన సుఖం పొంద నారంభించాడు. తుది ఆరు మాసాలు ఒంటరిగా లేడు. ఆ కాలం రిక్తపుచ్ఛలేదు. అతని వద్దకు పెక్కురు వచ్చేవారు. సోదరి సోఫియా సాయంతో "అట్లాంటిక్ మంత్లీ" పత్రిక వ్రాసిపంపమని కోరిన పెక్కు వ్యాసాలను తిరిగి సంస్కరించాడు.

ఉదాహరణీయ సూక్తి నిధానోత్తముడైన తోరో తుది వరకు అలాగే ఉన్నాడు. మరణశయ్యపై నుండి తన స్వతంత్ర జీవితాన్ని సమర్థిస్తూ అతడన్న మాటలు ప్రసిద్ధి కెక్కాయి. ఒక ప్రాత పరిచితుడు "పరలోక యాత్రా సుఖమేమయినా ఆలోచించావా?" అని అడిగితే, "మిత్రమా! ఏక కాలంలో ఏక ప్రపంచాన్ని గూర్చే ఆలోచించాల"న్నాడు. "నాయనా, ఈశ్వరునితో శాంతి కుదుర్చుకొన్నావా?" అని మేరీ ఆతురతతో ప్రశ్నించగా, "ఆయనతో నే నెన్నడూ తగాదా పడలేదే" అని అతడన్నాడు. ఒక

నాటి రాత్రి తోరోను గ్రామీణ కారాగారంలో బంధించి ఉంచి ఒక ఉత్తమ రచనకు కారకుడైన గ్రామ పాలకుడు శామ్ స్టేపుల్స్ అతనిని సందర్శించి వచ్చి, "ఇంత సంతృప్తి సౌఖ్యాలతో మరణించే వ్యక్తిని నే నెన్నడూ చూడలే"దన్నాడు.

ఆ శీతర్తువు అలాగే గడచింది. వసంతం ఉచ్ఛస్థితిలో ఉండగా 1862 మే 6వ తేదీన అతడు అస్తమించాడు. అతని నోటినుండి కడసారి "మూస్", "ఇండియన్" అన్న పదాలు వెలువడ్డవి.

కంకార్డులోని నూతన శ్మశానంలో అతనికి ఖనన సంస్కారం జరిగిపోయింది. అంత్యకర్మల సందర్భంలో 25 ఏండ్ల క్రిందట తోరో లూసీ బ్రౌన్ వాతాయనం ద్వారా విసరివేసిన పద్యాన్ని ఆల్‌కాట్ పఠించాడు. ఎమర్సన్ ఆవేశపూరితుడై ప్రసంగించాడు. ఆ ప్రసంగాన్నే తరువాత పెంచి వ్యాసరూపాన ప్రకటించటం జరిగింది. తోరో పై వ్రాయబడిన వ్యాసాలన్నిటిలో ఈ నాటికీ అది ఉత్తమ రచన.

*　　　*　　　*　　　*

అపారంగా సంగ్రహించుకొన్న విషయాలను, వ్యాసాలను ఒక క్రమంలో పెట్టటానికి తోరో తన కడపటి మాసాలలో క్షీణిస్తున్న శక్తిని వినియోగించాడు. "అట్లాంటిక్ మంత్లీ" అన్న పత్రికకు "వాకింగ్", "ఆటమ్నల్ టింట్సు" "వైల్డ్ ఆపిల్సు" అన్న వ్యాసాలను సిద్ధపరిచాడు. తరువాత 1862లో ఇవి ప్రకటించబడ్డవి. మూడు సంవత్సరాలలో "ఎక్సకర్షన్స్", "మెయిన్ వుడ్స్", "కేప్ కాడ్" అన్న అతని కృతులూ, ఎమర్సన్ ఏర్చి కూర్చిన అతని లేఖల సంపుటీ వెలువడ్డాయి. అనుదినం అతడు సాగించిన పరిశీలనలూ, భావనలూ, రచనలూ, వ్రాత ప్రతులు

రూపంలో నిలిచిపోయాయి. కొన్నిటికి అకారాది సూచికలు కూడ ఉన్నవి. ఈ సంపుటుల నుంచి తాము ఉత్తమాలనుకొన్న వాటిని ఏరి ప్రచురణకు సిద్ధపరచ వలసిన పని ఇతరులకు వదిలివేయ బడింది. తోరోకు చిరకాలమిత్రుడు వూస్టరు నివాసి అయిన హారిసన్ బ్లేకు పెన్నిధులట్లు సేకరించిన మిత్రుని వస్తువులలో, చేతికర్ర ఒకటి ఉన్నది. తోరో రచనలకు బ్లేక్‌తూచాలు జారనీక చూచే విశ్వాసపాత్రుడైన సంపాదకుడయ్యాడు. అతని లిఖిత సంపుటుల లోని వర్ణనాంశాలపై తన దృష్టిని కేంద్రీకరించి ఋతువులను బట్టి విషయాన్ని వర్గీకరించి "ఎర్లీ స్ప్రింగ్ ఇన్ మెసచూసెట్సు," "సమ్మర్", "ఆటమ్", "వింటర్" అన్న నాలుగు ఉత్తమ గ్రంథాలను బ్లేక్ వెలువరించాడు.

1894లో తోరో కృతుల సముచ్చయం మొదటి కూర్పు వెలువడింది. అతని సంపూర్ణ దినచర్యా గ్రంథాలు మాత్రం 1906 వరకు వెలువడలేదు. 19వ శతాబ్ది అంతానికి తోరో మిత్రులైన చానింగ్ శాన్‌బరన్‌లు అతనిని గూర్చి సాకల్యంగా తెలిపే గ్రంథాలు రెండు వ్రాశారు. అవి కొంతవరకే దజ్జీవిత చరిత్రను ప్రతిపాదిస్తున్నవి. ఈ రెంటిలో మొదటిది 1873 లోను రెండవది 1882 లోను వచ్చాయి. ఆంగ్లేయ కృతమైన మొదటి జీవిత చరిత్రను ఫేబియన్ సోషలిస్టు ఆంగ్లేయుడు అయిన హెన్రీ సాల్టు వ్రాశాడు. అతడు పూర్తిగా తోరో అనుయాయి. తోరోను అత డెన్నడూ కలుసుకొనక పోయినా తోరో భావాలను బహుశః చానింగ్ శాన్‌బరన్ల కంటె అతడు చక్కగా అర్థం చేసుకొని ఉంటాడు. సందేశదుకుగా తోరోను చిత్రించిన జీవిత చరిత్రలలో అతడు వ్రాసిన జీవిత చరిత్రే ఉత్తమం.

విస్తృతంగా కాకపోయినా కొంతవరకైనా తన కవిత్వం

వల్ల ప్రకృతి వర్ణనలవల్ల నిరాడంబర జీవిత సందేశంవల్ల తోరో ప్రఖ్యాతి పొందుతాడని అతని మిత్రులు ముందుగానే ఊహించారు. కాని 40 సంవత్సరాలపాటు, ఉపేక్షితుడై ఆ పిదప విశేష విఖ్యాతి పొందుతాడనీ, అందులోను అమెరికా కంటె బ్రిటన్‌లో ఎక్కువ ప్రసిద్ధి పొందుతాడని వారు బహుశః ఊహించి ఉండరు. తోరో సందేశం గ్రహించడానికి 19వ శతాబ్ది తగిన పరిపక్వస్థితి పొంద లేదు. 20వ శతాబ్ది ప్రారంభాన బ్రిటనుసందలి పారిశ్రామిక నగ రాలలోని వికృత దుర్భర జీవన స్థితిగతులపై తిరుగుబాటు బయలు దేరినప్పుడు తోరో సందేశం వినబడసాగింది. స్వచ్ఛంద జీవితం కావాలన్న సంచలనం బయలుదేరింది. వర్గమత భావ సంకుచితా లైన విక్టోరియా కాలిక స్తబ్ధ సంప్రదాయాలపై స్వచ్ఛంద వాయు వులు వీచాయి. బ్రిటీషు కార్మికోద్యమం ఉద్భవించింది. హేతు వాదం విజృంభించింది. బైసికిల్ నిర్మాణ మందేర్పడిన విశిష్టత గాలి వెలుగులను ఉపాసించే వారికి గ్రామీణపు బ్రిటన్‌ను సన్ని హితం కావింపసాగింది. ఈ నూతన సజీవోద్యమానికి వలసిన సాహిత్యం రస్కిన్, మారిస్‌లు అందజేసారు. అయితే విస్తృ తంగా ప్రజలను ఆకర్షించ గలిగిన రచయితలు తోరో, విట్‌మన్, ఎడ్వర్డ్ కార్పెంటర్‌లు మాత్రమే. వీరివల్ల ఒకచే ప్రత్యేక శాఖ బయలుదేరింది. 1899లో ఇ. వి. లూకస్ గద్య పద్యాత్మకమైన "ది ఓపెన్ రోడ్" అన్న సంకలిత గ్రంథం సంతరించాడు. బహుళ ప్రజారంజకమైన ఆ గ్రంథంలో తోరో స్వభావాను గుణమైన పద్య మొకటి చేర్పబడ్డది. ఆ పద్యం ఈ చరణాలతోఅంతమౌ తున్నది.

"The wind that blows
Is all that anybody knows."

నాగరుల గ్రామజీవన కాంక్షను భూత దాత్రీ సాన్నిహిత్య

వాంఛను తీర్చే సాధనంగా తోరో కుటీర జీవనగాథ కనిపించింది. అతడు కొలది నేలను సంపాదించి అరువు తెచ్చుకొన్న గొడ్డలితో కుటీరం నిర్మించుకొని మడుగు ప్రక్కన పశుపక్షి వృక్షగణాల నడుమ అప్పుడప్పుడు వచ్చే కొలది మంది అభ్యాగతులతో ప్రశాంత స్వతంత్ర జీవనం సాగించాడు. అతని దృఢశీలం, నిర్మల హృదయం, సూక్ష్మ పరిశీలనం, నిశితబుద్ధి, పాఠకలోక ప్రస్తుతాలు అను చికీర్షితాలు.

సామాన్య పాఠకలోకానికి అందక అతని దినచర్య గ్రంథాలలో మాత్రమే గోచరించే మరొక తోరో ఉన్నాడు. ఆ తోరో తన్ను గూర్చి తాను విభ్రాంతి పొందాడు. తన నైరాశ్య స్వభావం కాని, తద్విస్తృతిని కాని అతడు ఎన్నడూ అర్థం చేసుకోలేదు. అయితే ఆ రూపాన్ని ప్రపంచానికిగాని, సన్నిహిత మిత్రులకుగాని చూపలేదు. శారీరక దుఃఖ స్థితినుంచి బహుశః వేరు చేయరాని గాఢ దుఃఖమయ క్షణాలు కొన్ని గడపాడు. అయినా అతని దృశ్యమాన ప్రధాన జీవనవాహిని ఆనంద తరంగిత ప్రవాహాలతో వెల్లివొడిచింది. ప్రపంచంలోని తన ప్రాదేశిక ప్రకృతి చరిత్రను అతడు ఉల్లేఖించాడు. ఈ విషయంలో అతడు గ్రామప్రకృతి చరిత్రకారుడు సెల్బరన్ నివాసి అయిన గిల్బర్టు వైట్‌కు సదృశుడయ్యాడు. అతని వలెనే సామాజిక నైతిక సమస్యలలోనూ, తత్త్వశాస్త్రంలోను, సాహిత్యంలోను, ప్రజలలోను అతడు శ్రద్ధ వహించాడు. అయినా అతనిలోని సుస్థిర విశేషం అతని ప్రకృతి శాస్త్రవేత్తృత్వమే.

ప్రజలలో ప్రకృతిని ప్రచారించిన వారు వైట్‌కు వలెనే తోరోకు గూడ ఎంతో ఋణపడి ఉన్నారు. ప్రకృతిని గూర్చి యథాతథంగా మనోహరంగా, ఆవేశరహితంగా వ్రాసే సంప్రదా

యాన్ని బ్రిటన్‌లో 1900 నాటికి డబ్లియు. హెచ్. హడ్సన్ అను సరిస్తూ వచ్చాడు. అమెరికాలోని ప్రకృతి వర్ణి అయిన జాన్ బర్రోస్ తన కడపటి రోజులలో బహు సంఖ్యాకుల తలపును వెల్ల డిస్తూ ఇలా వ్రాశాడు: "తోరో ఒక్కడే ఉన్నాడు. అతనిని నమ ర్పించినందుకు న్యూ ఇంగ్లండు దేవతలకు మనం భక్త్యంజలులు సమర్పించాలి. తోరోకు ఉన్న ఉదాత్త నీతి, ఆ మహానిగ్రహం మున్నైన గుణాలవల్లనే మహా రచయితల కృతులకు సన్ని హితాలైన కృతులు వెలువడ్డాయి. ఆ గుణగణంలో ఏ లేశమైనా నాకు అలవడాలని కోరుకొంటాను."

విభిన్న హేతువులను పురస్కరించుకొని విభిన్న పాఠకులు తోరోను మెచ్చుకోవచ్చును. కాని ప్రకృతితో సన్నిహిత జీవనం సాగించాలని వాదించినందులకే ప్రధానంగా అతనిని ఎక్కువ మంది స్మరిస్తారు. ఈ అంశాన్ని గూర్చి వాల్డన్‌లో అతడు చెప్పి నంత చక్కగా మరెవ్వరూ చెప్పలేదు. అపరిశోధి తారణ్యాం తోను మైదానంతోను పరివృతం కాకపోతే మన గ్రామీణజీవితం స్తంభించిపోతుంది. మనకు వనరూప బలవర్ధకౌషధం కావాలి. అంటే అప్పుడప్పుడూ నీటిలో నడిచిపోవటానికి బిట్టరన్, మెడో హెన్ అన్న పక్షులు దాగి ఉండే అనూపాలు కావాలి. స్నైప్ శకుంత నిర్ఘోషం ఆలించటానికి కచ్ఛభూములు కావాలి. ఆఘ్రా ణించటానికి వన్యవిహంకులాయ నిర్మాణాస్పదాలై రొమ్ము నేల కావించి ప్రాకేమింకు నామక జంతువుల కామిసాలై గుసగుసలు పోయే జలతృణ గుల్మాలు కావాలి. చిత్తశుద్ధితో పరిశీలించి ఎల్ల వస్తువులను తెలిసికొన గోరుతాము. ఈ పరిశీలనం నిరంతరం సాగాలంటే అవి అజ్ఞేయా పరిశీల్యాలుగా, భూ సముద్రాలు అమిత దుర్గాధాలుగా ఉండాలి."

వసంతకాలంలో అతనికి ప్రేమాస్పదమైన సరోవరం ప్రక్కన ప్రకృతి ఉత్సంగంలో అతనిని విశ్రమింపనిద్దాము. సమాధులలో మృతులు నిద్రిస్తుంటారని కొందరి ఊహ. అలా "సమాధులలో విదురించే వారినైనా మేలుకొలిపే నిర్మలోజ్జ్వల రశ్మిలో వనవాహినీ దరులను స్నానమాడిస్తున్న వసంత ప్రభాతాలలో గుట్టనుంచి గుట్టకు, విల్లోవేరునుంచి విల్లో వేరునకు దూకుతూ ఆ మైదానాలకు చొచ్చుకొని పోయాను. అంతకంటె అమర్త్యత్వానికి ప్రబలమైన ఉపపత్తి అక్కరలేదు. ఎల్ల వస్తువులు అట్టి తేజస్సులో వర్తిల్లాలి."






---



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B144 |
| పుస్తకం పేరు | తోరో |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 145 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | iv, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | ch. Ramya |
| పేజీలు విడదీసినది | Thasina |
| స్కాన్ చేసినది | Thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |